

చదువుల తల్లికివే నవ్వుల నీరాజనాలు!
అక్షరాలు దిద్దిన ఈ క్షణాలు!!

ఫొటో: వి. నర్సయ్య

వైవిధ్య నవలావేదిక

సంపుటి: 28 సంచిక: 1

# చతుర

ఫిబ్రవరి 2005 325వ సంచిక

## ఈ సంచికలో...



ఇంకా కుష్వంత్‌సింగ్ జోకులు, ముద్దంశెట్టి అండమ్మ సేకరించిన మంచి మాటలు...

కవర్ పేజీ ఫొటోగ్రాఫర్: మధు ✱ మోడల్: శాండ్రా

# రచయితలకు ప్రత్యేకం

## కథలు-కబుర్లు (3)

"ఇంద్రియాల్ని అర్థం చేసుకోవటమంటే లోకాన్ని అర్థం చేసుకోవటమే. 'బుద్ధి' అనేది మెదడులో వుంటుందనగా విన్నాం. కానీ ఇటీవలి పరిశోధనలు "బుద్ధి హార్మోనులు, ఎంజైమ్‌ల ద్వారా శరీరమంతా వ్యాపించి వుంటుందని" చెబుతున్నాయి. - స్పర్శ, రుచి, వాసన, శ్రవణ, దృష్టి యింద్రియాలు"






అంటూ "ఎ నాచురల్ హిస్టరీ ఆఫ్ సైన్సెస్" అనే పుస్తకాన్ని ప్రారంభిస్తుంది రచయిత్రి డయాన్ ఆకర్‌మాన్. ఈ అయిదు గ్రహణేంద్రియాల గురించిన పరిశోధన, అవగాహనతో పాఠకుల్ని, లోకాన్ని మరింత అర్థం చేసుకోటానికి తోడ్పడుతుంది.

మనం సృజనాత్మక, కాల్పనిక రచనల గురించి మాట్లాడుకుంటున్నాం గదా. ఈ పుస్తకం చదివినా, చదవకపోయినా, ఇంద్రియగ్రహణత గురించి సచేతనంగా ఉంటే అది రచన ప్రక్రియకూ ఉపయోగిస్తుంది. ('కథలు రాయటం' గురించి రాసినవాళ్లందరూ ఔత్సాహిక రచయితలు ఈ పుస్తకం చదివి లాభపడాలని సలహాలిచ్చారు.)

★ ★ ★

ఏమి రాయాలీ అన్న ప్రశ్నకు మూలం 'ఎవర్ని గురించీ' అని. 'కథ చెప్పవద్దు. కళ్లముందు జరుగుతున్నట్టుగా చూపించు' అని కూడా అంటారు. కథకుడు తెరమరుగై పాత్రలు రంగస్థలాన్ని ఆక్రమించినప్పుడు కథ రక్తికడుతుంది. పాత్రల గురించి మీకు (రచయితకు) తెలిసిన సమాచారమంతా పాత్రలకు తెలియవలసిన అవసరంలేదు. ('ఉత్కంఠ'కు కొక్కెం ఇక్కడే ఉందా? )

అసలు కథ చెప్పవలసింది రచయిత కాదు. పాత్రలే. 'సజీవ పాత్రలు' అనే మాట కూడా వింటూనే ఉంటాం. మిగతావన్నీ మరబొమ్మలైనట్టుగా.

కేవలం ఆలోచనల్లో గడిపే పాత్ర, మాట్లాడుతూ, ఆడుతూ, తుమ్ముతూ, తుళ్లుతూ, ఎగురుతూ, గెంతుతూ వుండే పాత్రంత ఆసక్తికరంగా ఉండదు.

విసుగెత్తించే ఈ కథనానికి ఇంగ్లీషులో లాక్షణికులు ఏ పేరు పెట్టినా తెలుగులో

మనం 'సుత్తి' అనొచ్చు.

అంతేకాదు. అన్ని పాత్రలూ ఒకేలా ఉండకూడదు. స్వభావంలో, ఆకారంలో, అలవాట్లలో ప్రతి పాత్రా మరొక పాత్రకన్నా భిన్నంగా ఉండాలని ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరం లేదు. మనుషులు అంటే పాత్రలు పనిముట్లు వాడతారు. ఉదా॥ సూదులు, స్టౌ, గొడ్డలి, సుత్తి, కత్తెర. వీటి వాడకంలో ఏమైనా నాటకీయతకు అవకాశం ఉందేమో ఎప్పుడైనా ఆలోచించారా?

★ ★ ★

ఆరోగ్యమే మహాభాగ్యమని అందరం అంగీకరిస్తాంగద. కాని సృజనాభినివేశం అనారోగ్య లక్షణమంటారు కొందరు. ఉదాహరణలక్కొదవలేదు. దొస్తోవ్‌స్కీ (నేరము శిక్ష, కరమజోవ్ సోదరులు వగైరా) మూర్ఛరోగి. ఫ్లాబర్ట్ (మదాం బోవరీ) కూడా అంతే. మందుల ప్రభావం అతడి రచనల మీద ఉందని కూడా తీర్మానిస్తారు. బోదకాలు లేకపోతే బైరన్ అంత గొప్ప కవిత్వం రాసేవాడా? చిన్నప్పుడు బ్లాకింగ్ (బూట్లపాలిష్) ఫాక్టరీలో పని చెయ్యకపోతే డికెన్స్ పేరు ఈనాడు మనం గుర్తుంచుకునే వాళ్లమా? అనారోగ్యం, బాధ, అపశృతి లాంటివేవో చోదక శక్తులంటారు. (బాధ కవిత్వానికి పర్యాయపదం). కాని జబ్బు మనుషులు, కష్టాలు పడినవాళ్లందరూ గొప్ప కవులూ, కళాకారులూ, రచయితలూ అయినారా? లక్షలమంది బోదకాళ్ల మనుషుల్లో ఒక్క బైరన్, కోట్ల మంది మూర్ఛ రోగుల్లో ఒక్క దొస్తోవ్‌స్కీ.

ఆరోగ్యంగా బతికిన టాల్‌స్టాయ్, జేన్ఆస్టెన్ గొప్పగా రాయలేదా! కాని అవయవ లోపమో, మరో ప్రత్యేకతో రచయితల్ని మిగతావాళ్లకన్నా భిన్నంగా తయారుచేస్తుంది. (స్వయంకృషి ఎలాగూ ఉంటుంది. దాని వెనుక స్వాభావిక విలక్షణత). లోకాన్ని, మనుషుల్ని చూసే దృష్టికోణం ఏర్పడటంలో సహాయం చేస్తుంది. వెరసి అంతర్దృష్టి అలవడుతుందేమో!

మరే లోపాలైనా వీళ్లకు ఆపాదించవచ్చునేమోగాని పిసినారితనం మాత్రం అందులో ఒకటి కాదు. సంపాదించిన దానికన్నా రెట్టింపు ఖర్చు పెట్టి నిత్యం కొత్త అప్పులవేటకు బయల్దేరేవాళ్లు... భావోద్వేగాలనూ, కోరికల్నీ, అణచుకోలేనితనం చాలామందిలో ఉంది. కాని కోరికలున్నంత మాత్రాన ఎవరూ రాయలేరు. కృషీ, అవసరమైనప్పుడు త్యాగమూ కావాలి.

కబుర్లు కట్టిపెట్టి, టీవీ స్విచాఫ్‌చేసి పగటి కలలకు తెరదించి కలం పట్టుకుంటే తప్ప కథ ఊపిరి పోసుకోదు.

వెంట పడుతున్న ఓ యువ రచయితకు సోమర్సెట్‌మామ్ 'ఓ పుస్తకం రాయవయ్యా' అంటూ సలహా ఇచ్చాడట.

"రాయటానికేం లేద"ని రచయిత ధర్మసందేహం.

"అదో కారణం కాదు. గో అహెడ్. రాయి. రాస్తూ పో" అని భుజం తట్టాడట మామ్.

"కథావస్తువు అనేది ప్రత్యేకంగా ఎక్కడా ఉండదు. కథాదృష్టితో చూడగలిగితే రాయలేని విషయమంటూ లేదు. ప్రతిక్షణం, ప్రతి ఉచ్ఛ్వాస నిశ్వాసాల వెనక ఒక కథా దాగివుంది" అన్నారు వర్జీనియావూల్ఫ్.

రోజువారీ జీవితంలో అద్భుతాలనూ, వింతలనూ చూడగలిగే తత్వం రచయితకు. అంతేగాని అద్భుతాలనూ, వింతలనూ వెదుకుతూ గడపకూడదు. కనిపించేది కథ కాదు. దాని వెనక దాగింది కథ.

★ ★ ★

టి. కోరాగెసాన్ బాయిల్ అనే రచయిత డాక్టరేట్ కోసం పరిశోధన గ్రంథమేదీ సమర్పించలేదు. కథల పుస్తకం రాసినందుకే యూనివర్సిటీ ఆఫ్ అమెరికా వాళ్ళు ఆయనకు పిహెచ్.డి. ఇచ్చారు.

– ముక్తవరం పార్థసారథి

**(వచ్చే నెల మరిన్ని విశేషాలు)**

★

జ్ఞానతరంగిణి

# మహర్షి దాతాదయాల్ శివవ్రత్‌లాల్ వర్మన్ గారి సందేశం

# ఆచరించి చూడు!

న్యాయ ప్రియుడైన మనిషే అందర్నీ సమాదరిస్తాడు. ఎవరితో సంభాషిస్తున్నా సభ్యత మర్చిపోకూడదు. మహాత్ములను, ఆచార్యులను, పంథాయిలను, సంప్రదాయిక విషయాలను విమర్శించకూడదు. అనుచితమైన మాటల్ని నోటిద్వారా రానీయకూడదు.

ఏ వాడలో, ఏ వీధిలో నివసిస్తుంటే ఆ వాడలోని మనుషుల హృదయాలను నీవు గెలుచుకోవాలి. వారే మతంవారైనా, ఏ జాతివారైనా వారిని సంతోషపెట్టటంలోనే నీకు మేలుంది.

నీ ఇల్లు ఒక యజ్ఞవాటిక. దాని సుగంధ పరిమళాలను ఇరుగు పొరుగుల ఇళ్ళలోకి కూడా చేర్చాలి. మనస్సు నిర్మలమై వుండాలి. దీని ప్రభావం ఇరుగు పొరుగు వారి మీద పడుతుంది. వాళ్ళంతా నీకు మిత్రులూ, సోదరులూ అనుకోవాలి.

ఇరుగు పొరుగుతో మాట్లాడేటప్పుడు ఈ క్రింది అయిదు అంశాలను విధిగా పాటించాలి. (1) స్వార్థపరమైన ఆలోచనల్ని రానీయకూడదు. (2) ఎదుటివారికి నీ చేతనైనంత ఉపకారం చేయాలని మరువకు. (3) వారికి కీడు కలగాలనే ఆలోచన నీ మనసులోకి రానీయకు. (4) నీవేమైనా వారికి మేలు చేస్తే వెంటనే మరచిపోవాలి. నీకు ఫలానా ఉపకారం చేశానని వాళ్ళకు గుర్తుచేసి చిన్నబుచ్చకు. (5) ఇరుగు పొరుగుతో సంబంధమున్న అంశాల సమస్యలు వస్తే వారి అభిప్రాయాలను కూడా తెలుసుకోవాలి.

అంతేకాదు... (1) ఆహ్వానం లేనిదే ఎవరింటికీ ఉత్సవాలకూ, విందులకూ వెళ్ళకు (2) చుట్టపు చూపుగా ఎవరింటికైనా అతిథిగా వెళ్ళినప్పుడు ఆ కుటుంబ సభ్యులకు ఏ విధమైన మనస్తాపమూ, సమస్య, దుఃఖం కలిగించకు. (3) సాయపడమనీ మొహమాటపెట్టకు. వారి మనసును నీవు కైవసం చేసుకుంటే తమంతట తామే సాయపడతారని మర్చిపోకు. (4) కోరనిదే ఎవరికీ సలహాలివ్వకు. (5) ఎవరికైనా వ్యక్తిగత రహస్యాలను తెలుసుకోవాలని ప్రయత్నించకు. ఎవరి రహస్యాలైనా తెలిసినా వాటిని బయట పెట్టకు. ఎందుకంటే నీ వ్యక్తిగత విషయాల్ని మరొకరికి చెప్పేటందుకు నీవు ఇష్టపడనట్లే వారు కూడా ఇష్టపడరని గుర్తుంచుకో. (6) ఎవరినీ అభాసుపాలు చేయకు. (7) మహాపురుషుల విషయంలో అనుచిత శబ్దాల్ని ప్రయోగించకు. (8) అతిగా మాట్లాడకుండా మితంగా భాషించటం మంచి అలవాటు. విజ్ఞతతో అవసరమైనంత మేరకే జవాబులివ్వాలి. నీ నోటినుండి వెలువడే ఏ మాటైనా ఇతరులకు దుఃఖం, హాని కలిగించరాదు. (9) ధార్మిక విషయాలపై వాదోపవాదాలకూ, విమర్శలకూ, శాస్త్రార్థాల చిక్కులకూ దూరంగా వుండటం నేర్చుకోవాలి. (10) ఉన్నతమైన స్థానంలో కూర్చోవాలని అత్యాశపడకు. నీలో యోగ్యత ఉంటే ఉన్నతస్థానంలో కూర్చునే అవకాశం దానంతటదే వస్తుంది. ఎవరో ఒకరు నిన్ను పైస్థానంలో కూర్చోబెడతారు. లేకుంటే ఆ స్థానానికి అనర్హుడివైతే ఎవరో ఒకరు కిందికి తోస్తారు. అవమానమే మిగుల్తుందప్పుడు.

నీ పై అధికారులను గౌరవించు. కానీ

6 ఫిబ్రవరి 2005 స్వాతి

అనవసరంగా పొగడకు. నీ నటనతో అధికారులు ప్రసన్నులవుతారనుకోకు. వారు వారి మనసుల్లో నీ వాచాలతను ఏవగించుకొని నిన్ను తుచ్ఛుడని అనుకుని నిన్ను వ్యతిరేకించవచ్చు

నీలో దోషం లేనపుడు ఎవరికీ భయపడవలసిన పని లేదు. పవిత్రమూ, పరిశుద్ధమూ అయిన హృదయం కల వ్యక్తి భగవంతునికి కూడా భయపడడు. సంప్రదాయ వాదులు, మతంలోని పెద్దలు ఈశ్వరుని పేరుతో భయపెట్టి ధర్మంపై నడవాలని ఉపదేశిస్తారు. కాని ఈ నియమం పవిత్ర హృదయులకు వర్తించదు. ఇది సాధారణ వ్యక్తులకేనని గ్రహించాలి. సత్యవంతులు ఎల్లప్పుడూ భయరహితులే. భయం చోటుచేసుకున్న మనసులో ప్రేమ పుట్టదు. నిర్భయత్వానికి మరో పేరు ప్రేమ. ఈశ్వరుడు నిర్దయుడూ, అన్యాయవాది కాదు. ఆయనను ప్రేమించి, భక్తి చూపటం నేర్చుకో. కానీ భయపడకు. నీలో సత్యప్రియత్వం ఉంటే ఎంతటి అధికారైనా నిన్ను గౌరవిస్తాడు. అంతేకాని అధికారిపట్లగల భయంతో నీవు నీ వాచాలత ప్రదర్శిస్తే దెబ్బతింటావు. నీ వాచాలతే నిన్ను దెబ్బతీసే ఆయుధంగా మారుతుందని గుర్తుంచుకోవాలి.

ఎవరినీ యాచించకు. చివరికి భగవంతుడినైనా సరే! యాచించి సాయం పొందే ఆలోచన మనసులోకి రానీయకు. అడుక్కునే ఖర్మ మెందుకసలు నీకు? నీకు కాళ్లు, చేతులు లేవా? నీలో బుద్ధి, వివేకం, విచారశక్తి, పురుషార్థం, సాహసం తక్కువగా ఉన్నాయా? ఇన్ని సాధనాలు నీ కుండగా యాచించటం ఎంత నీచం? యుక్తితో సమస్యల్ని పరిష్కరించుకో. ఒక రాజునో, భగవంతుడినో నీవు యాచిస్తావు. భిక్షమడిగే వాళ్ళను నీవు గౌరవిస్తావా? వాళ్ళను నీవెలా హీనంగా చూస్తావో నీవు చేయిచాచినపుడు నిన్ను కూడా వాళ్ళు అలాగే చూస్తారని తెలుసుకో. లేదా అలా చూడబడేటందుకు నీవు అర్హుడివయ్యావన్న మాట!

ఒక దోహాలో సంత్ కబీర్ సాహెబ్ ఇలా అన్నారు.

**యాచించకు యాచించకు కడకు కన్న తండ్రినైనా!**

**విధిమోల సరి సమానమే కదా ఎంతటి వారైనా!!**

**తెలుసుకో! యాచన మరణ సమానం!**
**పెంచుకో! ఎదనిండా కొండంత వివేకం!!**

**అడుక్కుంటే చచ్చినట్లే**
**అస్తిత్వానికి చెదలుపట్టినట్లే**
**లేమితో యాచించినవాడు అధముడైతే**
**ఉన్నా లేదన్నవాడు అధమాధముడే!**

**చేయిచాచి యాచించకు!**
**జీవచ్ఛవమై జీవించకు!**
**తిరిపెమెత్తుటకన్న చావటమే మిన్న!**
**ఇదే సద్గురువు బోధ వినరన్న!**

ఎవరైనా ఏదైనా అడిగితే ఇవ్వటానికి వెనుకాడకు.., వేరొకరితో అడిగించుకునే యోగ్యత నీకిచ్చినందుకు పరమాత్మునికి ధన్యవాదాలర్పించు. నీ మనసును విశాలం చేసే అవకాశాన్ని యాచకుడు నీకిస్తున్నాడు. ఈ అవకాశం మరోసారి రాకపోవచ్చు అందుకే దైవానికి కృతజ్ఞతలు చెప్పుకో. నీ ఉపకారానికి ప్రతి ఫలంగా యాచకుడు నీకు కృతజ్ఞుడై వుండాలని భావించకు.

ఎవరికైనా ఏదైనా ఇస్తున్నప్పుడు దానిని ప్రేమతో, మంచి మనసుతో ఇవ్వు. చిరాకు పడుతూ, అయిష్టంగా, నిర్లక్ష్యంగా అవమానిస్తూ ఇవ్వకు. ఆ విధంగా దానంచేస్తే అది నీకే హానికారకమవుతుంది. దీని ఫలితం బాగా ఉండదు. ప్రేమతో ప్రేమ, నిష్ఠురంతో నిష్ఠురం ఉత్పన్నమవుతాయి.

సేకరణ, అనువాదం: **జ్యోతిరాణి**

# మరో చతురులో!

*హాస్యప్రియులైన 'చతుర' పాఠకులకు ఓ శుభవార్త. 'చతుర'లో మీ ప్రశ్నలకు హాస్యబ్రహ్మ, చతుర చతురానన శంకరనారాయణ సరదా సమాధానాలు ఇవ్వబోతున్నారు. ఏ అంశానికి సంబంధించినవైనా అడగవచ్చు. ఇకనేం! ప్రశ్నాస్త్రాలు సంధించండి మరి. మీదే ఆలస్యం!*

**గతంలో శంకరనారాయణను అడిగిన ప్రశ్నలూ, ఆయన ఇచ్చిన సమాధానాలు ఉదాహరణకు ఇక్కడ ఇస్తున్నాం.**

---

ఎస్.వి.శారద, చిలకలూరిపేట

*ప్ర: మీరు టాటానా? బిర్లానా?*

జ: మీరు వాటా అడగకపోతే టాటానే! నేను ఎవరింటికి వెళ్లినా తిరిగి వచ్చేటప్పుడు టాటా... టాటా... అటుంటారు.

కె.వీరాంజనేయులు, కడప

*ప్ర: బ్రహ్మాండంగా అంటారు. బ్రహ్మ గుడ్డు పెట్టాడంటారా?*

జ: పెట్టాడు బ్రహ్మాండ పురాణంలో. గిరీశమూ, నేనూ చూశాము.

వి.విజయలక్ష్మి, అనంతపూర్

*ప్ర: కవిత్వం రాయాలని ఉంది. అది ఎలా ఉండాలి?*

జ: అనంత'పూర్' క్వాలిటీ ఉండాలి. మ్యాటర్ లేకపోయినా ఫర్వాలేదు, మీటర్ ఉండాలి. చచ్చేటప్పుడు నలుగురిని సంపాదించుకోవాలంటాను. కవిత్వం వచ్చేటప్పుడూ అంతే.

వి.విజయసారథి, శ్రీకాకుళం

*ప్ర: ప్రేమ పరిణామ సిద్ధాంతాన్ని ఒక్కముక్కలో చెప్పండి.*

జ: మనిషి కోతి నుంచి వచ్చాడని డార్విన్ సిద్ధాంతం చెబుతోంది. అయితే మనిషి నుంచి కోతి వస్తున్నాడని ప్రేమ పరిణామ శుద్ధాంతం నిరూపిస్తున్నది. ప్రేమ రూటు సారీ టూ సారీ వయాసారీ అనిపిస్తున్నది. ప్రేమ ప్రేమ అంటూ అబ్బాయి వెంటబడుతుంటే అమ్మాయి 'సారీ' చెబుతుంది. ప్రేమలో పడ్డ తర్వాత పెళ్లి పెళ్లి అని అమ్మాయి వెంటపడుతుంటే అబ్బాయి 'సారీ' చెబుతాడు. వీరిద్దరి వ్యవహారం తెలిస్తే ఇద్దరి పెద్దలు సారీ చెబుతారు.

ఎం.కనకదుర్గ, కుంభకోణం (తమిళనాడు)

*ప్ర: ప్రేమ ఎందుకు దెబ్బతింటుంది?*

జ: 'లేనీ' పోని 'కుంభకోణాల'వల్ల!

వి.కామేశ్వరరావు, బెంగుళూరు

*ప్ర: నిజంగానే భూమి గుండ్రంగానే ఉందంటారా?*

జ: నాకూ అలాగే అనిపిస్తుంది తిరుపతికి వెళ్లి గుండు చేయించుకున్నప్పుడు.

# గ్రామీణ రామాయణానికి నిలువుటద్దం
# 'ఊరుమ్మడి బతుకులు'




**1975** ప్రాంతంలో 'ఊరుమ్మడి బతుకులు'ను ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక కథల పోటీలకోసం సి.ఎస్.రావు రాశారు. అప్పట్లో పాఠకుల్ని ఎంతగానో ఆలోచింపచేసిన ఈ రచన కాలక్రమంలో నాటికగా ప్రేక్షకుల్ని అలరించింది. రేడియోనాటికగా శ్రోతలకు ఆనందం పరిచింది. బహుమతులు పొందింది. తరువాత సినిమాగావచ్చి రాష్ట్ర ప్రభుత్వం తరఫున నందిఅవార్డు కైవసం చేసుకుంది. అదే ఏడాది ఉత్తమ ప్రాంతీయ చిత్రంగా కేంద్రప్రభుత్వ పురస్కారాన్నీ అందుకుంది. కథను నాటికగా మలచడంలోనూ, సినిమాగా రూపొందించడంలోనూ సి.ఎస్.రావే మాటల రచయితగా వ్యవహరించారు. అన్నిచోట్లా విజయపతాకాన్ని ఎగురవేశారు. "ఊరుమ్మడిబతుకులు" కథ వెనుక కథ గురించి అడిగినప్పుడు ఆయన ఇలా ప్రతిస్పందించారు.

"కథలు గాలిలో నుంచి పుట్టవు. మనుషుల బతుకుల్లో నుంచే పుడతాయి. చిన్న గింజ నుంచి చెట్టు పుట్టినట్లు ఎప్పుడో... ఎక్కడో తటస్థపడిన ఒక సన్నివేశం నుంచో... ఒక సంఘటన నుంచో... కథ రూపు దిద్దుకుంటుంది. ఒక సంఘటన ఏడాది కింద జరిగి ఉండొచ్చు. కొన్నేళ్ల తర్వాత కథగా రూపుదిద్దుకోవచ్చు. ఆ సంఘటన రచయిత మనసులో నాని.. పండి కథగా మారొచ్చు. నా జీవితంలో అలా ఒక సంఘటన ఆధారంగా రూపుదిద్దుకుని కొన్నేళ్ల తర్వాత కథగా ఉబికివచ్చిందే 'ఊరుమ్మడి బతుకులు'.

నేను తూర్పు గోదావరి జిల్లాలో మాధవ రాయుడిపాలెం గ్రామంలో పుట్టాను. 11 ఏళ్ల వరకు అక్కడే పెరిగాను. తర్వాత పట్నానికివెళ్లి చదువుకుని ఎం.ఎ., పాసై తిరిగి వచ్చాను. 23వ ఏట అదే గ్రామానికి సర్పంచ్‌నయ్యాను. దాదాపు ఆరేళ్ల పాటు ఆ గ్రామ ప్రజలతో కలిసిపోయి బతికాను. అందువల్ల గ్రామీణ జీవితాన్ని అవగాహన చేసుకునే అవకాశం కొంత కలిగింది. అధ్యయనంచేసే అదనూ దొరికింది. చిన్నతనంలో సాధారణంగా అనిపించే విషయాలు చదువుకుని నేను సర్పంచ్‌గా ఉన్నప్పుడు భిన్నంగా అనిపించాయి. రకరకాల దోపిడీలు అర్థమయ్యాయి. ఉన్నవాళ్లు లేనివాళ్లను దోచుకుంటారు. ఈ ఉన్నవాడు అనే పదం డబ్బున్నవాడికి వర్తించవచ్చు. తెలివి ఉన్న వాడికి వర్తించవచ్చు. చదువు ఉన్నవాడికి వర్తించవచ్చు. దీన్నే శ్రీశ్రీ 'బలవంతుల దుర్బల జాతిని బానిసలుగ గావించార'ని కవితాత్మకంగానే అయినా సూటిగా చెప్పాడు.

**వస్తువు ఎలా దొరికిందంటే?**

మా ఊళ్లో ఊరుమ్మడి కమ్మరిసాల ఉండేది. అంటే ఊరందరికీ సంబంధించిన స్థలంలో ఊళ్లోని భూస్వాములు అంతాకలిసి ఒక కమ్మరి కుటుంబం నివసించడానికి వీలుగా ఓ ఇల్లు కట్టిస్తారన్నమాట. ఇల్లు అనడం కంటే దాన్ని తాటాకు పాక అనడం సరైనది. గ్రామాలలో ముఖ్యవృత్తి వ్యవసాయం కనుక దానికి కావాల్సిన పనిముట్లు. కత్తి, కొడవలి, నాగలి, బండి మొదలైన పనిముట్లను తయారుచేయడం ఊరుమ్మడి కమ్మరిసాలలో ఉండే కమ్మరి బాధ్యత. ఒక్క కమ్మరే కాకుండా ఇంకా కొంతమంది ఊరు



మ్మడి బతుకులు బతికే జనమూ ఊళ్లలో ఉంటారు. నా చిన్నతనంలో ఒక సంఘటన జరిగింది. ఒక అమాయక పేదవాడికి అందమైన భార్య వచ్చింది. కొంతవరకు చదువుకుందా అమ్మాయి. ఆమెకు ఆభరణం పొడవైన జడ. ఒకసారి ఒక భూస్వామి కంటపడిందా అమ్మాయి. ఆ అమ్మాయిని ఎలాగైనా పొందాలనుకున్నాడాయన. కబురు పంపించాడు. ఆమె లెక్క చేయలేదు. రాను పొమ్మంది. భూస్వామి కసి పెంచుకున్నాడు. తన దగ్గరే పనిచేసే ఆ అమ్మాయి భర్తను వేధించాడు. ఆమెకు కానుకలు పంపించాడు. తిప్పి కొట్టింది. తాను కావాలనుకున్న ఏ ఆడదాని గురించి ఇంత తాపత్రయపడలేదా భూస్వామి. వేసవికాలంలో రాత్రులలో ఆరుబయట మంచాలపై జనం పడుకోవడం గ్రామాలలో సాధారణం. అలా అందరితో పాటు ఆరుబయట పడుకున్న ఆ అందమైన అమ్మాయి జడను ఓ రాత్రికి రాత్రి ఎవరో

మొదట్లోకి కత్తిరించారు. తర్వాత దానిని మంచం వద్దే వదిలేశారు. జనం అదో వింతగా చెప్పుకున్నారు. అమ్మలక్కలు ఇది ఆ భూస్వామి పనే అని చెవులు కొరుక్కున్నారు. అతగాడిమాట కాదంటే అంతే మరి...! అని కూడ అనుకున్నారు. ఆ అమ్మాయి ఏడ్చి మొత్తుకుంది. అవమానం భరించలేక భర్తను తీసుకుని ఊరు వదిలి వెళ్లింది. ఈ సంఘటన జరిగిన 12ఏళ్ల తర్వాత మా ఊరికి నేను సర్పంచ్‌ను అయ్యాను. నేను సర్పంచ్‌ను అయిన తర్వాత ఊరుమ్మడి కమ్మరిసాలలో ఓ కుటుంబం వచ్చి స్థిరపడింది. పనిపాటలు చేసుకుంటూ రోజులు వెళ్లబుచ్చుతోంది. పని త్వరగా చేయలేదనో... బాగా చేయలేదనో... తనపని పక్కన బెట్టి ఇంకొకడి పని చేశాడనో ఆ కమ్మరిపై కేకలు వేయడం... తిట్టడం... కొట్టడం కూడ జరిగిన సంఘటనలు అనేకం. ఎదురు తిరిగి సమాధానంచెప్పే ధైర్యం ఆ కమ్మరికి ఉండేది కాదు. కారణం అతను ఊరుమ్మడి సేవకుడు కావడమే...! ఊరుమ్మడి కమ్మరిసాలలో బతకడమే...! అతని భార్య కూడ కాస్త చదువుకున్నదే...! అయితేనేం? నిస్సహాయంగా చూసేదితప్ప ఏమీ మాట్లాడలేకపోయేది.

### ఆ అమ్మాయిలే స్ఫూర్తి

జడ కత్తిరించబడి ఊరు వదిలి వెళ్లిపోయిన ఓ అందమైన అమ్మాయి, కమ్మరిసాలలో ఉండి భర్తపై జరుగుతున్న దౌర్జన్యాన్ని చూస్తూ నిస్సహాయంగా ఉండిపోయిన స్త్రీమూర్తి ఇద్దరూ నా మనసులో బాగా నాటుకుపోయారు.

### పాత్రలకు జవం జీవం తెచ్చాను

మరో పదేళ్లు గడిచిపోయాయి. నేను కథలు రాయడం మొదలెట్టాను. ఒకనాడు ఆ ఇద్దరు స్త్రీ మూర్తులను, వారి భర్తలను తలుచుకుని ఈ పాత్రలు తిరగబడితే ఎలా ఉంటుంది...? అని ఆలోచించాను. ఆ పురుష పాత్రలు రెండు కలిసి 'గన్నయ్య' గానూ, స్త్రీ పాత్రలు రెండు కలిసి 'సీతాలు' గానూ రూపుదిద్దుకున్నాయి. కథ నాటకీయంగా సాగింది. రామాయణంలో రావణాసురుడు సీతను ఎత్తుకుపోతే రాముడు దండెత్తి యుద్ధం చేసి అతన్ని వధించాడు. రాముడిని దేవుడు అన్నారు. ఇక్కడ పేదవాడు తన భార్యను రక్షించుకోవడంకోసం ఒక కామాంధుడిని హత్య చేస్తాడు. ఇలాగే ప్రవర్తించిన మరో కామాంధుడినీ మట్టుపెడతాడు. ఒక్క రావణాసురుడిని చంపిన రాముడు దేవుడైతే, ఇద్దరు రావణాసురుల వంటి పెద్దలను చంపిన 'గన్నయ్య' దేవుడు కాడా...? అనే ప్రశ్నకు ప్రతిరూపంగా తయారైంది 'ఊరుమ్మడి బతుకులు' కథ. ఈ కథ గింజగాపుట్టి వృక్షంగా ఎదగడానికి పాతికేళ్లు పట్టింది. ఇదీ 'ఊరుమ్మడి బతుకులు' కథ వెనుక కథ

- సేకరణ : స్వామి దేశపాక

# చతుర ప్రపంచం

## క్రీడారంగంలో మహిళలు

నేడు దేశమంతటా క్రికెట్ పై మోజు పెరిగింది. ఆబాల గోపాలం ఆ క్రీడ పట్ల అత్యంత ఆసక్తి కనపరుస్తున్నారు. పెద్ద వ్యాపార సంస్థలు ఈ క్రీడకోసం కోట్లాది రూపాయలను స్పాన్సర్ చేస్తున్నాయి. వారు తమ వ్యాపార ప్రకటనలకు క్రికెట్ క్రీడను జోడించి గొప్ప ప్రచారాన్ని పొందుతున్నారు. అందుకు ప్రతిఫలంగా క్రికెట్ క్రీడాకారులకు లక్షలాది రూపాయలు ముట్టచెప్పడం జరుగుతోంది.

మనదేశంలోని ఆటగాళ్లలో, క్రికెట్ ఆటగాళ్లే కాక - స్విమ్మింగ్, బాస్కెట్‌బాల్, అథ్లెటిక్స్ వంటి క్రీడల్లో సహితం ప్రతిభగల క్రీడాకారులు ఎందరో వున్నారు. వారిలో మహిళలు సహితం తమ ప్రతిభ నిరూపించుకొంటున్నారు. వారినందరినీ తగిన విధంగా ప్రోత్సహించడం జరిగితే, ఒలింపిక్స్‌లో వారు కనీసం 3, 4 గోల్డ్‌మెడల్స్ పొందడానికి అవకాశాలున్నాయి!



ఈ దృష్ట్యా మనం చూసినప్పుడు పురుషులు సాధించిన రికార్డులకన్నా, మహిళలు నెలకొల్పిన రికార్డులే ఎక్కువగా ఉన్నాయి. అయితే వారికి అందచెయ్యవలసిన ప్రోత్సాహం గురించి ఆలోచించవలసి ఉంది.

విదేశాలలో పురుషులతో సమానంగా స్త్రీలకు కూడా అన్ని క్రీడల్లో అత్యంత ప్రోత్సాహం లభిస్తోంది! అమెరికాలోని కాలేజిలో చదివే యువతులకు, యూనివర్సిటీలలోని మహిళలకు ప్రభుత్వం క్రీడల నిమిత్తం అధిక ధనాన్ని ఖర్చుచేస్తోంది. ఇందువలన అచ్చటి మహిళా క్రీడాకారులు అధికంగా క్రీడలలో మెడల్స్ పొందుతున్నారు. ఈ విధమైన ప్రోత్సాహం మన దేశంలోని మహిళా క్రీడాకారులకు ఎందుకు లభించడం లేదు? ఇందుకు కారణం - ఆ క్రీడాకారులకు, క్రీడారంగాన్ని శాసించే ఉన్నతాధికారుల స్వార్థం, మూర్ఖత్వం కారణం! అంతేకాక, క్రీడాపండితుల అహంభావం, దుర్మార్గం కూడా మరొక కారణం! ఆ ఘనాపాఠీలకు క్రింది తరగతి మహిళా క్రీడాకారులపై చిన్నచూపు! ఆ తరగతికి చెందిన క్రీడాకారులైన యువతులు పైకి రాకూడదు! వారు ప్రతిభతో ప్రవేశించకూడదు! ఇదీ పండితుల ధ్యేయం!

మనదేశంలోని క్రీడారంగాలను అత్యవసరంగా ప్రక్షాళన చేసి, స్వార్థపరులైన ఉన్నతాధికారులను తొలగించవలసిన అగత్యం ఉంది. క్రీడల్లో అభిరుచీ, అభినివేశంగల మహిళలను ఉన్నత పదవుల్లో నియమించి, మహిళా క్రీడాకారులను ప్రోత్సహించి, తద్వారా చక్కటి ఫలితాలను జాతికి అందచెయ్యడం మంచిది!

# సాహసమే ఊపిరిగా...

వారు 21 మంది మహిళా కమాండోలు. యూనిఫామ్‌లు ధరించిన వారి వదనాలు గంభీరంగా ఉన్నాయి. ముఖంలో ధైర్యం, తెగింపు ద్యోతకమవుతోంది.

ఆ పోలీస్ కమాండోలు అంతా మహిళా పోలీసు శాఖలో ఉద్యోగాలు చెయ్యడం, బాధ్యతలు నిర్వహించడం ఎంతో కష్టసాధ్యమైన విషయం. మీదు మిక్కిలి అత్యంత ప్రమాదకరం. విధి నిర్వహణలో విపరీతమైన శ్రమకు గురికావలసి వస్తుంది. ఎంతో ఓర్పూ, నేర్పు అంతకు మించిన సాహసప్రవృత్తి అవసరం. ఈ విషయాలను దృష్టిలో పెట్టుకొని మహిళలు ఆ శాఖలో ఉద్యోగాల కోసం సుముఖంగా లేరు.

ప్రస్తుతం పరిస్థితులు మారాయి. యువతులు పోలీసు ఉద్యోగాలకై ముందుకు వస్తున్నారు. ఇందుకు తమిళనాడు ప్రభుత్వం శ్రీకారం చుట్టి, యువతులను సహితం పోలీసులుగా నియమిస్తోంది. వారిలో ధైర్య, సాహసాలు గలవారిని పోలీసు కమాండోలుగా నియమించడం జరుగుతోంది. ఇది ముదావహమైన విషయం!

ఆ 21 మంది మహిళలు తమ ప్రతిభను, సాహసాన్ని ప్రదర్శించారు. వారికి మూడు నెలల పాటు అతి కఠినమైన ట్రైనింగ్‌ను అధికారులు ఇచ్చారు. రోజూ పగలు 3 మైళ్ళ దూరం పరుగులు తీయాలి. రాత్రి సమయంలో 38 కి.మీ దూరం 7 గంటల్లో మార్చ్ చెయ్యాలి. 2 గంటల 20 నిమిషాల్లో 24 కి.మీ జాగ్ చెయ్యాలి.

ఈ శిక్షణలో మానసిక శక్తిని, శారీరక శక్తిని పరీక్షిస్తారు. అనేక ఆయుధాలను వినియోగించడం నేర్పుతారు. 9 యం.యం పిస్టల్స్, 9 యం.యం కార్‌బైన్ గన్స్, **AK-47** వంటి ఆయుధాలు ఉపయోగించడంలో శిక్షణ ఇస్తారు. ఈతలో, పేరాసైలింగ్‌లో, రాక్ క్లయింబింగ్, ఫైల్ ఫైటింగ్, బాంబ్ డిస్పోజింగ్‌లలో తగిన శిక్షణ ఇవ్వడం జరుగుతుంది.

తొలి విడతలో 51 మంది మహిళలను ఎన్నుకొని, తిరిగి వడపోతలో 21 మందిని పోలీస్‌కమాండోలుగా ఉద్యోగాలిచ్చారు. మహిళా కమాండోలలో అభినందించవలసిన విషయం ఒకటుంది. పురుషులలో



ఎన్నికైన ఈ తరహా ఉద్యోగులు, శిక్షణ సమయంలో సరైన ప్రతిభ కనపరచపోవడం వలన, అంకిత భావంలేనందున తొలిగించబడ్డారు!

అయితే మహిళా కమాండోలలో, శిక్షణ కాలంలో ఒక్కరు కూడా తొలగించబడలేదు! మున్ముందు ఆ 21 మంది మహిళా కమాండోలు తమ సాహసాలతో దుష్టశక్తుల ఆట కట్టిస్తారు!

★

# చతుర

## నవలా పరిచయం

రెక్కాడితేగాని డొక్కాడని నిరుపేద కుటుంబాలు మన గ్రామాలలో అనేకం. చదువుకోవాలని ఉన్నా చదువు'కొన' లేని నిస్సహాయ స్థితి, వ్యవసాయాన్ని, చేతివృత్తులను నమ్ముకొని దీనస్థితికి దిగజారుతున్న ఉదంతాలు, హృదయ విదారకమైన రైతుల ఆత్మహత్యలు, నేత పనివారి కష్టాలు, కడగండ్లు, పేదల హాహాకారాలు సర్వే సర్వత్రా కనిపిస్తుంటాయి.

పొట్ట చేత పట్టుకొని వలసపోయే వారు కొందరైతే, కోట్లకు పడగలెత్తాలని మరికొందరు దూరదేశాలకు పయనమవుతున్నారు.

బాంధవ్యాలు, స్నేహాలు, మమతలు, ఆత్మీయతలు, కన్నీళ్ళు కదిలిస్తున్న నేపథ్యంలో జానపద జనజీవననాడిని కరీంనగర్ మాండలికంలో పరిచయం చేస్తున్న

**డా॥ కాలువ మల్లయ్య** నవల

# 'గువ్వల చెన్నా'

ఈ నెల చతుర సమర్పణ.



### రచయిత పరిచయం

పాతికేళ్ల క్రితం కథలు రాయటం ప్రారంభించిన డా॥కాలువ మల్లయ్య తొలి కథ 'వెలి' 1983 జనవరి 'సృజన'లో, తొలి నవల 'భూమిపుత్రుడు' 1991 డిసెంబర్ 'చతుర'లో వెలువడ్డాయి. చతురలో ఇది నాల్గవ నవల. అనేక కథలు, నవలలు, సాహిత్య సాంఘిక వ్యాసాలు, కవితలు రాశారు.

రచయిత చిరునామా: డా॥కాలువ మల్లయ్య
7-4-163, కాశ్మీర్‌గడ్డ, కరీంనగర్-505002.



ల్లిందెత్తా పిల్లందెత్తా మల్లవొయ్యి మ్యానత్తందెత్తా ఎయ్ తల్లిందెత్తా పిల్లందెత్తా మల్లవొయ్యి మ్యానత్తందెత్తా

చిర్రగోనాటలో గూతపడుతూ పరుగెత్తుతున్నాడు శంకరయ్య. డొక్కలెగిసి పడ్తున్నాయి. ఇది చాలా సేపట్నుంచే జరుగుతోంది. అయినా ఆట పూర్తి కావడంలేదు. శంకరయ్య గమ్యస్థానం చేరుకోవడంలేదు.

"శంకరిగా. నిన్నియ్యాల్ల చెలుకలు పట్టిత్త ఏ పాటి గూతపడుతవో పట్టు." అన్నాడు గోరంటల భూమయ్య.

గూత మరిచిన స్థలం నుంచి మళ్లీ గోనెతో చిర్రను కొట్టాడు. అది గాలిలో గింగిర్లు కొడుతూ సుదూరంగా పడింది.

'తల్లిందెత్తా పిల్లందెత్తా' శంకరయ్య మళ్లీ గూతపట్టి పరుగెత్తుతున్నాడు. చిర్రను పట్టుకొని గమ్యస్థానం చేరకముందే గూత మరుస్తున్నాడు. షరా మామూలే మళ్లీ గోనెతో చిర్రను బాదడం.

"మొన్న నువ్వు నన్ను ఉరికియ్యలేదా? ఉరుకు. ఈరోజు నిన్ను జంగల్ పట్టిచ్చుడే" అని. గోనెతో చిర్రను బలంగా కొట్టి గోనెను విసిరేశాడు భూమయ్య. అవి మరింత దూరంలో దూరదూరంగా పడ్డాయి.

గోనె ఓదిక్కు, చిర్ర మరో దిక్కు పడటం వల్ల ఇటు తల్లి అయిన గోనెను తొక్కి, అటు పిల్లయైన చిర్రను తొక్కి రెండింటినీ తీసుకొని గమ్యస్థానం (బద్ది) దగ్గరకు గూతపడుతూ పరుగెత్తుకు రావడానికి శంకరయ్యకు సమయం చాలడంలేదు. మధ్యలోనే గూత మరిస్తే మళ్లీ అక్కడినుండి పరుగెత్తడం.

అలసిపోతున్నాడు శంకరయ్య. పరుగెత్తి నిల్చున్నాడు. "ఎపో నీయవ్వ నేనాడపో ఎంతసేపని గూత వట్టాలె మరి." అన్నాడు.

"అయితె గూతపోయినట్టే. నువ్వు మొన్న నన్నురికియ్యలేదా? ఉరుకాలె ఆటయెదాక ఉరుకుడే." అని మళ్లీ కొట్టాడు భూమయ్య. శంకరయ్య గూతతోపాటు పరుగందుకున్నాడు.

ఊరిబయట చిర్రగోనాడుకుంటున్నారు పిల్లలు. దుమ్ము దుమ్మెగురుతున్నారు. దుమ్ము మేఘాల్లా ఆవరించుకొనుందక్కడ. పిల్లలు తలదిగపారా దుమ్ముతో స్నానం చేసినట్టున్నారు. అయినా సంతోషంతో గంతులేస్తూ ఆడుకుంటున్నారు.

కాల్ దెబ్బా చిటపోటారం ముక్కైన తోలూ నడ్డీగుర్రం పెద్దన బేడీ కన్నేరాం పొల్లాగాడు అని గోనెతో కొలుస్తూ నావి ఇన్ని పాయింట్లు అని లెక్కపెడుతున్నారు మరోచోట.

ఈ రోజు ఆట శంకరయ్యకు ప్రాణాంతకంగా ఉంది. పరుగెత్తి పరుగెత్తి కాళ్లు లాగుతున్నాయి. డొక్కలు కొట్టుకుంటున్నాయి. ఇక తన వల్ల కాదనుకున్నాడు. గోరంటల భూమయ్యతో ఓ రాజీకి రావడానికే నిర్ణయించుకున్నాడు. నిటారుగా నిల్చున్నాడు.

"భూమయ్యా! గూతవట్టుడు, ఉరుకుడు నానుంచి కాదిగ" అన్నాడు. "మొన్న నువ్వు నన్నురికించినవు బుద్ధితీరెదాక ఉరుకాలె మరి గూతవట్టాలంతే." అన్నాడు భూమయ్య.

'నేనోడిపోయిన్నని ఒప్పుకుంటున్న పటు సరెనా ఇగ."

"పోనియ్‌రా భూమయ్యా. శంకరయ్య నిడ్చిపెట్టు. ఓడిపోయిన్నని ఒప్పుకున్నాడు గదింకేంది? శరణని వచ్చిన శత్రువునైన వదిలెయాలన్నారు. మనం చరిత్రల చదువుకోలేదా? " అన్నాడు తిరుపతిరెడ్డి.

'సరే అయితే మల్లోపారను.'

"నేనోడిపోయిన సరేనా.? "

'శంకరయ్య ఓడిపోయిండు. ఓడిపోయిండు.'

అని పిల్లలంతా ఎగురుతున్నారు.

వాళ్లంతా చెట్టుకిందికి పరుగెత్తుకొచ్చారు చేతిలో ల్యాక బద్దతో కోపంగా చూస్తున్నాడు చిప్ప మల్లయ్య.

తండ్రిని చూసిన శంకరయ్య గజగజా వణికిపోతున్నాడు. ల్యాకబద్దను చూస్తే చెప్పలేని భయం శంకరయ్యకు.

'షరి' జెయ్యడానికి, నేతపనికి ఉపయోగించే ఆ కర్రను పిల్లలను దండించడానికీ ఉపయోగిస్తాడు చిప్పమల్లయ్య. దాంతో ఎన్నోసార్లు దెబ్బలు తిన్నాడు శంకరయ్య. స్నేహితుల ముందు దాంతో కొడతాడేమో నని భయపడుతున్నాడు. అతడు భయపడుతున్నట్టే అయింది. ల్యాకబద్దతో దెబ్బేశాడు మల్లయ్య.

"షరి జెయ్యాలె రారా అంటే ఇక్కడ చిర్రగోనాడుతున్నావా? బడి నుంచి ఇంటికి రాక ఆడుకుంట గూసుంటే ఎవ్వడు సేత్తడనుకున్నావురా షరి? పొద్దుగూకితే కండ్లవడి సావదని తెలువదారా? ఇంటికత్తె పనిజెప్పుతరని గీ దుబ్బలెగురుతున్నవా?" అన్నాడు కోపంగా.

ఎనిమిదవ తరగతి చదువుతున్న తనను పిల్లల ముందు కొట్టడం, తిట్టడం శంకరయ్యకు బాధాకరంగా ఉంది. బడికి పోతున్న తనకు పనిచెప్పడమే ఎక్కువంటే తండ్రి ఇలా మండిపడుతున్నాడని శంకరయ్యకు బాధ. అందుకే ముఖం మాడ్చుకొని నిల్చున్నాడు.

"మాట్లాడవేందిరా? ఇంటికి రాక ఇక్కన్నే ఎందుకున్నవు? దుబ్బల దుమ్మదుమ్మెగురుతున్నవా? కాళ్లనిండ గా మన్నేంది? నెత్తినిండ గా దుబ్బేంది? మొకం నిండ, చేతుల్నిండ ఎక్కడ వడితక్కన్నే మన్ను పాడయింది. గందుకనే పెయ్యంత పలుగుతుంది. నిన్ను బడికి పంపేది గిందుకేనారా? దొంగ గాడ్దికొడుక?" అని మరో దెబ్బ వేశాడు చిప్ప మల్లయ్య.

దెబ్బ తగిలినచోట చెత్తో రాసుకున్నాడు శంకరయ్య.

"అందరాడుకుంటాంటె నేనాడుకుంటున్న నేనేం తప్పుచేసిన" అన్నాడు మెల్లగా.

"అందరు గడ్డితింటే నువ్వు దింటావురా" అని గద్దించాడు తండ్రి.

మగడు కొట్టినందుకు కాకున్నా తోటికోడలు చూసినందుకు బాధ అన్నట్టుగా ఉంది శంకరయ్య పరిస్థితి. చుట్టూ మిత్రులు... తండ్రి మాటలకు బాధతోపాటు కోపమూ వస్తున్నదతనికి.

"నీయవ్వ? నేను మంచిగ బడికి పోతున్ననా లేదా? బడికి పొయ్యేటోన్ని పట్టుకొని షరిజెయ్యి, కండెలు జుట్టు, మొగ్గం నెయ్యి, ఇంకేదో చెయ్యమని చెప్పుతేమన్నట్టు? ఇంత పెద్దోన్ని వట్టుకుని కొడితేమన్నట్టు.?" అన్నాడు శంకరయ్య.

"గిట్లజేత్తె కొట్టకుంటె ముద్దుపెట్టుకొమ్మంటావుర! దుబ్బలెగురుకుంట మల్ల నామీదకే మాట్లాడుతున్నవా?" అని ల్యాకబద్దతో మరో రెండు దెబ్బలేశాడు చిప్ప మల్లయ్య.

"ఓ అయ్యా! వయ్యా సత్తి సత్తి."

మొత్తుకుంటూ ఏడుస్తున్నాడు శంకరయ్య.

పిల్లలు భయం భయంగా చూస్తున్నారు.

"నీకేం జెప్పిన నువ్వేం జేత్తున్నవు? బడయిపోయినంక ఇంటికి రారా పనున్నదని చెప్పిన్నా లేదా? నువ్వేమో ఇక్కన్నే ఉంటివి."

ఏడ్వడం ఆపాడు శంకయ్య.

"చిర్రగోనాడుడు తప్పాయె నాయిన" అన్నాడు.

"పని లేనప్పుడు ఆడుకో కాని పనున్నదని నేను చెప్పిన్నా? లేదా? చీర నేసుటానికి 'షరి' జెయ్యాలె నాకు సాయం జెయ్యిరా బడి నుంచి ఇంటికే రారా అని నేనంటే నువ్వేమో ఇక్కడెగురవడ్తివి. సదువుకుంటున్నవు నువ్వు నిజమే. మరయితే పనిజెయ్యంది మనకెల్లుతదా సెప్పు?" అనునయంగా అన్నాడు చిప్ప మల్లయ్య.

చెట్టుకింద పెట్టిన పుస్తకాలను చేతిలోకి తీసుకున్నాడు శంకరయ్య. కొడుకు చేయి పట్టుకున్నాడు మల్లయ్య.

'నడువ్ ఇంటికి పోదాం పా' అన్నాడు.



ఇద్దరూ ఇంటి వైపు నడుస్తున్నారు.

"నేను పనిచెయ్యనన్నానా నాయన? చెయ్యనేవడ్తి చిర్రగోనాడినందుకు ల్యాకబద్ద తోని కొట్టవడ్తివి, తిట్టవడ్తివి నేనేం తప్పు చేసిన."

ఆరిందలా మాట్లాడుతున్న కొడుకు దిక్కు చూశాడు మల్లయ్య. 'నువ్వేం తప్పు చెయ్యలే. నేనే పెద్ద తప్పు చేసిన" అన్నాడు.

"ఏం తప్పు చేసినవు...?"

"నిన్ను బడికి తోలించుడు తప్పు గాదార! మీ అన్నలిద్దరి తీరుగ నిన్నుగూడ పనిల వెడితయిపోవు. నువ్వు సదివి ఉద్ధరిత్తవని బడికి తోలిస్తున్నాం. నేను వద్దంటే మీ అవ్వే బలవంతం చేసింది. ఇంట్ల ఒక్కలన్న చదువుకున్నోల్లు ఉండన్నని తోలిత్తాంటె నీకేమొ మీదికి పోవట్టె."

"నేనేం జేసిన్నే? బడికి తోలితె మంచిగనే సదువుకుంటున్న గద."

ఇల్లు చేరుకున్నారు వాళ్ళు.

చింతచెట్టు కిందున్న ఖాళీ స్థలం అదే ఇంటివాకిలి. వాకిట్లో దూర దూరంగా రెండు గుంజలు పాతున్నాయి. అవే షరి చేయడానికుపయోగించే గుంజలు. ఆ రెండు షరి గుంజలను కలుపుతూ నేతకు సిద్ధంగా ఉన్న మాలుంది. పక్కనే షరిజేసే కుంచుంది.

లింగమ్మ వాకిట్లో కూర్చొని రాట్నం వడుకుతోంది. ఆమె చుట్టూ కండెల మండెలున్నాయి. ఆ వాకిలినానుకొనున్న పెంకుటిల్లు శిథిలావస్థలో ఉంది. ఆ ఇంట్లో మగ్గం గుంటుంది. మగ్గానికి అయిపోవడానికి సిద్ధంగా ఉన్న చీరుంది. మగ్గం గుంటలో కూచొని మగ్గం నేస్తున్నాడు వీరయ్య. నాడె అటూ ఇటూ వేగంగా పరుగులు తీస్తుంది. ఆతని కాళ్ళు, చేతులు, కండ్లు చురుకుగా పనిచేస్తున్నాయి. నాడె కదుల్తూ షట్టు షట్టు అనే ధ్వని లయబద్ధంగా వినబడుతుంది. వీరయ్య కళ్ళు తెగుతున్న పోగులను నిశితంగా పరిశీలిస్తున్నాయి. ఒకచేత్తో కుచ్చును అటూ ఇటూ లాగుతూ మరో చేత్తో పటకాను తనదిక్కు లాక్కుంటున్నాడు. దూరంగా ఉన్న దారాలు దగ్గరికొస్తున్నాయి.

వాకిట్లో నూలుమీది నుండి గంజి వాసనొస్తున్నది. షరి చేయడానికి గంజివాడటం మామూలే. ఆ ఇంట్లో ఒక్కపూట వరన్నం తింటారు. మరో పూట మొక్కజొన్న గడుకన్నమే. ఆగంజి సరిపోకుంటే ఇతరుల ఇండ్ల నుంచి తెచ్చుకుంటారు.

"ఏందేమో ఈయనను చెయ్యిపట్టుకోని గుంజుకత్తున్నవు?" అంది లింగమ్మ.

"ఆఁ... నా తలపుండ్లు కడుగుతాడని గుంజుకత్తున్న. దుబ్బల ఎట్లెగురుతున్నడో సూడు! కాల్లపొంటి, సేతుల పొంటి దుమ్మెట్ల పేరుకుపోయిందో సూడు. బడి నుంచచ్చి నాకు సాయం జెయ్యరా అంటె అక్కడాడుతుండు".

"అన్నల్లేరా పనిజేసుటానికి."

"అన్నలుంటె? వాళ్ళట్టిగున్నరా? ఎవ్వల పనాల్లకు లేదా? సదువుకుంటున్ననని ఏం పనిజెయ్యనంటెట్లెల్లుతది?"

"అవ్వా! నాయిన సూడే ఎన్ని మాటలంటున్నాడో? ముత్తెమంతసేపు ఆడుకున్నందుకు కొట్టె, తిట్టె, మాటలనవట్టె.'

"దొరవార! నువ్వు ఆడుకుంటానికి! మనకు పనిజెయ్యందెల్లదని ఎన్నిసార్లు జెప్పాలె?"

బుద్ధిగా బడికి పోతూ బాగా చదువుకుంటున్న శంకరయ్యకు పనిచెప్పడం లింగమ్మ కిష్టంలేదు. కాని రెక్కాడితే కాని డొక్కాడని బతుకుల్లో చదువుకుంటున్న కొడుక్కూ పని తప్పదని ఆమెకు తెలుసు. తండ్రీకొడుకుల వాదనలు విని ఏం మాట్లాడకుండా లేచి నిల్చుంది.

✤ తనకున్న ఏదో ఒక గొప్ప ప్రతిభను ఆచరణలో పెట్టిన వ్యక్తి విజయం సాధిస్తాడు

– స్వామీ చిన్మయానంద

కొడుకు దగ్గరికొచ్చింది.

"అయ్యయ్యో పెయినిండ, తలదిగపార దుమ్మే సందులేకుంటవడ్డది. గిట్ల దుబ్బవ డితె శరీరమంత పట్టన పలుగుతది. దుబ్బల గంతగనం ఎగురుతేమన్నట్టు బిడ్డ? "

అని కొంగుతో తలంతా దులిపింది. కాళ్ళు చేతులను దులిపింది. చేయిపట్టుకొని బావి దగ్గరికి తీసుకెళ్ళింది.

నాలుగైదు బొక్కెండ్ల నీళ్ళు చేది మట్టిగో ళెంలో పోసింది.

"అంగి లాగిడిసి పారెయ్యి. చెడ్డుంది గద... నేను తానం జేపిత్త" అంది.

"నేను మాసేత్తపో" అన్నాడు బట్టలు విప్పుతూ శంకరయ్య.

"నువ్వు జేత్తె గీ మురికంత పోదు. అట్ల కూసో"

తల్లి చెప్పినట్లు వినక తప్పలేదు శంకర య్యకు. చెంబుతో నీళ్ళు ముంచుతూ కొడుకు తలపై పోసింది. తల రుద్దుతోంది. కాళ్ళు చేతులు రాస్తోంది.

"పొద్దున మాపున తానం జేపిత్తవానోయ్ లింగమ్మ నీ కొడుక్కు! కడిగిన కాడికి సాలు జెప్పన పంపియ్యి". అన్నాడు పనిలో నిమ గ్నమవుతూ మల్లయ్య.

"గడి తురికాలేదు గవ్వ రాకట్లేదు అన్న ట్టుంది నీ పని సంగతి. తానం జేపిత్తన్న. కొద్దిగాగలేవు? మాసేత్తడు పని. మాపటీలి తానం జేత్తేందాయె. బాయినీల్లేకద" అంది లింగమ్మ.

మల్లయ్యేం మాట్లాడకుండా పనిచేసుకుం టున్నాడు.

"ఓ అవ్వా! ఒక్క సబ్బుగొంటేందే? " అన్నాడు శంకరయ్య.

"సబ్బులతోని తానాలుజేసే ఐసతుందా బిడ్డ మనకు? పెయ్యి సబ్బు కొనుటానికి పైసలేడియి? గట్టిపిండితోని, రాగటిమన్ను తోని రాసుకోని తానం జేత్తె సబ్బుకన్న మంచిగ మురికిపోతది. మనమేమన్న దొర లమా సబ్బులు వాడుటానికి" అంది లింగమ్మ రేగటిమన్ను నీళ్ళతో కొడుకు తల రుద్దుతూ.

"ఎపో... నీయవ్వ! ఏమన్నంటె కతలు జెపుతవు రాగటి మన్నుతోని నెత్తిరాసి తల కుపోత్తె కండ్లల్లకు కారుతది. కండ్లన్ని మండుతయి. పిండితోని బరుకూబరుకున పెయ్యి రాత్తాంటె నొయ్యవట్టె. ఒక్క సబ్బు కొనుమంటె దొరలే వాడుతరనవట్టివి. మన కులపోల్లు సబ్బులు వాడుతలేరా ఏంది? నేను మా సూసిన వాడంగ."

కొడుకు మాటలకు సంబరంగానే ఉంది లింగమ్మకు.

"నువ్వు ఇంట్ల తానం జేసిందెప్పుడు బిడ్డ? చాలాసార్లు చెర్లనో, కాలువల్నో ఈత గొట్టి తానం జేసత్తివి. ఉన్నోల్లు సబ్బువా డితే వాడుతరు గని మనకెందుకు చెప్పు? "

"అవ్వా! ఎగురలేక పందిర కురుచన్నట్టు న్నయే నీ మాటలు. ఈతగొడితే మాత్రం సబ్బుపెట్టుకోవద్దనున్నదా? వట్టిగ పెయ్యెంత రాసినా మురికెట్లవోతది? గందుకే నన్ను నల్లవడుతున్న వంటున్నరందరు'

"సబ్బు వెడితె ఎర్రవడుతరా బిడ్డ? ఉన్న రంగేడికి పోతది? ఏం జేసినా కర్రెగున్న తోలెర్రగయితదా? మీ నాయిన రంగచ్చింది నీకు? " అంది నవ్వుతూ లింగమ్మ.

"నువ్వేమో టమాట పండోలె ఎర్రగున్నవు గాదోయ్ లింగమ్మ" అన్నాడు చిప్ప మల్లయ్య నవ్వుతూ.

"ఎర్రగ లేకుంటె నీ తీరుగ జీడిత్తులెక్కు న్ననా? "

"సబ్బు కొనియ్యమంటె మీరు వాదించుకో వట్టిరి. బడికి పొయ్యేటోనికి రాగటిమన్ను తోని తానం జేపిత్తేమన్నట్టు? సోపతికా ల్లంత సబ్బుతోనే తానం జెయ్యవట్టిరి".

"సరె బిడ్డ ఊకె సబ్బు సబ్బంటన్నవు గద మాకొంట తియ్యి. బట్టలేసుకోని మీ నాయినకు సాయం జెయ్యిపో" అంది పంచెతో శంకరయ్య కాళ్ళు, చేతులు, తల

తుడుస్తూ లింగమ్మ.

శంకరయ్య ఇంట్లోకెళ్లి నిక్కరు, అంగీ తొడుక్కున్నాడు. నిక్కరు జారకుండా ఉండడానికి మొలదారం నిక్కరుపై అంచులమీదికి జరిపాడు. వాకిట్లోకొచ్చీ తండ్రి చెప్పినట్టు చేస్తున్నాడు.

"అవ్వా! ఆకలయితుందే" అన్నాడు కొద్దిసేపాగి.

"దుమ్ము దుమ్మెగిరినంక ఆకలిగాదా బువ్వ దింటవా మరి" అంది లింగమ్మ.

ఆ ఇంట్లో పొద్దున మక్కగడుక, రాత్రి వరన్నం తింటారు. ఇంతకు ముందు రెండు పూటలూ గడకే తినేవారు. గడక కంటె వరన్నం తినడానికిష్టపడుతారు పిల్లలు. అందుకోసం రాత్రి అన్నం బాగా పట్టాలని ప్రొద్దున తక్కువ తినే ప్రయత్నం చేస్తారు. రాత్రి అన్నం తక్కువుంటుంది కాబట్టి పగలు ఎక్కువ తినిపించాలని ప్రయత్నం చేస్తారు తల్లిదండ్రులు. తినుబిడ్డ తిను అని తల్లి ఎక్కువ తినిపించాలని చూస్తే నాకు పడుత లేదే అవ్వ, ఆకలవడంలేదని గడుక బువ్వ తక్కువ తినే ప్రయత్నం చేస్తారు పిల్లలు. అదే పనిని శంకరయ్యా చేస్తుంటాడు.

తల్లి అన్నం తినమనగానే అన్నీ జ్ఞాపకం వచ్చాయతనికి. ఇప్పుడు తొక్కేసుకొనో, పచ్చిపులుసు పోసుకొనో చలిగడుకన్నం తినడం ఇష్టం లేదు శంకరయ్యకు.

"నాకు గిప్పుడు బువ్వేమద్దుపో. ఏమన్న పప్పులుంటె పెట్టు" అన్నాడు.

కొడుకు ఎత్తులు లింగమ్మకు తెలుసు. రాత్రి అందరికీ సరిపోయేంత మెతుకుల బువ్వ వండుకునే స్థితి లేదు. ఉన్న కొద్దిపాటి మెతుకుల బువ్వ భర్తకు, పిల్లలకు పెట్టి తాను గడుకో, చలిదో తింటుంది. వండింది వాళ్ళకైనా సరిపోవాలన్నదే ఆమె ఆరాటం.

"సరె బిడ్డ. నూకల్లు కొన్ని నువ్వులు కలిపి పెడ్త తియ్యి" అంది లింగమ్మ ఇంట్లో కెళ్ళుతూ.

"నీయవ్వ పోరని పీసునా గొడుదు. అటు దిక్కు ఇగ్గి పట్టుకోని ఉండురా అంటే ఏమేమో చెప్పుతుండు. ఎప్పటికి కడుపుమీదనే లోకం. చెప్పింది చెయ్యి" గద్దరించినట్టన్నాడు మల్లయ్య.

"ఆకలి గావట్టె ఏమన్న పెట్టుమంటె తప్పామరి? " అన్నాడు ముఖం మాడ్చుకొని శంకరయ్య.

"లింగమ్మ! గా కడుముంతలిన్నన్ని నూకలుండవచ్చు తెచ్చి వాని జేబులపొయ్యి బుక్కుకుంట పనిజేత్తడు."

"అవ్వా! వట్టి నూకలైతే మంచిగుండవే ఇన్నన్ని నువ్వులు కలుపుకరా కమ్మగుంటయి."

"నేను తీసుకచ్చుటానికే పోతి. మీరు చెరోదిక్కు ఒర్రవడితిరి" అంది లింగమ్మ చేతిలో నూకలు పట్టుకొనొస్తూ.

"ఎపో వట్టి నూకలే తెచ్చినవేంది? " అన్నాడు శంకరయ్య ముఖం మాడ్చి

"ఇంట్ల నువ్వులు లెవ్వు బిడ్డ.. కైకిలి పోయి తెచ్చినయి సంకురాత్తిరి సకినాలకే అయిపోయినాయి. ఇగో కొంచెమంత బెల్లముంది" అని నూకలు కొడుకు జేబులో పోసింది లింగమ్మ.

"ఐతేమనాయె పటు నూకలు బుక్కుకుంట బెల్లం కొరుకుతే కమ్మగుంటయి." బెల్లంముక్క తీసుకుంటూ అన్నాడు శంకరయ్య.

నూకలు తింటూ, బెల్లంముక్క కొరుకుతూ తండ్రి పనిలో సాయం చేస్తున్నాడు. పట్టుకొమ్మంటే పట్టుకుంటున్నాడు. తెగిన పోగులు అతకమంటే అతుకుతున్నాడు. లింగమ్మ వాకిట్లో కూచుని కండెలు పేనుతుంది. ఇంట్లోంచి మగ్గం ధ్వని వినపడుతోంది.

"మా ఊరు సాలోడు నేచిండు చీరెలు నెలకొక్కపోగు అన్నట్టున్నయి మన బతుకులు ఇంటోల్ల మంత పనిజేసుడేకాని ఏం పాడయింది? ఎప్పటి చిప్ప ఎనుగులకే" అంది లింగమ్మ.

"ఇంకేం కావన్నోయ్ ఈ పనితోని బతుకు

తున్నమా? లేదా? ఇంకేం గావాలె సెప్పు.? అన్నాడు చిప్ప మల్లయ్య.

"ఆc బతుకుతున్నం తియ్యి ఇంత పొడుగు. ఏం పాడయింది మరి గీ బతుకుల? కైకిలి బతుకులేనాయె మనయి."

"ఏం తక్కువయిందోయ్ లింగమ్మ నీకు ఏం గావన్నో సెప్పకనే పోతివి" అన్నాడు నవ్వుతూ మల్లయ్య.

"ఓ ఇగనాకు నువ్వు ఏడువారాల నగలు దిగేసినవు గదా! కొద్ది సంబరమా ఏంది?"

"ఏడువారాల నగలు దిగేసుటానికి నువ్వేమన్న రాణివా? రాణివాసపు స్త్రీవా? లేకుంటే దొర్సాని ననుకుంటున్నవా? మనం బట్టలు నేసుకుంట బతికెటోల్లమని మరిచిపోకు. మా తాతాముత్తాతల కాలం నుంచి గూడ గిట్ట బట్టలు నేసుకుంటనో, బట్టలమ్ముకుంటనో బతుకుతన్న మనెరికే కద.!"

"మీ తాత ముత్తాత లేంది.. మా తాత ముత్తాతల కాలం నుంచి గూడ అంతే.. అయితేంది? గింత దిక్కుమల్లె సంసారమైతె కాదుమరి."

భార్య మాటలు విని పనాపాడు మల్లయ్య.

తల్లిదండ్రులు ఒకర్నొకరు దూషించుకుంటున్నట్టు చేసుకుంటూనే ఎంతో ఆత్మీయంగా ఉంటారని శంకరయ్యకు తెలుసు. వాళ్లు తనను తిట్టే తిట్లలోనే దీవెనలున్నాయనీ అర్థం చేసుకుంటున్నాడు. తన తల్లి దిక్కు కోపంగా చూస్తున్నట్టు కనబడుతున్న తండ్రి ఏమంటాడోనని చూస్తున్నాడు శంకరయ్య. అతడూహించినట్టుగానే లింగమ్మ తల్లి తరపు వాళ్లమీద దాడి చేశాడు చిప్పమల్లయ్య.

"అంటే నీవోల్లది ఇంత పొడుగు ఎల్లిన సంసారమని మమ్మలనంటున్నావా? మీ అవ్వగారోల్లది చెప్పేత్తె కుండదలుగని సంసారమేనాయె. మీ తమ్ములేం జేత్తున్నరు? తాసీల్దార్లా? తాలూకదార్లా? గదే మొగ్గం గుంటలను నమ్ముకొని బతుకుతండ్రుగద! నువ్వు బాగా కట్నం తెచ్చిత్తె నేను తాయితులల్ల ముల్లెగట్టుకున్ననా? మాదట గతిలేని కుటుంబమట. ఈమెదేమొ జమీందార్ల కుటుంబమట" అన్నాడు.

"ఓ నీయవ్వ! బాగ రేషం రాట్టేంది గతి మల్లె కుటుంబమన్నందుకు. గతిమల్లె కుటుంబం కాకుంటేంది మరి? ఒక్క పట్టు చీరె కొనిచ్చుతానికి గతిలేదు కని ఏడువారాల నగలు దిగేసిన్ననవడ్తివి. లగ్గమై ఇరువయ్యేడేండ్లు దాటె, ఒక్క పట్టుచీరె గొంటివా? ఎన్నెండ్లాయె మరి మొత్తుకోవట్టి."

ఆ మాటలు విని నోరు తెరిచాడు చిప్ప మల్లయ్య. ముక్కుమీద వేలేసుకున్నాడు. బొనుగూపినట్టు బొలబొలా నవ్వాడు.

"ఏంది? ఎందుకో నవ్వవడ్తివేంది?" అంది లింగమ్మ.

'షరి' చేస్తూ కుంచెతో పోగులను దువ్వుతూ అటూ ఇటూ నడుస్తున్నాడు మల్లయ్య. అక్కడంతా గంజివాసనుంది.

"హి... హి... హి... నీకు పట్టుచీర కావన్నా? పట్టుచీరంటె ఏందనుకున్నవు? నువ్వు మాదండి కట్నం తెచ్చినవని పట్టు చీర పెట్టేదుండెనా మన లగ్గంల! మరి మీ నాయినెందుకు కొనియ్యలేదు? నువ్వు తెచ్చిన కట్నమెంతో ఎరికేనా? యాభైరూపాయలు. ఆ యాభై యిచ్చుటానికే మీ అయ్య ఏడ్చిండు. ఈ మట కట్నం తెచ్చిందట... పట్టుచీర కొనేదుండెనట."

తన తల్లిగారినేమన్నా ఊర్కోవడానికి సిద్ధంగా లేదు లింగమ్మ. "అప్పుడున్న కట్నమెంత? నీ కప్పుడు యాభై ఎక్కువే. కాపు దనపు కుటుంబాలల్ల గూడ అప్పుడు నూర్ల కొద్దీ కట్నాలు లెవ్వంటె సాలెకులంల గంత కంటె ఎక్కువ ఎవ్వలిచ్చిండ్రు? మా నాయిన పట్టుచీరె కొనియ్యలేదు నిజమే. పదేండ్ల పోరికే లగ్గం జేసె మరి గిన్నేండ్ల వట్టి నువ్వేపాటి గొంటివి? మన పొల్ల

❖ సాంప్రదాయాన్ని మన్నించు. కాలానుగుణంగా సంస్కరణ అవసరమైతే సంస్కరించు. కానీ సాంప్రదాయాన్ని సమూలంగా నాశనం చేయకు. – స్వామి రామతీర్థ

గాండ్లే లగ్గాల కెదిగింద్రుగిప్పుడు గప్పటి కట్నాల గురించి మాట్లాడ్తన్నవా? "

"ఎన్నేండ్లయినా మీ అవ్వగారోల్లనే ఎనుకేసుక రావడ్తివి. వాళ్లేం బెట్టింద్రని గంత మురిపెం? "

"వాళ్లకు చాతనయిన కాడికాల్లు వెట్టింద్రుగని నువ్వేపాటి నగలు దిగేత్తివి.. మీ లేకిడి మొకాలకు పట్టుచీరలేమెరుక? కాళ్లగోళ్లయినా, పురుల్లయినా ఒక్క చీరన్న కొంటివా? ఏ కార్యమయినా మొగ్గం మీద నేసిన పేగే పారేత్తివి. చుట్టమచ్చినా పక్కమచ్చినా కుండల గలదింత పారేసినట్టే సేత్తివన్నిట్ల."

"ఇయ్యాల్లేందో కొలుపు వెట్టినవేంది? మరయితె నన్నేం జేయ్యమంటవో చెప్పు లింగమ్మ" హాస్యమాడాడు మల్లయ్య.

"మనం చేసేపని బట్టలు నేసుడేనా? ఊరందరికి నూర్లకొద్ది వెయ్యిలకొద్ది గజాల బట్టలు నేస్తున్నమా? నాకు మాత్తురం ఒక్క పట్టుచీర కొనకపోతివి. గా అమృతవ్వ దొర్సాని కట్టుకున్న పట్టుచీరసోంటిది కావన్నని ఎన్నిసార్లు జెప్పిన? నలుగురు పొల్లగండ్లయినా బిడ్డ లగ్గంజేసి పంపించినా గా కోరికయితె తీరకనేపాయె. ఇగ నేను బొందలకు పోయినంక దొరుకుతదా సాకాచీర? " నిష్టూరంగా అంది లింగమ్మ.

భార్య కోరిన ఆ చిన్న కోరిక తీర్చకపోవటం మల్లయ్యకు బాధాకరంగానే ఉంది. తాను చీరలు నేస్తున్నా పట్టుచీరలు నేసినా అంత ఖరీదైన చీరను భార్యకివ్వగలిగేవాడు కాదు. తాను నేసిన చీరల్లోంచి అమ్ముడుపోగా మిగిలిన వాట్లోంచి ఎవరూ కొననివి భార్యకిస్తాడు. ఈ విషయం అందరికీ తెలిసిందే. తనకు భార్య కోరే చీర కొనిచ్చే శక్తి లేదన్నది వాస్తవం ఆ మాటే భార్యతో అన్నాడు అనునయంగా.

"మనం పట్టుచీరలు కొనన్నంటె ఎల్లుతదా నోయ్ పట్టు చీరంటే మాటలనుకుంటున్నవా? "

"చీరలు నేసేది మనమే కాని మనకు మంచి చీరలుండద్దు. అంతేకద నువ్వనేది..? "

ఆ మాటలు సూటిగానే తగిలాయి మల్లయ్యకు. "ఆ మాట నిజమే. నేను కాదంట



## సలహా

ఓ భార్యాభర్తల జంట ఓ పెద్ద ఎగ్జిబిషన్‌కు వెళ్లింది. అక్కడ వేలల్లో జనం.. ఇసకేస్తే రాలడంలేదు. దురదృష్టవశాత్తూ ఆ జనంలో భార్య కాస్తా తప్పిపోయింది. ఆమె కోసం భర్త వెతకని ప్రదేశంలేదు. అయినా లాభంలేకపోయింది. తర్వాత పోలీసులకు ఫిర్యాదు చేశాడు. పేపర్లోకూడా ప్రకటనలు ఇచ్చాడు. అయినా ఆమె జాడతెలియలేదు.

దాంతో అతను చేసేదిలేక ఊళ్లోనే ఉన్న ఓ రామాలయానికి వెళ్లి భక్తిగా పూజలుచేసి 'స్వామీ.. నీ మహిమతో నా భార్యను ఎలాగైనా తిరిగి నావద్దకు రప్పించు' అని వేడుకున్నాడు.

వెంటనే రాముడు 'బాబూ.. ఈ రోడ్డంటే మరికొంచెం దూరం పోయావంటే అక్కడ హనుమంతుడి గుడి ఉంది. పోయి ఆయనను వేడుకో. నా భార్య మాయమైపోయినప్పుడూ అతనే సాయం చేశాడు' అని సలహా చెప్పాడు.

లేను. ఇది జరుగుతున్న ఇలవర్సె. రైతు పంటలు పండిత్తడు.. మరయినె మంచి బియ్యం తింటడా? జొన్న గడుకో, మక్క గడుకో తింటడుగద! మాదిగోల్లు చెప్పులు చేస్తరు. కాని వాళ్ల కాళ్లకు చెప్పులుండయి. పని చేసేటోల్లకన్ని అందుడీ దేశంల కష్టమే మరి.!"

తండ్రి మాటల్లోని లోతును, తాత్వికతను అర్థం చేసుకుంటానికి ప్రయత్నిస్తున్నాడు శంకరయ్యా. ఆ మాటలు లింగమ్మకు తెలి యనివేంకాదు. జీవితం నేర్పిన అనుభవాలు నిరక్షరాస్యులైనా ఆ మాటలనర్థం చేసుకు నేట్టు చేస్తున్నాయి. మాట్లాడకుండా తన పనిలో నిమగ్నమైంది.

"నా జీవితంలో నేను కొనిస్తనో లేదో కాని మన శంకరయ్య మా కొనిస్తడు తియ్యి. వాడు చదువుకుంటున్నడు గద.. చదువయి పోయి నౌకరి దొరుకుతె గదేమంత బిసా యిదేం గాదు. వాన్ని చదివించాలని నువ్వే కొట్లాడి చదివించవడ్తివి. గింత జెయ్యడా? "

తండ్రి మాటలకు వెంటనే స్పందించాడు శంకరయ్యా

"అవ్వా! నేను పెద్దగైనంక నీకు పట్టుచీర తప్పకుంట కొనిస్త నా మొదటి జీతం పైస ల్తోనే కొనిస్త సరెనా? కొనియ్యకుంటె గప్పుడు నన్నడుగు" అన్నాడు.

"ఆ ఇక నువ్వు కొనిత్తవు తియ్యి. పట్టు ఒళ్ళి కొనియ్యమని మా నాయన నడిగిన. పెండ్లివరకు కొనిత్తనన్నడు. పెండ్లాయె అన్న యిపాయె. అటెనుక మీ నాయిన నడిగిన. అయినె కొనిత్త కొనిత్త అనుకుంటనే గిన్నేండ్లు గడిపిండు. ఓ దిక్కు ముసల్తనం రావట్టె.. పట్టుచీరయితే దొరుకకపాయె. ఇప్పుడ్గ నీ మాటను 'నమ్మి ఎదిరి సూడాలె.. గిదంత ఎట్లున్నదంటె లొటపెట పెదవులకు నక్కాశ పడ్డట్టే ఉంది. లొటపెట పెదవులెప్పుడు రాలి కింద పడాలె నక్కెప్పుడు తినాలె? అప్ప టివరకు నువ్వు కొన్నా నేను కట్టుకుంటనో లేదో? పట్టుచీర గప్పుడు కట్టుకుంటె ముసల్త నానికి దసల్ రైకని చెప్పరా మరి? " అంది లింగమ్మ.

"పట్టుచీరలు కట్టేదే గప్పుడోయ్!"

"నువ్వెన్నన్న చెప్పే అవ్వ! నా మొదటి జీతంతోని నీకు పట్టుచీర కొనుక్కత్త ఇగ సరెనా."

"ఆ ఇగ నువ్వు కొనిత్తవు పటు నువ్వు కొసెల్లదాక సదువాలె నీకు నౌకరి రావాలె అప్పటివరకు నీకు లగ్గం, గిగ్గం అన్నయిపో తాయి గద! నీ జీతంతోని నాకు పట్టుచీర కొంటనంటె నీ పెండ్లామూకుంటదా? గప్పుడు దానికి కొనిచ్చుటానికే సరిపోదెరి కేనా? నాకు కొంటడట ఈనె గవ్వన్ని ఉత్తమాటలే."

తల్లి మాటలకు సిగ్గుపడ్డాడు శంకరయ్యా.

"ఆలూలేదు చూలూ లేదు అల్లుని పేరు సోమలింగమన్నట్టున్నయి మీ మాటలు అప్పటి వరకు సూత్రాం పటు ఏ రాజు ఏ పట్నమేలుతడో ఆ యాల్లకు" అన్నాడు మల్లయ్య.

"అది నువ్వే అంటివి ఇది నువ్వే అంటివి నీకు కొనియ్యసాతగాక కొడుకు మీదికి దొబ్బితివి మల్ల గిట్లనవడ్తివి."

"ఏదో తియ్యిలేవోయ్! అన్నిట్ని పట్టుకుం టెట్ల? మనం పట్టుబట్టలు కట్టే కాలం కాదిది? ఎల్లుతె నేను కొననా? ఓ దిక్కు మన శంకరయ్యను సదివించుడాయె. ఇల్లు ఎల్లదీయన్నాయె. రోజురోజుకు నేతబట్టలకు గిరాకీ తగ్గవట్టె ముంగట ముంగట మొగ్గం గుంటలు పూడుకుపోతాయో ఏమొ? "

తల్లిదండ్రుల మాటల్లోని విషాదాన్ని, ఆత్మీయతను శ్రద్ధగా వింటున్నాడు శంక రయ్యా. క్రమక్రమంగా నేత పనులు కొంత కొంతగా దెబ్బతినడం శంకరయ్యా గమని స్తూనే ఉన్నాడు. చేనేత ఇతర సహకార సంఘాల పేరు మీద కొందరు తెల్లబట్టల వాళ్లు తయారు కావడమూ చూస్తున్నాడు. ఆ సొమ్మును కొందరు తింటూ పైకొస్తున్నా రని అనుకోవడమూ వింటున్నాడు తాను

చదువుకొని కుటుంబ గౌరవాన్ని పెంచా లని, ఆర్థిక స్థితిని బాగుపరచాలని తనలో తానే అనుకుంటున్నాడు శంకరయ్య.

"అవ్వా! నాయినా! నేను మంచిగ సదువు కుంట. నాకు నౌకరయిందంటె ఇగ మన కష్టాలన్నీ పోతయి." అన్నాడు.

"సూత్తాం పటు గప్పటివరకు నువ్వు నౌక రయెదాక సదుమతె గద.! ఊల్లున్నంతవ రకు సదివినంక సూత్తామెట్లుంటదో.?"

తండ్రి మాటలకు వణికిపోయాడు శంక రయ్య.

తన కులవృత్తి పని మీద శంకరయ్యకు ఏహ్యాభావమేం లేదు ఆ పనులు చేస్తూనే చదువుకుంటున్నాడు. కాని తన కులం పనుల్లో స్థిరపడటం ఇష్టం లేదు. ఓ దిక్కు దొరలతో తిట్లు, అవమానాలు. మరో దిక్కు ఆర్థిక ఇబ్బందులు అతని నాపనిలో స్థిరప డకూడదనే చెబుతున్నాయి. చదువులో చురుకైన తాను బాగా చదువుకొని ఏదైనా ఉద్యోగం చేద్దామనుకుంటే తండ్రి భవిష్యత్తు చదువుగూర్చి అనుమానంగా మాట్లాడటం బాధాకరంగా ఉంది.

"నాయినా నువ్వు గట్లనద్దే నేను మంచిగ సదువుకుంటన్నగాదె పనిజెయ్యవడ్తి సదువు కోవడ్తి."

"సూత్తాం పటు గప్పటివరకు ఊల్లున్నవ రకైతె ఐపోనియ్."

"గట్లనద్దే నాయిన నేను బాగ సదువు కుంట నౌకరిజేత్త."

"మీ నాయిన గట్లనే అంటడు. మాసదివి త్తడు. నువ్వయితె మంచిగ సదువుకో. సెర వొయ్యయినా సదివిత్తం నిన్ను."

తల్లి మాటలతో శంకరయ్య ముఖం వెలి గింది. మరింత ఉత్సాహంగా పనిచేస్తు న్నాడు.

వ్యవసాయ కుటుంబాల వాళ్లు, వృత్తిప నులు చేస్తూ బతికేవాళ్లు చదువుకోవడం ప్రారంభించిన మొదటి దశలో తమ తమ పనులు చేస్తూనే చదువుకునే వారు. చదు వుకూ పనికీ సంబంధముండేది కాదు. అలా చేయకపోతే గడిచేది కాదు. అలా చేయడం వల్ల వాళ్లలో ఆత్మవిశ్వాసం, పెరిగేది చదు వుకున్న తర్వాత ఉద్యోగాలు రాకున్నా పని చేసుకొని బతుకగలిగే ఆత్మవిశ్వాసముం డేది. స్వాతంత్ర్యానంతరం పుట్టి పెరిగి బడికి పోయిన మొదటి తరం శ్రామిక కులాల వాళ్లు పనినెప్పుడూ తక్కువగా భావించలేదు. ఆ తరంలోంచి వచ్చిన వాడే శంకరయ్య.

"నాయినా! నేనెంత పనయిన జేత్త. కాని నన్ను నడుమంత్రాన సదువు బందుజెయ్య మనద్దు. నౌకరయెదాక సదివించాలె."

కొడుకు మాటలకు హృదయం చలించింది మల్లయ్యకు.

"చదువుకుంటున్న పిల్లలకు పని జెప్ప న్నంటె కష్టమే అనిపిస్తది బిడ్డా! కాని ఏంజె య్యమంటవు...? ఎల్లకనే ఇదంత ఇప్పుడు మాల, మాదిగ, కాపు, గొల్లోల్ల పిల్లలు గూడ కొంత కొంత మంది సదువుకుంటున్నరు గద.! వాళ్ళందరు గూడ పనిజేత్తరు. మన దన్న కొంత అలుకటి పనిగని వాళ్ళదయితె ఎవుసం పనాయె మోటుపనాయె. ఏమన్న గానియ్యి బిడ్డ నిన్ను బాగానే సదివిత్త నీకు సదువుకోవన్నని గంతగనం ఆపేక్షున్నప్పుడు సదివియ్యకుంటె నాది తప్పయితది."

తండ్రి మాటలతో శంకరయ్య హృదయం ఆనందంతో నిండి పోయుంది. సంతోషంతో ఎగిరి గంతేసినంత పనిజేశాడు. మరింత ఉత్సాహంగా పనిచేస్తున్నాడు. తండ్రి చెప్పిన పనిని ఇకముందు చేయనన కూడదనీ అను కున్నాడు.

"పొద్దు గూకుతుంది పశువులు ఊళ్ళేకత్తు న్నయి. చింత చెట్టు మీద పక్షులాలుత న్నయి. చీకటిపడ్డా ఇంకా దీపం ముట్టియ్య లేదాయె లింగమ్మ. సందల వీడక ముందే ముట్టిచ్చెదానివి గద" వాకిట్లోకొచ్చి నిల్చుంటూ అన్నాడు లస్మయ్య పటేలు.

"మాట్లాడుకుంటూ పనిజేత్తాంటే యాల్ల

తెలుత్తలేదు. దీపం ముట్టిత్త." అని లేచి నిల్చుంది లింగమ్మ. రెండు ఎక్కలు ముట్టించింది. ఒకటి ఇంట్లో పెట్టి మరొకటి బయట దిగుట్లో పెట్టింది. వంట చేయడానికి పోయింది.

"ఎందుకో వత్తిరి పటేల! శంకరీ! నువ్వు సదువుకో పో. దీపం వెలుగుకు నేను నాయినకు సాయం జేత్త" అన్నాడు పక్కూరికి పోయొచ్చిన రాజమల్లు.

అన్నకు పని అప్పగించి పుస్తకం పట్టుకొని కూర్చున్నాడు శంకరయ్య.

"చిప్ప మల్లయ్యా! ధోతులు నేయిమని చెప్పితిగద? ఇంకెన్ని రోజులయితది? ఇగో... చినిగిపోయిన ధోతులు కట్టుకుంటున్న. ఎప్పుడిత్తవో చెప్పు" అన్నాడు లస్మయ్య పటేలు.

"అయిపోతయి పటేలా! మొగ్గం మీదున్న చీరలియ్యాల్ల దిగుతయి. అటెనుక మీ ధోతుల్నేసుడే. రొండు రోజుల్ల మా ఇచ్చేత్త."

"ఏం నేసుడో ఏమో! వేరేకాడ కొనుక్కొమ్మంటవా మరి...?"

"గట్లేగిర్త పడితెట్ల పటేల! మీరు గట్టిన ధోతులు, రుమాలు, అంగిబట్ట అన్ని మా ఇంట్ల నేసినయే కద! నేను నేసినయి గాక్క వేరే బట్టలు గట్టింద్రా మీరు? బందవస్తుగ నేస్త మీ కోసం."

"సన్నపుయి మిల్లుబట్టలు మా వస్తున్నయిగని నాకెందుకో అవ్వి కట్టబుద్ధి గాదు నువ్వు నేసినయి కట్టుడే అలువాటయింది. జెప్పన కానియ్ మరి. చింపులు గట్టుకోని ఎన్ని రోజులుండాలె?"

"మా అయిపోతయి పటేలా? ఓ రోజటూ ఇటూ కాని"

"ఏంది నడుమేందో కాని పడేత్తివి"

"ఓ నాలుగ్గుంచాల మక్కలు కొలువుంఢ్రి గట్టి దినుసాయె. ఇంట్ల గడుకయిపోతంది. అటెనుక లెక్క జూసుకుందాం."

"గదానిదేముంది భాగ్యం? ధోతులిచ్చినా ఇయ్యకున్నా ఏడికిపోతున్నయి? నాలుగు గుంచాలు గాదు గిద్దెడు కొలుసుకచ్చుకో. వద్దంటున్ననా నేను? సరెగని మీరంత గా మొగ్గం మీదనే పనిజేత్తున్నరా? మొగ్గాల పని ఎనుకవడ్తున్నట్టనిపిత్తంది."

ఆ మాటలకు మల్లయ్య ముఖం చిన్నబోయింది. "ఏం జెయ్యిమంటవు పటేల! ఏదో వచ్చిన పని జేత్తున్నం విలువిద్యలెన్ని నేర్చి నా కులవిద్యకు సాటిరావు గువ్వల చెన్నా అన్నరు గద ఇప్పుడవ్వే పోతెట్ల పటేల?" అన్నాడు.

"ఎటువోతయి? ఏదో రూపంలుంటయి కాలంతోని మనం నడువాలె ఎవుసాల పని గూడ గంతే ఐతదో ఏందో? ఒక్కొక్కలు ఊళ్ళిడిసి బాయి పనులకు పోతంద్రు."

"ఎవ్వలెటుపోయినా ఊళ్ళ విలువ ఊళ్ళకుంటది పటేలా! అందరు మల్ల ఊళ్ళెకు రాక తప్పది."

"సూత్తాం పటు ఏ కాలమెట్లత్తదో? అవు గని చిప్పమల్లయ్యా మీకు చిప్పని పేరెందు కచ్చింది? "చిప్పదెచ్చుకోరా శివ్వా అందుకు తయ్యారవ్వా" అనుకుంటెగిరింద్రా మీ ముత్తాతలు." అంటూ నవ్వాడు లసుమయ్య పటేలు.

"కాపుదనపోల్లకు, వృత్తిపనులు చేసుకునెటోల్లకు ఇండ్ల పేర్లు చిప్ప, కడుముంత, చెట్టు, ఆకుల, గొట్టం, గడ్డం, సందిన, కాల్వ, గోరంట్ల, తీగెల అసోంటి పేర్లున్నయిగద పటేల... మీ ఇంటిపేరు గడ్డపోల్లు. కొన్ని పనులను బట్టి, వృత్తులను బట్టి, ఊళ్లను బట్టి వచ్చినయి. మనకేమో గిసోంటి ఇంటి పేర్లుంటే బ్రాహ్మండ్లకేమో రుషుల పేర్లమీదున్నయి. గివ్వెట్లొచ్చినయో చెప్పుడు కష్టం."

"గా మాట నిజమే కాని ...గా బామండ్లకెందుకో బరుకతే ఉండది. సరె గని మీ చిన్నోన్ని కొసెల్ల సదివిత్తవా?"

"ఊళ్ళున్నదాక సదివించినంక సూత్త."

"సూసుల్లేదేం లేదు. నా కొడుక్కి నౌకరా యేదాక సదివిచ్చుడే. కన్నాగురు తోలి సది విత్తం. ఇంత అప్పయిన మంచిదే" అంది

లింగమ్మ.

"ఆ... నీదేం బోతంది? మోసెటోని కెరుక కాడి బరువు"

"నేను గూడ మోత్తన్న తియ్యి కావిడి. నేనేం వట్టిగ కూసుండి తింటలేను. నీతోని సమానంగ పనిజేతున్న గద! మంచయినా చెడ్డయినా నాకు పట్టింపు లేదనుకుంట న్నవా? " అంది లింగమ్మ.

"లింగమ్మా చిప్ప మల్లయ్యా! మన ఇండ్లల్ల ఆడయినా, మగయినా వట్టిగ కూసుండి తింటె నడువది. అందరు పనిజే సుడేనాయె. మీరంత కష్టపడి శంకరయ్యను సదివియ్యిండ్రి. నేను నా ఇద్దరు కొడుకులను సదివిత్తలేనా? ఇంట్లో ఒక్కలన్న సదువుకు న్నోల్లు తేలుతె మంచిదే కద... పెద్దోల్లిద్దరు నాలుగైదుల్నే ఆపిరి."



"గా మాటే నేనంటె ఈనె తాపకో మాటం టడు. ఏడెట్లయిన శంక రన్నను సదివించుడే" అంది లింగమ్మ.

"సరె నేం బోతన్న రొండు మూడు రోజు లల్ల నాకు ధోతులియ్యకుంటె నా సంచకరి పైసలు నేను దీసుకుంట" అన్నాడు బజా ర్లోకి నడుస్తూ లస్మయ్య పటేలు.

"గట్లెందుకంటరు పటేలా? ధోతులిత్త నేనెన్నడన్న సంచకరి పైసలు వాపసి చ్చిన్నా? " అన్నాడు చిప్ప మల్లయ్య.

"రాత్రయింది గాదే అవ్వ బువ్వడికిందా? తిందామిగ అటెనుక మొగ్గం నెయ్యొచ్చు షరి గుంజల్నుంచి మాల్ తియ్యిండ్రి." అన్నాడు వీరయ్య ఇంట్లోంచి వాకిట్లోకొస్తూ.

"కాళ్లు జేతులు కడుక్కోని రాండ్రి. బువ్వ వెడత" అని ఇంట్లోకెళ్ళింది లింగమ్మ.

★ ★ ★

అర ఎకరానికి పైగా స్థలమున్న విశాల మైన స్థలం... అందులో కట్టబడున్న లంకంత కొంప. అదే రాజారావు దొరిల్లు. ఇంటిముందు పెద్ద చావడీ. ఆ చావడిలో ఐదారు కుర్చీలు, చాపలు పడక కుర్చీలో కొలువుదీరున్నాడు రాజారావు. అతని చుట్టూ వందిమాగధులనేకులున్నారు. చేతిలో ధోతుల జత పట్టుకొని చావడి ముందు నిల్చున్నాడు చిప్ప మల్లయ్య. అతని పక్కనే రాజ మల్లు, శంకరయ్యలు నిల్చున్నారు.

"దండాలు దొరా!" నమస్కారం చేశాడు చిప్ప మల్లయ్య.

"ఆఁ ధోతుల జత తెచ్చినవా మల్లయ్య కొలువ్ ఎంతున్నయో." అన్నాడు రాజారావు.

కొత్త ధోతీ విప్పాడు మల్లయ్య. ఇంకో చివర సుంకరి పట్టుకున్నాడు.

"ఒకటి రెండు మూడు నాలుగు" బారెడు పొడుగున్న తన కుడిచేయి మూరతో ధోతీని కొలుస్తున్నాడు చిప్ప మల్లయ్య. కొత్తగా నేసిన ధోతీ గంజితో కరకరలాడుతుంది. మూరతో కొలుస్తుంటే చేతులు ఒరుసుకపో యినట్టవుతుంది.

"ఎనిమిది మూరలు. అంటే నాలుగు గజాలుంది దొర. ఇంకొంచెం ఎక్కువగానే ఉంది" కొలవటమాపి అన్నాడు మల్లయ్య.

"మంచిగ కొలువుమంటే ఒక్కటీ రొండని జెప్పన్నే ఖతం జేత్తివి సరిగ్గ కొలిసినవా? " అన్నాడు దొర.

"నా మూర పెద్దది. నా మూరతోని

❖ సత్యం తెలుసుకున్నవాడు మౌని అవుతాడు. – ఎమర్సన్

కొలిత్తె ఇంతెక్కోనే అయితదిగా తక్కోగాదు. నేనెప్పుడూ ధోతీ, చీర, పంచె ఏది నేసినా బెత్తెడో, జానెడో ఎక్కోనే పెడతాను గాని తక్కోగాదు. ఇది నా కలవాటు" అన్నాడు చిప్ప మల్లయ్య.

"మా చెప్పినవ్ తియ్యి సాలయినె. ఎక్కువ పెడుతడట. దసురప్పుడు నీ దగ్గర్నే ధోతీ తీసుకున్ననా? చింగులు మంచిగ ముడుసుటానికి గూడ సాలలేదు పొడుగు. గుంజి గోచీ పెట్టుడే కష్టమైంది. మల్ల గట్లనే గోచి లిరుకుట మాయెటట్టు జెయ్యకు. అట్ల జేత్తె కట్టుకున్నంక నీది నీకు పారేత్త. గందుకేనేమొ సాలె సంకుటం గోచి లిరుకుటం అన్నరు" హహహహ అంటూ నవ్వాడు రాజారావు. దొరతోపాటు అక్కడు న్నవాళ్లంతా గొల్లుగొల్లున నవ్వారు.

చిప్ప మల్లయ్య ముఖం చిన్నబోయింది. తాను, తనలాంటి వాళ్ళు దొరలముందెంతో వినయ విధేయతలతోనే ఉంటారు. దొరలు చెప్పినట్టే బట్టలు నేసుకొస్తారు. వాళ్ళు అడి గిన ధరకే ఇస్తారు. అయినా అవమానాలు తప్పకపోవడం చిప్ప మల్లయ్యకు బాధాకరం గానే ఉంది. సాలె సంకుటమంటూ అకార ణంగా తనను అవమానానికి గురిచేయడం భరించరానిదిగానే ఉంది. ముఖం మాడ్చు కుని ధోతీని మడిచాడు మల్లయ్య. దొర చేతిలో పెట్టాడు.

"నాలుగు గజాల మీద బెత్తెడుంది దొరా" అన్నాడు.

"ఇంకో బెత్తెడు పెడితేంబోతుంది? గిదే కక్కుర్తి. కొత్తప్పుడు నాలుగు గజాలుంటది. గంజి పెట్టి నేసింది గదా? ఉతికేవరకు ఈడ్చుకపోతది. పొట్టిగైతది. జానెడంత ఎక్కువ పెడితే కొన్ని ఉతుకుల తర్వాత గుంజుకొచ్చినా నాలుగు గజాలుంటది. గోచీ పెట్టుకుంటానికి ఇరుకుటం గాదప్పుడు... కక్కుర్తి గదా. ఇంతంత ఎక్కో పెట్టక ఈడ్చుకచ్చెటట్టు పెడ్తరు. గోచీ ఇరుకుటమై పోతది. అందుకే మరి సాలె సంకుటం గోచి లిరుకుటం"

మరోసారని బిగ్గరగా నవ్వసాగాడు దొర.

దొరతోపాటు వాళ్ళూ హేళనగా నవ్వుతు న్నారు.

చిప్ప మల్లయ్య ముఖం మరింత చిన్నబో యింది. దొరలు, రెడ్లే కాకుండా నావాళ్ళు అనుకున్నవాళ్ళు కూడా హేళనగా నవ్వడం అతనికి చెప్పలేనంత బాధగా ఉంది.

"పోగుకు పోగుకు నడుమ దూరం బెట్టి నేస్తరు కక్కుర్తితోని. నీళ్ళళ్ళ తడిసె వరకు దగ్గరికచ్చి ఇరుకుటమైతది. గందుకే గోచిల ఇరుకుటమన్నరు" చెప్పాడు పట్వారి.

దొర చెప్పిన మాటకు మరింత బలం చేకూర్చి ఆయన మెప్పు పొందే ప్రయ త్నంలో ఉన్నారు వాళ్ళు.

"సరే గోచి లిరుకుటమంటేందో చెప్పినను పట్వారి సాబ్. సాలె సంకుటమంటేంది మరి.? అందరంటుంటే విన్న కాని దాని అరుతమేందో నాకయితే తెలువది" అన్నాడు కత్తెర్ల భూమయ్య.

"అగ్నికాజ్యం పోసినట్టు చెయ్యవట్టువి గదనే భూమన్న దాన్నింకా పొడిగియ్య వడి తివి" అన్నాడు వెంకటేశం.

"ఉన్న మాటంటేం బోయిందోయ్ బూర్ల యినె"

తన కులాన్ని, వృత్తిని కించపరుస్తూ వాళ్ళు ఆనందించటం చిప్పమల్లయ్యకు వేద నగా ఉంది. తాను అవమానానికి గురవు తుంటే వాళ్ళు రాక్షసానందం పొందడం హృదయశల్యంగా ఉంది. తన వృత్తిని, పనిని హృదయ పూర్వకంగా ప్రేమిస్తు న్నాడు మల్లయ్య. అది పెద్దగా కడుపు నింపకున్నా దాంతో జీవనాన్ని వెళ్లదీసుకుం టున్నాడు. మగ్గంగుంటకే అంకితమై బతికే తనను, అన్ని రకాల బట్టలు నేసే తనను అవమానించడం అతనికి బాధగా ఉంది. తన మగ్గం మీద ధోతులు, చీరలు, పంచెలు, రవిక బట్టలు, అంగీ బట్టలు, తువ్వాలలు వంటి వన్నీ నేయడంలో నేర్పరి

తాను. రకరకాల నాణ్యత గల బట్టలూ నేస్తాడు. ఇరవై నంబరు, నలభై నంబరు వరకుండేవి దొడ్డు ధోతులే. ఇరవై నంబరువి బాగా దొడ్డుంటాయి. వీటిని ముసలి వాళ్ళు కడతారు. 30, 32 నంబరు ధోతులూ ఉంటాయి. చాలీస్ నంబరు బట్టంటే సగటు బట్టన్న మాట. అరవై నంబరంటే మజ్లిస్. తన మగ్గంపై నూట ఇరవై నంబరు బట్ట వరకూ నేస్తాడు తాను. నంబరు పెరిగిన కొద్దీ నాణ్యత పెరుగుతుంది.

తన కొడుకుల ముందటే తనను కించపరుస్తుంటే తన పనిని గూర్చి ఆలోచిస్తూ నిల్చున్నాడు మల్లయ్య. ఇన్ని రకాల బట్టలు నేసినా చేతికి మూతికి అన్నట్టే ఉండటం, అవమానాలు తప్పకపోవడం మల్లయ్యకు దుఃఖంగా ఉంది. అతని కనుగుడ్లనిండా నీళ్ళూరాయి.

"సాలె సంకుటమంటేందో చిప్ప మల్లయ్యనే అడుగుతె చెప్పతడు" రాజిరెడ్డి హేళనగా అన్న మాటలను భరించలేకపోతున్నాడు మల్లయ్య.

"నేను చెప్పన్నా మరి? "

"తెలిస్తే చెప్పలేవోయ్ వెంకట్రెడ్డి"

"ధోతీ సాధారణంగా నాలుగు గజాలుంటుంది కదా. గోచీ పెట్టి సింగులు ముడువాలంటే నాలుగు గజాలు, ఇంకొంచెం ఎక్కువుంటే బాగుంటుంది. అట్లానే నేస్తారు కూడా. కానీ ఓ సాలయినే కక్కుర్తి పడ్డడు. దూరం_దూరంగా పోగులు పెట్టి సరిగ్గ నాలుగు గజాలు నేసుకొచ్చిండు. నాలుగు గజాలు కొలిసిచ్చిండు. కట్టుకునుటానికి ముందు ఓసారి ఉతికెండేస్తరు. ఉతికి ఎండేసి కట్టుకున్నడు దొర. అది దగ్గరికి ఈడ్చుకచ్చింది. గోచీ పెడుతామంటే ఇరుకుటమయింది. సాలయినె చేసిన సంకుటం తోని గోచీలో ఇరుకుటం అయిపోయింది కదా. దాంతోనే ఈ సామెతొచ్చింది. సాలయనె చేసిన సంకటమే ఇరుకుటమైన ధోతీకి కారణమని ఈ సామెత తాత్పర్యం. గదీ సంగతి" వివరించాడు వెంకటరెడ్డి

ఆ మాటలకందరూ బిగ్గరగా నవ్వసాగారు.

రాజమల్లు, శంకరయ్య తండ్రి పడుతున్న అవమానాలను గమనిస్తున్నారు. వాళ్ళకు రక్తం సలసలా ఉడుకుతోంది. తన పని తాను చేసుకుంటూ పోయే తండ్రిని అలా ఎందుకు అవమానిస్తారో వాళ్లకర్థం కావడం లేదు. తాను మరింత చదువుకొని ఉన్నత స్థానంలో కెదగడమే ఇలాంటి వాళ్ళకు సరైన సమాధానం చెప్పడమవుతుందని నిర్ణయించుకున్నాడు శంకరయ్య. వాళ్ళు అవమానిస్తూ ఆనందపడుతూనే ఉన్నారు.

"ఈ ధోతులయితె గోచిలిరుకుటం కావు గదా!" అన్నాడు దొర.

"ఏంగావు దొరా! ఇదెట్లుందంటే పేదోని పెండ్లం అందరికీ మరుదలే అన్నట్టుంది. పటేలా! దొరలూ నవ్వుండ్రి. బాగా నవ్వుండ్రి. నవ్విన నాపచేనే పండుతుందంటారు" అన్నాడు చిప్పమల్లయ్య.

దొరల ముందు అంత ధైర్యంగా మాట్లాడిన అతని దిక్కువాళ్లంతా ఆశ్చర్యంగా చూస్తున్నారు.

అప్పటివరకు అక్కడే ఉండి మౌనంగా ఉన్న ఓదయ్య నోరు తెరవక తప్పలేదు. అతడు పంచాయతీ మెంబరు. గొడ్లకాపర్ల కుటుంబంలోంచి వచ్చిన ఓదయ్య పంచాయితీ మెంబరయినా దొరలు అవమానాలు పొందుతున్నవాడే. ఆ మధ్యకాలంలో వస్తున్న యువజన సంఘాలు వాళ్ళలో కొంత ధైర్యాన్ని కలిగిస్తున్నాయి.

"చిప్పమల్లయ్యా! దొరలు తమదే కాలమనుకుంటున్నారు. ఇదెప్పటి కిట్లనే ఉంటాదనుకుంటున్నారు. వృత్తి పనుల వాళ్లను, చిన్న కులాల వాళ్ళను కించపరుచుకుంటా ఆనందపడుడు వాళ్ళకు మామూలే. అన్నా పనులు చేసుకుంట, అన్ని ఉత్పత్తులు చేసేది మనం. ఆ పనులను కించపరుసుడు వీళ్లకు సంబురం" ఓదయ్య మాటలు చిప్పమల్లయ్యకెంతో ధైర్యానిచ్చాయి.

"అయ్యో! ఏమన్నామని మల్లయ్యకు రాని రేషం నీకు వత్తుందోయ్ ఓదయ్యా! ఏదో అట్లన్నందుకు నువ్వు లేవవడ్తివి."

"అంటరు మాలిపటేలా! మా అసోంటోల్లను కించపరుచుడు మీకలువాటే కద! వేమన్న అసుంటోల్లకే తప్పలేదు గీ అవమానాలు. వేమనది కాపు కవిత్వమని తిట్టింద్రట. ఇగ మమ్ముల నెవ్వలడిగింద్రు. గసోంటి గొప్పోళ్ళే బతికున్నపుడు అవమానాలు పడ్డరు"

"ఓదయ్యా! నువ్వప్పుడు సదువుకున్న నాలుగో తరగతి సదువు మాకు తలుకాయ నొప్పే అయింది. రామాయణాలు, పురాణాలన్ని తిరిగెత్తవు కథలు జెప్పుతవు." అన్నాడు పట్వారి.

"అంటే? మా అసోంటోల్లు సదువుకో వద్దా పంతులు! అప్పుడెప్పుడో గొల్లని సాహిత్య విద్య, కోమలి నిజమున్ అని సుమతి దెప్పి పొడిచినట్టే నువ్వూ అనవడ్తివి. గొల్లలకు సాహిత్యం వద్దంటె మరా గొల్లడు చెప్పి భగవద్గీతనే అందరు నెత్తి మీద పెట్టుకుంటున్నరెందుకు? "

"అది కాదు ఓదయ్యా, దొరలేమన్నారని"

అతని మాటల్ని పూర్తి కానీయలేదు ఓదయ్య.

"నన్ను తిట్టలేదు ఇతరులను తిట్టిండని సంబురపడకు బెస్తకొంరయ్యా! మొదట్ల అందరు చిన్న కులాలోల్లమని హీనంగ మాట్లాడి సంబుర పడెటోల్లు పెద్దలోకులు మిమ్ములను బెస్త పెద్దరికం చెప్పుల మోతని అవహేళన చేసింద్రు. అందర్ని ఏదో విధంగా కించపరిచినోల్లే ఈ దొరలంతా"

బెస్తకొంరయ్యా ముఖం చిన్నబోయినట్ట యింది.

"ఇంతకూ బెస్తపెద్దరికం చెప్పుల మోతం టేంది? " అన్నాడు రాజ్ రెడ్డి.

"ఇంతకు ముందు బెస్తోల్లు బిజితలు, పల్లాకులు మోసేటోల్లు గద. అయిన గివన్నీ పొడిగించుడెందుకు తియ్యి" అన్నాడు వెంకటేశ్వరరావు.

కులాల పేర్ల మీద మనుషులను కించపరుస్తుండటం శ్రామిక కులాల వారికి అవమానకరంగా ఉంది. వేదనగా ఉంది వాళ్ళకు బాధ కలిగిస్తూ దొరలు, దొరల కుటుంబాల వాళ్ళు ఆనందపడుతున్నారు. వినోదం తిలకిస్తున్నారు.

చిప్పమల్లయ్య ముఖం మాడిపోయింది.

"దొరలూ. మీరంతా దొరలు. ఏమైనంటరు.. మాదిగపీసునా గొడుదు అని మాటిగవాళ్ళను, మాల పంకిడిగాళ్ళని మాల వాళ్లనూ అంటరు గాళ్ళంతిప్పుడు తెలివి కత్తున్నను. మీరంటె పడరు మా అసోంటోల్ల నంటరు. మున్నూరు కాపోల్లకు నన్నూరు మొగలంటరు. దొరలు గదమీరు ఏమైనంటరు" అన్నాడు నిష్ఠూరంగా

"తాండా తాండా నీ బిర్రెక్కడిదాకంటె ఎనుగుల దాక అన్నదట గట్లుంది నీ సంగతి. చెప్పిందే చెప్పుతున్నవు. పాటుకలున్నయి అంటంద్రు ఏందట." అన్నాడు వెంకట్రెడ్డి

"అంటరు పటేలా అనకుంటేం జేత్తరు? మీకేమొ రెడ్డచ్చె మొదలాడు అని గౌరవంగనాలె.. నిండుమనంబు నవ్యనవ్యత సమానము బ్రాహ్మణుల కని అనాలె. మమ్ములనెమొ కించపరిచెటట్టనాలె. గిట్ల మనుషులను కించపరిచేటి సామెతలను వాడనేవాడద్దు. యాలుసాతులన్ని మీకు తాలూతప్ప మాకన్నట్టున్నయి లోకంలోన్న గీ సామెతలు. గివ్వీట్ని కనిపెట్టినోళ్ళెవ్వలో మీ ఆసోంటోల్లే అయ్యుంటారు" అన్నాడు ఓదయ్య.

చిప్పమల్లయ్యను కించపరుస్తూ మాట్లాడటంతో మొదలైన కులనింద పొడిగింపబడుతూ సాగుతూనే ఉంది. చిప్పమల్లయ్యలాంటి వాళ్ళు బాధపడుతూంటే దొర మనసులో సంతోషిస్తున్నాడు.

"పోనియ్యంద్రిగ చిప్పయినెకు పైసలిచ్చి

వెళ్లగొట్టుండ్రి పోతాడు. పిలిచి తిట్టుడుగా వట్టె పాపం. మల్లయ్య ఎంత శాంతి మనిష యినా కోపమత్తదిగ" అన్నాడు పట్వారి.

"ఆ ఏం కోపం తియ్యి. సాలోల్ల కోపం వరిగడ్డిమంట సోంటిది. తుష్మని లేత్తది. వరిగడ్డి మంటెట్ల తగ్గుతాదో గట్లనే మటాష యితది." అన్నాడు వెంకట్రెడ్డి.

"ఇంతకూ చిప్పన్న పేరెందుకచ్చింది? గీ చిప్ప అడుక్కునే చిప్పేనా? మూతపెట్టే చిప్పనా? "

"రాజిరెడ్డీ ఇగ ఇడిసిపెట్టుండ్రి మల్ల య్యను."

"పైసలిత్తరా దొర నేంబోత" అన్నాడు మల్లయ్య.

తన తండ్రి ధోతి నేసితెచ్చి ఇవ్వటమే కాకుండా అవమానాలు పడటం దాని ధరను దానానికన్నట్టు దీనంగా అడగడం శంకర య్యకు నచ్చడంలేదు కాని ఏమీ చేయలేని స్థితి- దొరిచ్చే డబ్బు కోసం దీనంగా నిల్చొ నున్న తండ్రి పక్కనే ఉన్నాడు రాజమల్లు.

"పైసలు మా ఇస్తగని చిప్ప ఇంటిపేరు సంగతేందో చెప్పు" అన్నాడు డబ్బులు చేతిలో పట్టుకొని రాజారావు.

"ఆకులతోని విస్తర్లు కుడుతరు. చుట్ట తాగుతరు. గొట్టం తోని పొయ్యూదుతరు. చిప్పంటే మన్ను. మట్టికి ప్రతిరూపం. మట్టి తోని చెయ్యనివేమున్నయి? మట్టిలేంది మనిషి భతుకుతాడా? మన్నుతోని చేసే చిప్పను కించపరుచుడెందుకు? చిప్ప చిప్పని దెప్పుడెందుకు? చిప్పను దెప్పుడంటె మట్టిని దెప్పినట్టే. మనందరం పోయేది రూపు మట్లెకే. ఇయ్యాల్ల మీది సాగుతుం దని మురుత్తున్నరేమొ. మురువుండ్రి, మురువుండ్రి గిట్లనే మురుత్తె రేపు మీకు ఇగో మా ఇంటి పేర్లున్న చిప్పలే గతయి తయి" అన్నాడు చిప్పమల్లయ్య.

దొర చేతులున్న పైసలు తీసుకొని గబ గబా నడుస్తున్నాడు. అతని వెంట రాజ మల్లు, శంకరయ్య నడుస్తున్నారు.

దొరకు సంబంధించిన వాళ్లంతా నోళ్ళు తెరిచి చూస్తున్నారు. గబగబా నడిచి తండ్రి నందుకున్నారు కొడుకులు.

"నాయనా! ఎందుకే గిట్ల భయపడుడు? మనమే బట్టలు నేసిస్తిమి. వాళ్ళేమన్న పైసలు పుక్కాని కిత్తండ్రా? మంచి పని చేసి నావు. ఆఖరుకు మంచిగ దులిపినావు." అన్నాడు రాజమల్లు.

"తెగిన బొక్కెన నూతిల్దాక ఏంజేత్తరో సూత్తాం."

"అన్నా మనం జేసుకుంట వాళ్లకెందుకే భయపడుడు? "అన్నాడు శంకరయ్య.

"గదే బిడ్డా గీ దేశంలున్న దరిద్రం. ఎవ్వ రైతె రాత్రనక, పగలనక ఆరాం లేకుండ పని జేత్తరో, అన్ని తీర్ల పంటలు పండిత్తరో వాళ్లకు విలువలేదు. అవ్వి వాళ్లకు చెందవు."

తండ్రి మాటల్లో ఎంతో లోతున్నట్టు గమ నించాడు శంకరయ్య.

"నాయనా గీ మూటనిజమేనే మనం ధోతులు నేస్తం, చీరలు నేస్తం, దుప్పట్లు నేస్తం, పందెలు నేస్తం. అన్ని తీర్ల బట్టలు నేస్తం. ఎన్ని నేసినా మనింట్ల సరిపోయి నన్ని బట్టలుండయి. కప్పుకునటానికి దొడ్డు దుప్పట్లుండయి. అవ్వకు పట్టుచీరన్న లేక పాయె... నా చేతుల మీదుగ ఎన్నో చీరల మ్మినానుగాని నాయినమ్మకు మంచి చీరొక్క టన్నిచ్చినావా అనుకుంటనుకుంటనే ముసల్ది జచ్చె. పట్టుచీరె పోనియ్ అయినె చీరలు రొండుమూడన్న అవ్వకున్నయా? " అన్నాడు. అతని వైపు ప్రశంసాపూర్వకంగా చూశాడు మల్లయ్య.

"ఇది మామూలు సంగతేబిడ్డ! కష్టపడి పండించినోల్లకు ఆ పంటందది. చాకలోల్లు న్నరు. వాళ్ళు ఊరోల్ల మురికిబట్టలన్నీ ఉతు కుతారు. మరివాళ్లకు ఒక్క మంచి చీర

✤ సంతోషంగా ఉండటం అనేది సాధించటం కష్టమైన పని. కేవలం ఇతరులను సంతోష పెట్టటం ద్వారానే అది లభిస్తుంది. – బేయార్డ్ టేలర్

యిన కట్టుకునే అవకాశముందా? కట్టు కుంటే పెద్దోల్లూకుంటారా? " అన్నాడు.

మల్లయ్య హృదయం భారమయింది.

"నాయినా ఇగో మనం జేత్తున్న పనిల ఎంతజేసినా ఏడే మార్కలన్నట్టుంటది. పని జేసేటోల్లేమొ గట్లనే ఉండవట్టిరి. కూసుండి తినెటోల్లేమొ మంచిగుండవట్టిరి."

యువకుడవుతున్న రాజమల్లు దిక్కు చూశాడు మల్లయ్య. "అదంతే కొడుక! వడ్ల గట్టయ్యా సూడు ఎన్ని తీర్ల కట్టెఫర్నిచరు జేత్తడు. మరాల్లింట్ల ఒక్క కుర్చీగూడుండది గద. ఎవ్వలన్నా వాళ్ళింటికి పోతె గా కుక్కిమంచాలల్లనే కూసోవాలె. మన సంగతి గూడ గంతేమరి!"

"నాయినా! గందుకే నేను మొత్తుకుం టున్న. మొగ్గం గుంటను నమ్ముకోని నువ్వు బతికింది మా సాలు. గీ మొగ్గం గుంటల్నే పనిచేసుకుంట నేనయితె బతుకలేను. ఇది నానుంచి గాదు. నేనిక్కడుండనే ఉండ."

రాజమల్లు మాటలతో గుండెల్లో రాయిప డ్డట్టయింది మల్లయ్యకు.

"గట్లెందుకంటవు బిడ్డ! ఇది మన వృత్తి. తరతరాలుగా వస్తున్న వృత్తి. దీనితోని మేం బతుకుతలేమా ఏంది? పోనియ్ సదువు కోని నౌకరి జేత్తవా అంటె అదిలేకపాయె. ఇక్కడుండక నువ్వేడికి పోతననుకుంటు న్నవు ఎందుకు? కడుపలోపలున్న సుఖం కాశికిపోయినా దొరుకదన్నరు."

"ఏం సుఖమోనే నాయిన నాకయితి క్కడేం మంచిగనిపిత్తలేదు. ఇక్కడ బతు కుడు నానుంచిగాదు. నేను భీవండికి పోత. నడిమెట్ల వెంకటయ్య పోలేదా? గడు దాసు మొండయ్య పోలేదా? నేం గూడ పోత."

రాజమల్లు ఊరొదిలి తనదిగాని దూరప్ర దేశానికి పోతా ననడం చిప్పమల్లయ్యకు నచ్చడంలేదు.

"అక్కడికి పోయేంజేత్తవు బిడ్డ? ఇక్కడ ససంత్రపు పనిడిసిపెట్టి పాలేరోలె పనిజేసుడు మంచిగనిపిత్తందా? కూలిపనిజేసుడన్నట్టేకద మరాపని."

"ఇక్కడ జేత్తున్నదేమొ బహదూర్ పనాయె నాయిన? గిది పాలేరు పనికంటే మన్నా తక్కోనా? పోనియ్ గీ పనితోని కడు పునిండ బతికే పరిస్థితులనన్నా ఉన్నాయా అంటె గదేంలేదుగద."

తండ్రి, అన్నల వాదోపవాదాలు వింటు న్నాడు శంకరయ్య.

"ఎంతయిన గిది మనపని ఇండ్ల ససంత్రముంది. అక్కడ ఒకనికింద పనిజే సుడేకద!"

"ససంత్రం ఉంది తియ్యిగిండ్ల ససంత్రం? కడుపునిండని ససంత్రమేం ససంత్రం? గౌరవం లేని ససంతరమేల? ఏం జేసినా మని మనం దొరతోని గన్నిమాటలు పడ్డట్టు?"

"అది సరె బిడ్డా! అక్కడేం సుఖం పాడ యింది? అక్కడ ఘోరమతు సాంచాలమీద పనిజేత్తె కండ్లు దెబ్బతింటయి.. నాలుగైదు సాంచాలను చూసుడు, పోగులతుకుడు ఘోరంగుంటదంటరు. "ఆ దుమ్ముతోని చేద గ్గులేత్తదట. నడిమెట్ల వెంకటయ్య ఎట్ల యిండు? పురాగెండుక పోలేదా?"

"నాయినా! నువ్వెన్నయిన సెప్పు? ఇక్కడ గీ అవమానాలు పొందుకుంట చాలీచాలని బతుకు బతుక్కుంట నేనుండ. అక్కడికి పోయి పైసలు సంపాయించుకత్త. తమ్ముడు కాలేజి సదువుతుండుగద! ఇంకా సదివిత్తాం. మరి గందుకోసం పైసలు గావద్దా?"

"తమ్ముని చదువుకు నువ్వు పెట్టకుంటె మానాయె. ఇన్ని రోజులెల్లింది ఇప్పుడె ల్లదా? నువ్వేమొ బతుకుటానికి మరాట దేశం పోతనంటవు. వీరయ్యేమొ ఆదిలా బాదు దిక్కు పోతనంటుండు. తమ్మునికి నౌకరయితె ఎటో పోతడు. ఇగ మాకెవ్వలు దిక్కు."

కొడుకు ప్రయత్నాన్ని మానిపించాలని అన్నాడు మల్లయ్య.

"గాభయం నీకెందుకే నాయిన? నేనెటు

పోతన్న చెప్పు. బతుకటానికి పోతనం టన్న... బతుకపోతె రానా నేను? అటేపో తనా ఏంది? తమ్ముని సదువయిపోయి నౌకరయితె గప్పుడు సూత్తాం. నేనటే ఏంపోను. ఇన్నన్ని పైసలు సంపాయించుక చ్చుటానికే పోతనంటున్న"

"ఏం సంపాయించుకచ్చుడో ఏమో! సరె తియి సూత్తాం"

"నువ్వెన్నన్న చెప్పు. నేనయితుండ. అవు మానాలు పడుకుంట బతుకుదెరువు లేకున్నా ఎందుకుండుడో నాకయితె అరుత మయితలేదు"

"ఎందుకుండుడంటె ఇది ఊరని. ఇది మన పనని. మనోల్లంత ఇక్కన్నే ఉన్నరని ఊళ్ళె, ఇంట్లుండకుంటె ఏడికి పోతవు? " గద్దరించినట్టన్నాడు మల్లయ్య.

మాట్లాడుకుంటూ ఇల్లు చేరుకున్నారు వాళ్ళు.

ఆ ఇంట్లో ఉన్న మగ్గం గుంటలో కూర్చొనే మల్లయ్య తన పదేళ్ళ వయసప్పటి నుండి మగ్గం నేస్తున్నాడు. ఆ వాకిట్లో కూచొనే లింగమ్మ పెళ్ళయినప్పటి నుండీ కండెలు వడుకుతుంది.

"చీరలూ నేయమని సంచకరిస్తే.

మా ఊరి సాలయినె నేచిండు సూడు.

నేసిండు చూడమ్మ నెలకొక్కపోగు"

అని లింగమ్మ భర్తతో పరాచికాలాడుతూ ఆ ఇంట్లోనే దశాబ్దాల తరబడి గడుపుతుంది. చిప్పమల్లయ్యా తండ్రికాలంలో నాటబడిన చింతచెట్టు వాకిలంతా పరుచుకొని వటవృ క్షంలా ఉంది.

వాకిట్లో కూర్చొనున్న లింగమ్మ తండ్రీ కొడుకులు రావడం చూసింది.

"ఏంది? దొరకు ధోతీ ఇచ్చివత్తమని అటే పోతిరేంది? " అంది.

"నీకు కనవడేది అటే పోవుడు. కాని అటు పోవుడంటె గదెంత భాగోతమో నీకేం తెలుసు? దొరకు నేసిన ధోతులంటె మాటలా ఏంది? ఎంత జాగ్రత్తగ నేసినా, ఇంతంత పొడుగెక్కోనే పెట్టినా ఎన్నో వంకలు పెడుతరు. సంపుక తింటరు. దారం పోగులు దూరం దూరమున్నయనె. ఉతుకుతె గుంజుకత్తయనె నా మూరకొల తకు ఎనిమిది మూరలుంటె నాలుగ్గజాల కన్న చాన ఎక్కో ఉంటది. అయినా తక్కో ఉన్నయని వంకలు వెట్టి. పైసలియ్యమంటె నేమొ సాలెపీసునా గొడుదు అని తిట్టె... మీది మీదికచ్చె ఏందనుకుంటున్నవు దొర దగ్గెరికి పోయచ్చుడంటె? అటు పొయ్యచ్చె వారకు నెరివడితిమి. గిదోయ్ మన సాలోల్ల బతుకు" అన్నాడు మల్లయ్య.

"అవు గా సంగతులు నాకు తెలువయా ఏంది? గా గుడిమల్ల ఎంకటమ్మ దొరకు కలువవోయింది. ఆమె బాలెంతరాలుగద! పాలిచ్చేయాల్లదాటె. పాలు సేపులు రావట్టె ఇంట్ల పసిపొల్ల పాలకేడ్వవట్టె. నేను పాలి య్యపొయ్యత్తదొరా అనడిగిందట. పాలియ్య పొయ్యత్తవా? అయితె నీ పనిక్కడెవ్వలు చెయ్యాలె? అన్నాడట. ఎంకమ్మ మొత్తు కోంగ మొత్తుకోంగ సరె నన్నడట ఉరుకు. జెప్పనరా భూమీద ఉమిసిన గీ ఉమ్మి ఆర కముందు రావాలన్నడట. ఇగామె గతేం గావాలె? దవ్వ దవ్వ ఉరికి పాలిత్తాంటె పసిదెట్ల సీకాలె? తొందర పెడితె గా పొల్లకు కుతికెవడె గట్లుంటది దొరల సంగతి. గీ దొరల కాలమెప్పుడు పోతదో ఏమో? " అంది లింగమ్మ.

"మా పోతదిగని ఎప్పటికి కాలమొక్కతీ రుగేముండది? గా సంగతేమొకని అగో నీ పెద్దకొడుకేమంటున్నడో విను ఊళ్లుండ ఊళ్లుండనని నన్ను సంపుక తింటుండు."

"ఊళ్లుండకుంతేడికి పోతవు బిడ్డ? గవ్వేం మాటలు? నీ పెండ్లాంరాయేసురాలయింది. తల్లి గారింటి కాడున్నది. గా పోర్నిడిసి పెట్టి ఏడికి పోతవు? కాళ్లగోల్లు తీయ్యాలిగ!"

"ఇగ గీ కొంపల కాళ్లగోల్లు తీసుకోని సంసారం జేత్తపటు. నేను భీవండికి పొయ్యి పైసలు సంపాయించుకత్త. పక్కకో చిన్న అర్ర గట్టుకుంట. అటెనుక కాళ్లగోల్లు



ఇప్పుడయితె భీవండికి పోవుడేమరి" అన్నాడు రాజమల్లు.

"ఏంది బిడ్డ గట్లనవడ్తివి. గాదేశం పోతవా? ఇది మన వంశంలున్నదా? ఊరి డిసి, అందర్నిడిసిపెట్టి భీవండికి పొయ్యి ఏం బాముకుంటనను కుంటున్నవు? ఇది మన ఇలవర్సెగాదు. ఏడికి పోయేది లేదు" అంది లింగమ్మ.

"మన సాలోల్లకు వలసలు పోవుడు కొత్తేంగాదు లేవే అవ్వ మీ తాతల కాలం నుంచి గూడ వోతండ్రు పూనాల మేయర్ కోరుట్ల నుంచి పెయిన సాలయనేనట. గా జగిత్యాల, కోరుట్ల, మెట్‌పల్లి నుంచి ఇటు సిరిసిల్ల నుంచి మస్తుమంది వలసలు పోయిండ్రు పోతుండ్రు."

"పోతే పోనియ్ మనకెమద్దు గా పోవుడు."

"అన్న పోయెవారకు సూత్తాం తియ్యే అవ్వ గిప్పుడెందుకు?" అన్నాడు శంకరయ్య.

కుటుంబ పరిస్థితులను, సామాజిక పరిస్థితులనన్నీ అర్థం చేసుకుంటున్నాడు శంకరయ్య. విద్యాలయాల్లో నేర్పని ఎన్నో పాఠాలను అతడు సమాజం నుంచి నేర్చుకుంటున్నాడు. శ్రామికుల అనుభవాల్నుంచి అవగాహన చేసుకుంటున్నాడు.

ఊరి వెలుపల మంచినీళ్ల బావి. ఊరందరికీ తాగే నీళ్లవే. చేద బావుల్లోని నీళ్లు ఉప్పగా ఉండటంవల్ల అందరూ ఆ బావి నీళ్ళే వాడుతారు. వచ్చే పోయే జనాలతో అక్కడెప్పుడూ రద్దీగానే ఉంటుంది. ఇటీవలి కాలంలోనే ఆ ఊరుకి బస్సు. మంచి నీళ్ల బావికి కొద్ది దూరంలోనే బస్టాండు. మంచి నీళ్ల బావి దగ్గరి కొచ్చే జనాలు, బస్టాపు దగ్గరి కొచ్చే జనాలతో ఆ స్థలం మరింత రద్దీగా మారింది. బస్టాపు దగ్గరే రెండు గుడిసె హోటల్లున్నాయి. విశాలంగా పరుచుకొనున్న మామిడిచెట్టు నీడే బస్టాండు స్టలం.

ఉదయం పది గంటల సమయం. బిందెలు చేతుల్లో పట్టుకొని చాలా మంది మంచినీళ్ల బావి దగ్గరికి కెళ్తున్నారు. కొందరు నీళ్లు తోడుతున్నారు. బిందెలు నిండిన వాళ్లు వాటిని తలలమీద పెట్టుకొని ఊళ్లోకి నడుస్తున్నారు. తమ వాళ్లను బసెక్కించడానికి

వచ్చిన వాళ్లు చాలామంది మామిడిచెట్టు నీడకు కూర్చొనున్నారు. కొందరు హోటళ్లలో కూచొని మిర్చీలు తింటున్నారు. చాయిలు తాగుతున్నారు. బస్సు రాక కోసం ఎదిరి చూస్తూ మాటల్లోపడ్డారు.

"నీయవ్వ వాన రాకడ పానం పోకడ తెలువదనేటోల్లు ఇన్నొద్దులు. ఇప్పుడయితె బస్సెప్పుడస్తదో ఎప్పుడు పోతదో తెలుస్త లేదు." అన్నాడు మారల హజీరు.

"అదే వస్తది పటు. రాకుంటెటువోతది? ఓ నీయవ్వ రోజూ బస్సెక్కినట్టే చెయ్యవ ట్టివి. ఆమడల దూరం నడిచిపోలేదా ఏంది? గిప్పుడూరుకు బస్సువడ్డదని మురి సిపోవడ్తివేంది? అన్నాడు తీగల ఊశాలు.

"అవుమరి వేములవాడదాక నడిచేపో యినం. కొంరెల్లికి గూడ ఎడ్లబండిమీన పోయినం. గిప్పుడేమో కేకపెట్టన్నలేని ఊళ్ల ళ్లకు పోవుటానికి గూడ బస్సు కావాలనవ ట్టిరి. గా బస్సు కోసం ఎదురుచూసే యాల్ల ఆ ఊరుకు పోవచ్చు"

"మా సెప్పినవు తియ్యవోయ్ ముప్పిడి మల్రెడ్డి! గదెప్పటి మాటో! బస్సులు పడ్డంక నడిసెందుకు పోతరు చెప్పు? ఉన్న వసతిని వాడుకుంటారా? లేదా? అదంతే."

"ఇగో సుఖమత్తె మొకం గడుగ తీరదని ఓ సామెతున్నది, గట్లుంది మన సంగతి. మొన్నట్దాక మనం బసెక్కాలంటే ఏడెని మిది కిలోమీటర్లు నడిచిపోలేదా ఏంది? ఇయ్యాల్ల బస్సచ్చిందని బాగ మురువవడ్తిరి. అయినా ఎప్పటి కాలమప్పుడే పటు."

"ఆ మాట నువ్వే అంటివి. ఈ మాట నువ్వే అంటవేందోయ్ బొద్దుల తిరుపతి. భలేటోని వున్నవు"

"ఏం కాలమో ఏందో? నాకయితె ఏం మంచిగనిపిస్తలేదు. అరె పొలాలల్ల ఇష్టము న్నట్టు మందులెయ్యవట్టిరి. గా మందు కూల్లు తింటె అటెనుకేం గావలె? ఇంకో దిక్కేమో గీ బస్సులంటచ్చి మూటలు మోసే టోళ్లకు పని నాశినం గావట్టె. సామాన్ల కోసం బండి గొట్టుకుంట, మోసుకచ్చుకుంట ఎంతమంది బతకెటోల్లు? ఇప్పుడు గాల్లకు పని దొరుకుతదా? బండి గొట్టుకుంట బతికే పోశాలు ముఖం మీదనయితే రగతం లేదు. కరీంనగర్‌కు పోయి సామాన్లు బస్సులేసు కోని రావట్టిరి. మనూరికి రాలేదుగని సాంచెలముత్తనయట. గవ్వి సాలోల్ల మొగ్గాలకు ఎసరు దీసుకత్తయో ఏమో?

"నీతివాక్యాలు బాగనే సెప్పినవు గడ్డం మల్లయ్య! మరయితె మందులెయ్యకుంట పంటలు పండిత్తె గవ్వి గీ జనానికి సాల్తయా చెప్పు! ఏదో అయితందని ఎన్నామడయిన నడుసుకుంటనే పొమ్మంటావా? సమాజంల వస్తున్న మార్పులతోని మనం గూడ నడు వాలె. గట్లయితేనే పైకస్తరు?"

రకరకాల విషయాల గూర్చి మాట్లాడు కుంటున్నారు. కష్టసుఖాలు కలబోసుకుంటు న్నారు. చుట్టలంటుబెట్టుకుంటున్నారు. కొందరు టీలు తాగుతున్నారు.

చెట్టు మొదలు నానుకొనున్న బండమీద కూర్చున్నాడు చిప్పమల్లయ్య. అతని చుట్టూ చాలా మందే ఉన్నారు. కొంచెం దూరంలో లింగమ్మ కూర్చొనుంది. చిప్పమల్లయ్య ముఖంలో దుఃఖముంది. లింగమ్మ కడుపు నిండా బాధుంది. ఆతని ముగ్గురు కొడుకులు, కొంతమంది కులం వాళ్లు, ఇతర్లు దగ్గర దగ్గర కూర్చొని, కొంతమంది నిల్చొని మాట్లాడుకుం టున్నారు. వాళ్ల కులపెద్ద బొద్దుల రంగయ్య రాజమల్లు పక్కన కూర్చొనున్నాడు.

చిప్పమల్లయ్య, లింగమ్మ కదిలిస్తే చాలు వలవలా ఏడ్చేట్టున్నారు. "రాజమల్లూ! మీ అవ్వయ్యలను సూడొక్కసారి. వాళ్ల ముఖంల ఎంత ఏడ్పుందో సూడు. నీకిదేం బుద్ధి? అయిన వాళ్లను, కన్నవాళ్లను, పుట్టి పెరిగిన భూమినిడ్సిపెట్టి భీవండికి పోవుడెం

---

❖ సత్యం మరియు ధర్మ పరాయణత్వం కంటే ఏ మతం కూడా గొప్పది కాదు.

– డా. రాధాకృష్ణన్

దుకు చెప్పు? ఇక్కడ మేమంత బతుకుత లేమా? మీ నాయిన బతుకుత లేడా? దేశం గాని దేశం బోయి నువ్వు వేలు సంపాయిం చుకత్తవా? గా వెయిలు లేకుంటేంబాయె? భీవండికి పోయినా బాగ సంపాయించుకచ్చి నోల్లు మన కులంలెవ్వలున్నరో చెప్పు... అక్కడయినా చేతికి మూతికున్నట్టే ఉంటుం దిగద! అసలు నీకు గీ బుద్ధెందుకు పుట్టింది? ఆదిలాబాద్ దిక్కు పోయినా పదిహేను రోజులకోసారి ఇంటికచ్చెటోనివి గదా! అందర్నిడిసిపెట్టి గా మరాటదేశం పోతననవడ్తివి ఇదేంది బిడ్డ ?" రాజమ ల్లును ఓదారుస్తున్నట్టుగా అన్నాడు రంగయ్య.

యువకుడైన రాజమల్లుకు రంగయ్య మాటలు కోపాన్ని తెప్పించలేదు. అందు లోని ఆప్యాయతకాతడు చలించాడు. దగ్గరే ఉన్న తల్లిదండ్రులను చూస్తుంటే అతని కడుపు తరుక్కుపోతుంది. పరిస్థితులు మాత్రం అతన్ని ఊరొదిలి పొమ్మనే చెబుతు న్నాయి. అక్కడే ఉండి తండ్రిలా ఎదుగూ బొదుగూ లేని జీవితం గడపాలని లేదు రాజమల్లుకు. తన నిస్సహాయతకు తనను తానే నిందించుకొవడం తప్ప వేరే మార్గం కనబడటంలేదు.

"రంగయ్యమామా! నువ్వన్నది నిజమే కాదంటలేను. కాని, నన్నేం జెయ్యమంటవొ చెప్పు. గా మొగ్గం గుంటనే నమ్ముకొని బతికే కాలమేనా ఇది! ఇక్కడ ఈ పనితోని మేమంత బతుకుడు సాధ్యమా? కుటుంబం కోసం నాలుగు పైసలు సంపాయించుకత్తా మనే కదా! అన్నీ తెలిసిన నువ్వుగూడ ఇట్ల మాట్లాడుతెట్లు? " అన్నాడు రాజమల్లు.

"ఆఁ ఈనె భీవండికి పొయ్యి వెయ్యిలు సంపాయించుకత్తడు. ఇగ వాట్ని మేం ముల్లె గట్టుకుంటం. ఈయనట దేశం బోయి సంపా యించుకత్తడట మమ్ములనుద్దరిత్తడట." దుఃఖమొస్తున్నా కోపంగా అన్నాడు మల్లయ్య.

"నాయినా! నువ్వు నన్నర్థం చేసుకోవేం? ఇంత మంది నిడిసి పోవన్నని నాకెందుకుం టదే.? గా రణ చప్పుల్లల్ల, లొల్లిల, దుమ్మంత కడుపులకు నోట్లెకు పోతాంటె సాంచెల మీద పనిజెయ్యన్నేని ఎందుకుంటదే? నేను పోతనంతున్నది ఎందుకో కాదు నాలుగు పైసల కోసురమే."

"ఆఁపోతున్నవు పటు పైసల కోసురం ఎవ్వలు కావాలంటున్నారు. గా పైసలు? వాటి కోసం ఎవ్వలు పొమ్మంటున్నరు? "

"ఎవ్వలు పొమ్మంటలేరు? నేనే బల్సిపో తనంటున్న అందర్నిడిసిపెట్టి అక్కడ సుఖ పడ్దామని పోతనంటున్న సరెనా ఇగనైన మాట్లాడకుండుంటరా? " అన్నాడు రాజమల్లు కోపంగా అతని కళ్లవెంట నీళ్లు కారుతున్నాయి. కొడుకును చూస్తున్న లింగమ్మ, మల్లయ్యలకూ దుఃఖమాగడం లేదు. అతని కన్నీళ్లను చూసి ఏడ్వసాగారు.

"చిప్పమల్లన్నా! లింగమ్మా! ఎందుకే ఏడు స్తరు? ఆగుండ్రి. ఏందో అయినట్టు శోకాలు పెట్టవడ్తిరి. రాజమల్లు భీవండికి పోతున్న దెందుకు? ఇల్లును బాగుసేద్దామనేకదా! ఏడ్వ కండ్రి. ఒగలమీదొగులు నిష్ఠూరాలు మాట్లా డుకుంట అందరేడ్వబడ్తిరి. అరే. గింద్లేముం దని? మీరందరు చెప్పి చూసినా విన్లేదు రాజమల్లు? సాగనంపుటాని కచ్చి బస్టాండుల శోకాలు పెట్టవడ్తిరి. అయిన రాజమల్లేడికి పోతుండు? భీవండికే కద! గక్కడ మనోల్లెం తమంది లేరు? పైసలు సంపాయించు కచ్చు టానికి పాయెటోని కోసం ఏడ్చుడెందుకు? తూడ్చుడెందుకు. నవ్వుకుంట తుళ్లుకుంట మంచిగ సాగనంపాలె? " అన్నాడు మచ్చయ్య.

"అబ్బో ఏం జెప్పిండు సూడురా మచ్చయ్య. చెప్పుడు సులభమే కని చేసుడే కష్టం. ఎవ్వ లకైన తన దాకస్తెగాని తెలువదంటారు. నీ బిడ్డకు లగ్గంజేసి సాగినంపినవు గద. గద యితే శుభకార్యమే కదా! అప్పగింతలప్పుడు గొడగోడా ఎందుకేడ్సిండ్రు మీరు! ఎంద రూ కుంచినా ఊకుండక పోతిరి గద! గప్పుడెటు

పోయినయో గీ నీతులు!" మొండెరాజయ్య మాటలకు నోరు మూసుకున్నాడు మచ్చయ్య "అవు చెప్పటానికేముంది.? మస్తుచెప్పచ్చు మచ్చయ్య కేంది? పెద్దమనిషి. ఆయన కొడుకులంత బందవస్తగున్నరు. ఆదిలాబాదు దిక్కు పోయి సంపాయించుకత్తున్నరు. కడుపునిండినంక అన్ని మాట్లాడచ్చు. ఒక్క గొర్ల బేరం చేసుకుంట, బాకీలిచ్చుకుంట ఈనెగూడ సంపాయిస్తుండు. తీరి పారున్నల్లు గట్లనే మాట్లాడ్తరు"

నిష్ఠూర మాడాడు చిప్పమల్లయ్య

"చిప్పయినే నువ్వు నాకు బావవయితవు. నువ్వేది మాట్లాడినా సాగుతది. నేననేది లోకంలున్న తీరు గురించి ఎవ్వలకైన తన కొడుకు దేశంగాని దేశం బోతె దుఃఖమత్తది. కాని తప్పనప్పుడేం జేసుడో చెప్పు.! ఇక్కడ అందరికి బతకుదెరువు లేదనే రాజమల్లు పోతనంటున్నడుగద! అందరికి ఒక్క పనిలనే బతుకుదెరువెట్లుంటది చెప్పు.! ఒక్కింటికి నాలుగిండ్లాయె. ఈ విషయాలు సాగ్రోజుల నుంచి మీఇంట్ల వాటాలు నడువ వట్టె. వాడేమో చెప్పుతె వింటలేక పోయె. పోనియ్య లేవు మరి! ఊకె ముసముసెందుకు.? " అన్నాడు మచ్చయ్య.

"పోనియ్యకుంటె నేనాపుతన్ననా? ఆపుతె ఆగెటోల్లెవ్వలు? "

"నాయనా! గా కారెడ్డా లెందుకే. సరే నేంబోను. నాకు చెయ్యినిండ పనిజూపెట్టు మరి."

"ఇగో గా లొల్లెందుకు బస్సురానే వత్తంది... కాగల కార్యం గంధర్వులు తీర్చినట్టయితది కొంత సేపయితె..." అన్నాడు ఆనందయ్య.

"ఆ బస్సు జూలపల్లికి పోయి తిరిగి రావాలె. అక్కడ వాళ్లు టిఫిన్లు గిట్ట జేత్తరు. అది తిరిగచ్చెసరికి గంటయితది."

బస్సులోంచి చాలామందే దిగారు.

అందులోంచి కొందరు చిప్పమల్లయ్య దగ్గరికొచ్చి నిల్చున్నారు. "ఏంది, ఎందుకో గింత మంది కూచున్నరిక్కడ. ఏంది చిప్పమల్లయ్యా! నీ కుటుంబమంతిక్కన్నే ఉన్నరేంది? " అన్నాడు గొట్టం రామయ్య. అతడు ఊరి పంచాయతీ మెంబర్లలో ఒకడు.

"ఏంజెయ్యి మంటవు పటేలా? గీ సంగతి మీకు తెలువదా? ఎంత జెప్పినా వింటలేడు మా రాజమల్లు భీవండికి పోయి సంపాయించుక వస్తనంటున్నడు? ఏం సంపాయించుడో ఏమో!"

"పోనియ్యని ఊకుండక మల్ల అదే పాఠం చదువబడ్తివి." అన్నాడు రంగయ్య.

రాజమల్లు లేచి నిల్చున్నాడు.

"అదికాదు పటేలా? ఉన్నదే ఒక్క మగ్గం గుంట నాయిన దాంట్ల పనిచేస్తనే ఉన్నడా? పెద్ద తమ్ముడున్నాడా? చిన్నతమ్ముడు పనికి సాయంజేత్తడా? ఇగ నేను గూడ గదేపని చెయ్యన్నా? చేస్తె వెళ్లద్దా చెప్పు? అందరు ఆ పనిల బతుకుడు కాదనే నేను పోవన్నను కున్న. పోతెఇంకేమన్న పనిచేసుకుందామంటె నాకేమన్న సదువా? శాత్రమా? నాలుగో తరగతిల్నే బందుసేత్తి"

రాజమల్లు మాటల్లోనూ సబబే కనబడింది రామయ్య పటేలుకు. మాట్లాడబోయేంతలోనే చిప్పమల్లయ్యందుకున్నాడు.

"ఎట్ల ఒనరిచ్చి చెప్పతండో సూడు కొడుకు! తమ్ములున్నరట. నాయినున్నడట. శంకరయ్య కాలెజి చదువబట్టె. ఇంకొన్ని రోజులయితే వాడు నౌకరయి వెళ్లిపోతాడుగద! వీరయ్య ఆదిలాబాద్ బ్యారీలకు పోవుటానికే సిద్ధమాయె. ఇగున్నదెవలు? నేనొక్కన్నేనా? నా ఒక్కన్నుంచయి తదా మొగ్గం పనిజేసుడు? సరే మొగ్గం మీద ఎల్లదనే అనుకుందాం. ఛద్దర్లు, దుప్పట్లు, చీరలు అమ్ముకుంట బతికితె ఐపాయెగద. ఏమారాటమిది! దేశం గాని దేశం బోయి నా తలపుండ్లు కడుగుతవా? నేం జూడనా ఇగ" కోపంగా అన్నాడు మల్లయ్య!

"ఇగో! మొదలే ఖచ్చితంగా ఉండుంగ్రి. రాజమల్లు భార్య పొట్టతో నున్నట్టుంది.



వానికి పోరగాండ్లయితరు. ఊరిడిసిపో తుండు. వీరయ్యా ఆదిలాబాద్ దిక్కు పోయి సంపాయించుకుంటాడు. శంకరయ్యకు నౌకర యితే మంచిగనే ఐతాడు. మరింగ నష్టపో యేదెవ్వలు? అందుకోసం రాజమల్లు సంపా యించుకున్న పైసలు రాజమల్లుకే. అక్కన్నే ఉంచుకోనియ్యిండ్రి. అటెనుక కిరి కిరి అయి తది. ఇప్పుడేం ఆస్తులు లెవ్వు కాబట్టి ఏరువ డుడేందని కలిసుంటండ్రు. రేపు శంకర య్యకు నౌకరయితే వాని భార్య ఊకుం టదా? మొగోల్లకు కలిసుందామనున్నా ఆడో ళ్లట్లానుకోరు. అందుకోసం ఎవ్వల కన్యాయం గాకుండ చూసుకోండ్రి" అన్నాడు రామయ్యా పటేలు.

ఆ మాటలెంతో ఆలోచనాత్మకంగా ఉన్నాయి.

"రామయ్యా పటేలా! ఈమాట నేనెప్పుడో చెప్పిన. అన్న ఇంటికి పైసలు పంపియ్యవల సిన అవసరం లేదన్న" అన్నాడు శంకరయ్యా.

"మీరన్నది నిజం పటేలా? ఓ సామజచ్చి సంపాయించుకున్న పైసలు తనకు చెందుడే మంచిది. అన్న భీవండిలున్నన్ని రోజులు వదినె కైకిలి జేసుకుంట బతుకుతది." అన్నాడు వీరయ్యా.

"అదేదో ఇక్కడ జేసుకోరాదా అనే నేన నేది? "

"నన్నెందుకు వేరు చేసి చూస్తున్నారు. నేను నాకోసం పోతనంటలేను."

"మా కోసమైతె నువ్వు పోవద్దేమద్దు. సప్పుడు జేకుండు."

తండ్రే కొడుకుల తగాదా చూసి చిన్నగా రామయ్యా పటేలు.

"నీయవ్వ. తండ్రి తండ్రే కొడుకు కొడుకే. ఒకలను మించినోల్లు మరొకలు. ఎవ్వల పట్టువాళ్లదే. చిప్పమల్లయ్యా! నీ సంగతి జూత్తుంటే నాకో మోటు సామెత యాదికత్తుంది. ఏదో అంటరు సూడు పుక్కానికస్తె అయ్యా కొడుకులమున్న మన్నారట. ఖరీదన్నమోలె నేనేమొ ముస లోన్ని మావోడు పోరాడన్నడట నీ అసోం టోడు. గట్లుంది కథ తాతల కాలం నుంచి వస్తుందని గామొగ్గం మీదనే ఇంటోల్లంత బతుకాల్నంటె ఎట్ల బతుకుతరో సెప్పు? ఇప్పుడేమొ ముసలోన్నంటవుకని నువ్వు వట్టిగుండుమంటె ఉంటవా? ఎంతయిన గీ మొగ్గం నువ్వుండేటంతవరకే. అటెనుక మొగ్గం గుంటలు మూసుకపోతయి. గిది నేను వట్టిగంటలేను. నీ ఒక్కని గురించీ అంటలేను. మిల్లు బట్టలచ్చుడెపుడోమొదల యిందా? కొన్ని ఊళ్లళ్లకు సాంచెలెత్తు న్నయా? ఇగ మీనేత బట్టలెవలు కట్టుకుం టరో సెప్పు? పోనియ్.! రాజమల్లును బీవండికి పోనియ్. ఇంతంత సంపాయించు కోని వాడన్న బతుకుతడు. వాడెవ్వల మీద కోపంతోనో పోతనంటలేడు. నువ్వు, లింగమ్మ సంతోషంగా సాగునంపుతె గదే పదివేలు" అన్నాడు.

ఆమాటలతో కొంత నెమ్మదించాడు చిప్ప మల్లయ్య.

"మీరు గూడ గదే మాటంటున్నరా పటేల! అనకుంటేంజేత్తరుగని! అందరు న న్ననెటోల్లేనయిరి. గక్కడికి పోతె బాగ సుఖ మనుకుంటున్నరా ఏంది? సాంచెలమీద పనిచేసి గా గడుదాసు మొండయ్యా ఎట్ల ఎండుకచ్చిండో మీరు సూల్లేదా? ఇరవ యేండ్ల నుంచి పోవుకుంట ఏపాటి సంపా యించిండయినె? దుమ్ముధూళి నోట్లెకు పోయి దగ్గు దమ్ముతోని నడిమెట్ట మల్లయ్యా శరీరమంతా చీకిపోయింది. శరీరంమీద చటాకు మాంసం లేకుండయింది. దగ్గు దమ్ముతోని ఎండుకచ్చి ఎండుకచ్చి సచ్చి పాయె. చేదగ్గును తక్కువ చేయించుకుంటా నికి పైసలేడ పాడయితయి? గట్లెందరో బాధపడుతండ్రు. గివన్నీ జూసుకుంటగూడ గిదే మాటంటరు" అన్నాడు.

"అందరు గట్లనే అయితరని ఎందుకనుకో వాలె? దేశం బోయి సంపాయించుకోని మంచిగయినోల్లు ఎంతో మందున్నరు. గా

చాకలి కొంరయ్య అక్కడ ఇస్త్రీ దుకాణం బెట్టి. మంచిగ సంపాయించిండు. ఇక్కడికి తెల్లబట్టలతో నెట్లత్తడు? అడివి ప్రాంతమని ఆదిలాబాద్ జంగల్ దిక్కు పోవుడెందుకని పోలేదు కొంతమంది. అటుదిక్కు మొదాలు పోయినోల్లు బాగుపడ్డరా? లేదా? పోతువెంకటి, పోతురాజం మాలేషుగ సంపాయించిండ్రుగద! గోరంటలోల్లు, సామలోల్లుగూడ ఓ తీరుగ బతుకుతున్నరా? లేదా? ఇవన్నీ చూసుకుంట గూడ గట్లనే అంటెట్ల? కాలంతో మనం గూడ మారాలె!" అన్నాడు రామయ్య పటేలు.

"అది నిచ్చమే పటేల! ఆదిలాబాద్ దిక్కు పోతెనేమొ వారానికో, పదిగేను రోజులకో, నెలకో ఇంటికచ్చిరి పొల్లగండ్లను, తల్లిదండ్రులను చూసుకున్నట్టాయె మరి గా మరాటదేశం కొంచెం దూరంలున్నదా? గంత దూరం పొట్ట కోసం పోవన్నా అనే నేనేది! నీయవ్వ! ఉన్నకాడ గంజిమెతుకులు తిన్నాగది స్వర్గంతో సమానమే కద! మల్లగా మరాటదేశంలో మన బువ్వగాపాయె. మన ఆచారాలు గాపాయె. మన భాష గాపాయె. ఏమత్తదని పోవుడు? అటు పోయి కొందరు సంపాయించింది నిజమే కాని, చాలామంది పైన పటారం లోన లొటారం అన్నట్టే ఉన్నరు. వచ్చేటప్పుడు తెల్లబట్టలు, జబ్బలకు రేడియోలతోనత్తరా? పోయెటప్పుడు ఉన్నయన్ని అమ్ముకోని పోతరు. గంత దూరం బోయి ఏంజేసుడన్నదే నా బాధంత!"

"ఇయాల్ల రేపు దూరందేముంది మల్లయ్యా! గీ రైల్లు, బస్సులు పడ్డంక ఎంత దూరమైనా లెక్కకత్తలేదు. కరీంనగర్‌కయితే అటుపొయ్యి ఇటు వచ్చినట్టే కావట్టె. ఒక్కటి రొండు రోజుల్లో కొంరెల్లికి పోయత్తున్నం. పొట్ట తిప్పలకు తప్పుతదా చెప్పు. పని కష్టమంటె ఎల్లుతదా? తవ్వెడిచ్చినోడు తంగెల్లు పీకుమంటె పీకాలెమరి. గిది నీకు తెలువదా? "

'పనిదేం పాడయింది పటేలా? వంగలేనోనికి పనంటె భయంకాని కష్టపడెటోల్లకు పనో లెక్కనా? మాయి మొదట్నుంచి కష్టపు పుట్టుకలేనాయె కాని గా పనో పనిగాదు పటేల! పది పన్నెండు మిషన్లు కండ్లు నిలవెట్టుకోని సూడాలె. ఎక్కడ దారం తెగిందో, ఎక్కడ మడత పడ్డదో ఏమయిందోనని



## అదీ విషయం..

ఓ అమెరికన్ బృందం పంజాబ్ పర్యటనకు వచ్చింది. కారులో వారు వెళ్తుండగా అల్లంతదూరాన నడిరోడ్డుపై ఒకతను చెవి నేలకు తాకించి పడుకుని ఏదో వింటూ కన్పించాడు.

అమెరికన్ ఆశ్చర్యంతో కారుదిగి అతని దగ్గరకు వెళ్లారు.

'అవును.. బూడిద రంగు వ్యాన్! ఎనభైకిలోమీటర్ల వేగంతో వెళ్తోంది..ఇక్కడికి పాతిక కిలోమీటర్ల దూరంలో ఉండుంటుంది..' గొణుక్కుంటున్నాడతను.

'వాహ్! రోడ్డుపై చెవిపెట్టి శబ్దాలను బట్టి అంత దూరాన పోతున్న వాహనాలను చెప్పేస్తున్నారే.. అద్భుతం ! మీరీవిద్య ఎక్కడ నేర్చుకున్నారు సార్' అడిగింది అమెరికన్ బృందం.

'విద్యా.. పాడా? నేనా వ్యాన్‌లోనుంచే కింద పడిపోయా? ' విసుక్కున్నాడతను దుమ్ము దులుపుకుంటూ.

ఎంతో జాగ్రత్తగ సూడాలె. మెదడుమీద, కండ్లమీద, చేతులమీన, కాళ్ళమీన ఎంత భారం పడుతదనుకున్నరు? ఇక్కన్నేమొ చాతనయితే పనిజేత్తిమి లేకుంటె మలుసుక పంటిమి.... అక్కడట్ల సాగుతదా? మల్ల ఇక్కడ పొద్దంత పనిజేసి రాత్రి పరాకతుగ పంటిమి. అక్కడ మూడు బజిలీలాయె. రాత్రి బజిలీల కంటిమీద కునుకుండక పాయె. గంత కష్టపడుకుంట గక్కడికి పోయి చెయ్యకుంటేంది? మల్ల వాడిచ్చేది టికాణకు తిండికి రోగాలకు రొచ్చులకు పోంగ ఏం మిగుల్తది? కడుపు గట్టుకుంటె ఏమన్న మిగుల్తయేమొ? పోతే కన్నతల్లసొంటి ఊర్నిడిసి పోవుడెందుకు? "

"నాయినా! ఊరు ఊరంటవు. ఏమిచ్చిందే మనకూరు? అవమానాలే కాదె? ఊళ్ళె మన కేమన్న భూములా, జాగలా, మాడులా, మన్యాలా రెక్కల కష్టంతో బతికెటోల్లం మనం. మనకే ఊరయితేంది? ఏ పట్నమ యితేంది? ఎక్కడ బతుకుదెరువుంటే గదే మనూరు. అదే మన కన్నతల్లి" అన్నాడు రాజమల్లు సీరియస్‌గా.

"ఇక్కన్నుంచివోతె ఇంకేం నష్టాలున్న యోయ్ మల్లయ్యా" అన్నాడు రామయ్య. అతడేమంటాడో పటేలుకు తెలుసు. అతడ నుకున్నదే రకీమని అనేశాడు చిప్ప మల్లయ్య.

"ఇక్కడయితేనేమొ పనిజేసుకోని సాయంత్రం తాళ్ళళ్ళ కుంకితిమి. పరాకతుగ కమ్మటి కల్లు తాగొస్తిమి. బింకెడంత తాగుతె మంచిగ నిద్ర వట్టె. గక్కడ గివన్నీ సాగుతయా? "

ఆ మాటలకు పకపకా నవ్వారందరు.

"ఏందేమొ నవ్వవడ్తిరి. నా మాటల్ల తప్పేముంది? "

"తప్పున్నదంటలేం కని కల్లుదాగుతె అన్న యిపోయినట్టేనని చెప్పే తీరుజూత్తె మాకు నవ్వత్తంది. పారకతుగ కల్లుదాగుతె ఐ పోతదా? పొద్దు వంగుతున్నదంటె గోచులు సదురుకుంట తాళ్ళదిక్కురికితిరి. మీ దాంట్ల ఎవ్వలన్న కల్లు దాగనోల్లున్నరా. కల్లుదాగి కొట్లాడనోల్లున్నరా." అన్నాడు నవ్వుతూ రామయ్య పటేలు.

"గండ్లనే ఉంది పటేలా మజా! ఇదువరకు లగ్గాలల్ల కల్లుగుడాలతోని దావతులిచ్చె టోల్లు. మాంసం కూరతోని విందు జేసే టోల్లు... ఆకులల్ల కల్లు వంచుతాంటె తలు కాయ అడ్డంగ ఊపెదాక పోసేటోల్లు. గట్ల కల్లు దాగి బంతిల పలపక్షం చూపుతున్న రని కొట్లాడిరి. కుల తప్పనిరి. పంచాయి తీలు పెట్టుకునిరి. కొన్ని లగ్గాలల్లనయితె తాగి ఎటోల్లటురికిరి. పిల్లగానోల్లది సాగా లని, మర్యాదలు జరగలేదని కొట్లాడిరి. గందుకే కల్లు బందు జెయ్యాలంటంద్రు లగ్గాలల్ల కొందరు బందే సేసింద్రు." అన్నాడు బూర్ల వెంకటేశం.

"కల్లు పురాగ బందుజేసినా ఏంకాదుగని పభోజనాలల్ల బొక్కకూడా పెట్టకుంటె మాత్రం ఎవ్వలు బువ్వేతినరు"

"పప్పుచారు పెడితె భోజనాలెవ్వలు తింటరు? "

"దప్పడం జేసి పెడితే గదేమన్న తక్కోనా ఏంది."

"ఎంతయిన బొక్కకూర బొక్కకూరే."

ఆ మాటలతో అక్కడి వాతావరణం కొంత తేలికయింది.

"ఏ నయవ్వ పుజూల్ మాటలన్నెందుకు మాట్లాడ్తరు. ఓ దిక్కేమొ నా కొడుకు బీవం డికి పోతున్నడని నేను మొత్తుకుంటుంటె మీరేమో పరాచికాలాడవడ్తిరి. కాదు బిడ్డా? రాజమల్లూ పొట్టతో నున్న లచ్చవ్వనిడ్చిపెట్టి పోవుడెందుకు చెప్పు? " అన్నాడు మల్లయ్య.

చెట్టుకింద నిల్చున్న రాజమల్లు భార్య లచ్చవ్వ మామ మాటలకు సిగ్గుపడింది.

"ముసలోడా! సాగనంపుటానికచ్చి మల్ల

✤ ఒక ఘన కార్యం యొక్క పరిమళాలు మంచి పుష్పంలా నిశ్చయంగా వ్యాపిస్తాయి. – స్వామీ వివేకానంద

గవ్వేంమాటలురి! కడుపులున్న కొడుక్కోసం డబ్బు సంపాయించకత్తడు రాజమల్లు. ఓ ఇల్లు గట్టుకుంటడు. పెండ్లాం పిల్లలు పరా కతుగా ఆ ఇంట్లుంటరు. ఇప్పుడయితే పోనియ్. కొడుకు పుట్టినంకత్తడు. అక్కడో అడ్డజూసుకోని పెండ్లాన్ని తీసుకుపోతాడు. లేకుంటే ఇక్కన్నే ఉంటడు. ఎన్ని జెప్పినా ఎందుకు పోవుడు ఎందుకు పోవుడని అంటనే ఉంటవా? సప్పుడు జేకుండు" గద్ద రించినట్టన్నాడు రామయ్య పటేలు.

"ఆ అక్కడికిపోయి సంసారాలు సేత్తరు పటు గింతంత క్రమాల ఎంతమందని? గండ్ల భార్యా భర్తలుండుడు కష్టమే పరుద చాటుకు సంసారాలు జేసుడంటె రోత గుంటది."

"ఓ నీయవ్వ! బూర్ల వెంకటేశమేందో చెప్పవట్టె భీవండికి పోయినోల్లు సంసారాలు జేత్తలేరా? పిల్లలను కంటలేరా? ఏందో ఇచ్చంతురం చెయ్యవట్టిరి" అన్నాడు తిరుప తయ్య.

"అవుతియ్యి మనకిక్కడ మాత్తురం ఆరాంగ పెండ్లాం మొగలు సంసారం జేసు టానికి అర్రలున్నయా మనయన్ని ఇరు కుటం కొంపలేనాయె. రాజమల్లుకు గా సాయమానన్నుంది."

రాజం మాటలకు అందరూ నవ్వారు.

వాతావరణం మరింత తేలికయింది.

"అగగొ బస్సుత్తంది. బడిబోరు దగ్గరిదాక చ్చింది."

అందరూ లేచి నిల్చున్నారు.

చిప్పమల్లయ్య, లింగమ్మ ముఖాలు మరింత మౌనమయ్యాయి. దుఃఖంతో వాళ్ల గొంతులు పూడుకుపోయాయి.

రాజమల్లును దగ్గరకు తీసుకున్నారు. కౌగలించుకున్నారు. 'బిడ్డా! రాజ్జెంగాని రాజ్జెం దేశంగాని దేశం పోతున్నవు... ఎట్లుంటవో ఏమో! మంచిగుండు కొడుక! ఎవ్వలతోని కొట్లాట వెట్టుకోకు.. దంపులాట లెట్టుకోకు... నీ పనేందో నువ్వు జూసుకో ఎవ్వల జోలికి పోకు బిడ్డ' అంది లింగమ్మ కొడుకు శరీరం ప్రేమగా నిమురుతూ.

"అవ్వా! నాకు గక్కడ తీరిసత్తదానె! మల్లనేం పోయేది నాలుగు కొత్తలు సంపా యించుకునుటానిగ్గని తిరుగుటానికాయె! నా పనేందో నేనేందో కాని నీకు ఎవ్వల జోలెం దుకు? వార్తెందుకు?"

"అక్కడ గూండ గాల్లుంటరంటరు. కస్సూరాయె మనమాట గాపాయె. మన జాగ్గర్తల మనముండాలె?" అన్నాడు మల్లయ్య.

"గాల్లతోని మనకేం పనే. పనిజూసుకునే వారకే పానం కొలికిల కత్తది. ఇంట్లచ్చి పడు కుంటె ఇగంతే. మనూరోల్లు ఒక్కలిద్దరే ఉన్నా మన దిక్కోల్లు చాలామందే ఉన్నర క్కడ. పూనాలన్నైతే వశెంగాని మంది. మన చాకలి కొంరయ్య లాంక్రి వెట్టిండుగద. అయి నెదగ్గెర్నే గూండాగాల్లున్నరట. గవన్నీ మన కెందుకు సెప్పు. కోడల్ను మంచిగ సూసు కోంక్రి." అని లచ్చుమ్మ వైపు చూశాడు రాజ మల్లు

"దానికేంది నా బిడ్డల్లే చూసుకుంట" అంది లింగమ్మ.

లచ్చవ్వేం మాట్లాడలేదు.

"నీ ఇష్టముంటె కొన్నొద్దులు మీ తల్లిగా రింటికిపో.."

"పోత" అని తలూపింది లచ్చవ్వ. ఏం మాట్లాడటానికే మాటలు పెకిలిరావడం లేదు.

అందరి దగ్గరా వీడ్కోలు తీసుకున్నాడు రాజమల్లు..

బస్సు వచ్చి ఆగింది.

ఒకర్ని తోసుకుంటూ ఒకరు బస్సెక్కుతు న్నారు..

"ఆగనే ఆగరు గంతెగిర్త మెందుకో. ఉరుకులాటెక్కువ" అన్నారొకరు.

"పైలం బిడ్డా, పైలం. మంచి గుండు కొడుకా! పోయినంకో కారటు రాసిపడెయ్యి"

"మారాత్తనే అవ్వ నాయినా వీరయ్యా

శంకరీ! నేంబోతున్న." అని భార్య దిక్కు చూసి బస్సెక్కాడు రాజమల్లు.

లచ్చవ్వ కళ్లనిండా నీళ్ళు.

వీరయ్య, శంకరయ్య సామాన్లు బస్సులో పెట్టి దిగారు. కిటికీ దగ్గర నిల్చున్నాడు చిప్పమల్లయ్య

"కరీంనగరంల దిగి నిజామాబాద్ బసెక్కు బిడ్డ. అక్కడ భీవండికి పోయే బస్సు ఎక్కు. బొంబయికి పోయే రైలన్న ఎక్కు. సామాన్లు పైలం" అన్నాడు.

"ఎక్కుండ్రి ఎక్కుండ్రి టైమయిపోతంది. రైట్... రైట్... రైట్... ఎక్కుండ్రి." తొందర పెడుతున్నాడు కండక్టర్

కనుగుడ్ల నిండా నీళ్లతో చేయూపాడు రాజమల్లు. బస్సు కదిలింది. కొన్ని క్షణా ల్లోనే పరుగందుకుంది.

భోరు భోరున ఏడుస్తున్నాడు చిప్ప మల్లయ్య.

లింగమ్మ, లచ్చవ్వ ఒకర్ని పట్టుకొనొకరు దుఃఖిస్తున్నారు.

"మల్లయ్యా! ఊకో లింగమ్మా! ఏందే ఇది! నువ్వెందుకేడుస్తున్నావే లచ్చవ్వ. ఊకుం డుండ్రి. ఏందో మునిగిపోయినట్టు ఏడ్వవడ్తి రేంది? ఉద్యోగం పురుష లక్షణమన్నరు. అక్కడ బతుకు దెరువుందని పోతండు రాజ మల్లు. దానికోసమేడ్చుడెందుకు? " అని గద్ద రించి అందర్నీ ఓదార్చాడు రామయ్య పటేలు "పొండ్రి ఇంటికి పోదాం పొండ్రి" అన్నాడు.

వాళ్ళంతా కదిలారు.

"గిదేమన్న నౌకరా పటేల ఊరిడిసి పోవు టానికి.? ఎంత చెప్పినా వినక బస్సెక్కి పాయె. కుండల గలది కలో గంజో తినుం డక సంపాయించుకత్తనని పాయె ఎట్లుం టదో కొడుకేందో? "

"ఏం గాదు మల్లయ్యా! ఇదేమన్న మును పటి కాలమా? అందరు ఊళ్ళనే బతుక న్నంటెట్లు రాజమల్లు మంచిగ బతుకుతడు"

"మీ నోటి వాక్యాన మంచి సంపాయించు కొని బతుకనియ్యుండ్రి. కాని పటేలా! నాకు గిప్పుడు గా ఓదయ్యనే మాటలు యాదిక త్తున్నయి. రుణానుబంధ రూపేణ పశు పత్ని సుతాలయా అంటడు ఓదన్నెప్పుడూ ఎక్కడ పుడ్తరో? ఎక్కడ పెరుగుతరో? ఎక్కడ బతుకుతరో? ఎక్కడికి పోతరో? ఏందో ఇదంత"

"ఏమయింది మల్లయ్యా! గంత వేదాంతం మాట్లాడ్తున్నావు? "

"నీకు గట్లనే అనిపిస్తుంది రామయ్య పటేలా! చిప్ప మల్లయ్యకు ముగ్గురు కొడు కులా? ఓ కొడుకు భీవండి పోయిండా? ఇంకో కొడుకు ఆదిలాబాదిక్కు పోతుండా? చిన్నోడు నౌకరయి వెళ్లిపోతడా? ఇగ ఇంటుండేదెవ్వలు? వాళ్ళిద్దరే కదా!" అన్నాడు లసుమయ్య.

"గట్లనద్దు లసుమయ్యా పటేలా! ముగ్గురు కొడుకులు మూడు తీర్ల సంపాయి స్తరు. పైసలే పైసలు చిప్పమల్లయ్యకు" నవ్వుతూ అన్నాడు మచ్చయ్య.

"ఆ... పైసలే పైసలు వాళ్ళు సంపాయి చ్చిత్తె నేను చెవులల్ల పెట్టుకుంట"

"గట్లెందుకంటవు మల్లయ్యా! నవ్విన నాప చేనే పండుతుందని నువ్వే అంటవు గద. ఇయ్యాల మొగ్గం గుంటబతుకే రేపు కార్ల కూసునేది కావచ్చు "

"నాకు నౌకరయిదంటే మా అమ్మానా న్నలు పనిజెయ్యకుండ కూసుండవెట్టి సాతుత" అన్నాడు శంకరయ్య.

"సాదినా సాదకున్నా కడుపునిండే మాట న్నావు బిడ్డ" అన్నాడు మెండె రాజయ్య.

"నువ్వసరే... నీ పెండ్లాం వింటదా? గవ్వన్ని వట్టి మాటలే. ఎట్లయితట్లయితది పటు. మీరయితే మంచిగ బతుకుతయి పాయె" అంది లింగమ్మ.

"గట్లెందుకంటవే అవ్వ నేనెట్లు చేత్తనో చూడు"

"ఇసోంటి మాటలు మస్తుగ విన్నంరా శంకరయ్యా. గివ్వి ఎప్పటికి యాదికుంటె

గవ్వే పదివేలు" అన్నాడు రామయ్య పటేలు తన ఇల్లు రాగానే వెళ్ళిపోయాడు.

మాట్లాడుతూ ఇల్లు చేరుకుంది చిప్పమల్లయ్య కుటుంబం రాజమల్లు లేనిల్లు బోసిగా కనబడుతున్నది. తన తండ్రి తనకిచ్చిన మగ్గం గుంట తనతోటే పూడుకుపోతుందేమోనన్న భయం మల్లయ్యకు భరించ రానిదిగానే ఉంది.

వాకిట్లో మంచం వాల్చుకొని కూర్చున్నాడు మల్లయ్య. అతనిపక్కనే శంకరయ్య, వీరయ్య కూర్చున్నారు.

"వద్దంటె వినక పాయె. కొడుకు ఎక్కడున్నడో ఇప్పుడు. ఎప్పుడు జూత్తనో మల్ల" అని వంటింట్లోకి పోయింది లింగమ్మ. అత్తవెనుకే లచ్చువ్వ నడిచింది.



రాజమల్లుకు అదే ఆఖరి చూపయింది. అతడు భీవండికి వెళ్లిన ఆరు నెలల తర్వాత మతకలహాలు ప్రారంభమయ్యాయి. రైల్వే స్టేషన్‌కు పరుగెత్తుకొస్తున్న రాజమల్లు కత్తిపోట్లకు గురయ్యాడు. అక్కడే ప్రాణాలు వదిలాడు. తన కొడుకు శ్రీరాంను చూసుకోకుండానే ఆఖరి శ్వాస వదిలాడు. చినమల్లయ్య కుటుంబం శోకసముద్రంలో మునిగింది. చిన్న వయసులోనే భర్తను కోల్పోయిన లచ్చవ్వకు పునర్వివాహం చేస్తామన్నారామె తల్లి దండ్రులు. శ్రామిక కుటుంబాల్లో పునర్వివాహాలు మామూలే. కాని లచ్చువ్వ ఒప్పుకోలేదు. కొడుకుండగానే వితంతు వివాహం చేసుకోవడానికి అసలే సమ్మతించలేదు. ఆ పసివాడిలోనే తన భర్తను చూసుకుంటానంది... తల్లిగారింటికి పోవడానికి కూడా ఆమె సమ్మతించలేదు. పక్కనున్న ఖాళీస్థలంలో ఆమెకో గది కట్టించారు. అందులోనే ఉంటుందామె.

చిప్పమల్లయ్య హృదయం తీవ్రంగా గాయపడింది. లింగమ్మయితే మంచమే పట్టింది. కానీ కాలమే అన్ని గాయాలకు మందు. క్రమక్రమంగా వాళ్లు కోలుకున్నారు. శ్రీరాంలోనే రాజమల్లును చూసుకుంటూ గతాన్ని మరచిపోతున్నారు. వీరయ్య ఆదిలాబాద్ దిక్కు బేరానికెళ్తున్నాడు. శంకరయ్యకు దొరికిన టీచర్ ఉద్యోగం చిప్పమల్లయ్యకు కొంత ఉపశమనంగా ఉంది. అయినా అతడు మగ్గం గుంటను విడవడం లేదు. లింగమ్మ రాట్నాన్నీ వదలడం లేదు. పనిలేని సమయంలో మనుమడే వాళ్ళకు కాలక్షేపం. కొద్ది కాలంలోనే అతడు మామూలు మనిషయ్యాడు. శ్రీరాంను చూస్తుంటే రాజమల్లు జ్ఞాపకం వస్తున్నా పనుల హడావిడిలో బాధను మరచిపోతున్నాడు.

★ ★ ★

రాగం ఎత్తుకొని పాటపాడుతూ పనిచేస్తుంది లింగమ్మ.

"అయ్యోలింగమ్మా! వినాయక చవితి పండుగనాడు గా పాట - పాడవడితివేంది? ఇయ్యాల్లేం పాట పాడన్నో తెలువదా? ఎంకయ్యోఎంకయ్య ఏమూలతాతా! కంకా బండ్ల కాముని తాతా! అని పాడాలె కాని బతుకమ్మ పాట పాడుతున్నవేంది? బతుకమ్మ పండుగ ముందుంది. నువ్వు బతుకమ్మను ముందుగాల్నే రమ్మని పిలుత్తున్నవు. మనకు పెద్ద పండుగ ఇగో గీ వినాయకచవితే. ఇయ్యాల్ల మనం మన పనిముట్లన్ని కడుగాలె. వినాయకుని దగ్గర పెట్టాలె. దండం బెట్టాలె. వినాయక పూజ చెయ్యాలె. మన కులపోల్లం దరేమొ జోరుదారుగ వినాయక చవితి

పండుగ జేసుకుంటుంటె నువ్వేమొ బతుకమ్మ పాట పాడవద్దివే" నవ్వుతూ అన్నాడు చిప్పమల్లయ్య.

మగ్గం విప్పుతున్నాడు. ఆ పనిముట్లు తీసుకెళ్ళి బతుకమ్మ వాగులో కడుక్కొని రావడానికి సిద్ధం చేస్తున్నాడు. తమకు అన్నంబెట్టే పనిముట్లను శుభ్రం చేసి పూజించడం ఆ పండుగ ప్రత్యేకత.

"తాతా! నేనిప్పుత మొగ్గం" ఉరికొచ్చాడు రాజేశం. "నేనెందుకు విప్పద్దు" శ్రీరామ్ అన్నాడు.

"తాతా! నేం గూడత్త నీతోని" అన్నాడు సురేష్.

మనుమలంతా చుట్టూ గుమిగూడటం అతనికెంతో ఆనందంగా ఉంది.

"ఓ ఇగ ఆగుతనే లేడు ముసలయినె. ఏదో అట్ల పాటపాడుకుంటుంటె బతుకమ్మ పాట పాడుతవా అనవద్దివి. నాకు బతుకమ్మ పాటలే వస్తయిమరి! నువ్వు ఎంకయ్య పాటలు పాడుకుంట పూజ జేస్తవుగద! మనుమలు ఎంటపడ్తున్నరని మా సంబ్రపడ్తన్నవు. ఎంత సంబురపడ్డా దండుగే" అంది లింగమ్మ.

"ఇండ్ల దండుగేంది? దిగుడేముందే! ఎవ్వలకాల్లు బతుకుతె ఐపాయె మనమలు పెట్టెదాక మనముంటమా చెప్పు? అయినా ఒగలువెట్టేదేముంది. వాళ్ళ పేరుకచ్చి చిప్పోల్ల ఇంటిపేరు నిలబెడితె అంతే సాలు తియ్యిలేవోయ్" అన్నాడు మల్లయ్య.

"పెద్దోడు గట్లాయె...! మనమన్ని మంచిగ సదివిత్తనని పట్టువట్టింది లచ్చవ్వ. చిన్నోడు తన కొడుకులను సదివించుకుంటడు. ఆనికి నౌకరాయె. ఒక్క నడిపోనికే తిప్పలుంది. శంకరన్నొక్కడే నౌకరి జేత్తండు గని మిగుతోల్లు ఏపాటి పైకచ్చిరి. గట్లగట్లనే బతుకవట్టిరి. నువ్వేమొ మనమలున్నరు నాకేందని మురిసిపోవద్దివి. సరెగని మనకేమన్న శాపముందా? ముగ్గురు కొడుకులకు ఒక్క ఆడపిల్లన్న కాకపాయేంది? అంతా మొగకోళ్ళాగెలె నాయె."

"మనమేం జేత్తం ఆడోల్లుగాకుంటె. అంతా వాళ్ళ రాత ఏంజేసుటానికయినా మనమెవ్వలం సెప్పు? ఎట్ల గావన్నో గట్ల యితది. మన పని మనం జేసినం. రుణానుబంధమంటె ఇదే"

"వాళ్ళకే మనం రుణమున్నమంటావా? వాళ్ళు మనకేం రుణం లేరా? మనం జేసేది మనం జేసినం నిజమే. మరిగ వాళ్ళు జెయ్యద్దా? "

"ఎందుకు చెయ్యరు? ఎవ్వల పనివాళ్ళు చేస్తనే ఉన్నరు. కొడుకు లెదిగింద్రు మనం టుంగుటూయాలల ఊగుదామంటావా? ఫట్టిగుండుమన్నా ఊకుంటమా ఏంది? ఎవ్వలకాల్లు బతుకుతంద్రు. గంతేచాలనుకోవాలె."

"అనుకోకుంటె ఏ మనవడితి నేను. కొడుకులకు లగ్గాలయి పిల్లలయినా గా పట్టుచీర కోర్కె తీరకనేపాయె."

"లింగమ్మా! నీకు గింత తెలువదా సెప్పు. మనకు చీరలు నేసిచ్చుడే కాని పట్టుచీరలు కట్టే యోగం లేదు కల్లు గీసే గౌండ్లయనెకు కల్లు దాగుడెట్ల వద్దంటరో మనకూ గంతె. మనుమల లగ్గాల వరకు మనకవ్వే నడిసత్తయి పటు."

"ఓ ఇగ నడి సత్తయి పటు. ఇన్నొద్దులు నడిసచ్చినయా ఇగగిప్పుడు నడిసత్తయా-? మాట వరుసకంటిగని నేను గాసంగతి మర్సిపెయిన. కొన్నేండ్లాయెగా సంగతి మరిసిపోయి ఇప్పటి వరకు బతికింది మా సాలు. మనుమల లగ్గాలయెదాక బతుకుతనా నేను" అంది లింగమ్మ.

"అవ్వా! గవ్వేం మాటలే! నువ్వు మా దండిగ బతుకుతవే. మీ కాలపోల్లకు దొరికినకాడికన్ని సహజమైనయి. మందులు లేని

✤ ఇతరుల దారిలో నడిచే వ్యక్తి ఏవిధమైన అడుగుజాడలు వదలి వెళ్లలేడు.

– ఇంగర్ సాల్

పంటలు అన్ని తీర్లబలం గండ్లనే ఉంటది నీ అంత పని నా భార్యజేత్తదా నా భార్యంత పని రేపు నా కోడలు జెయ్యది. కుందెన వెట్టి వడ్లు దంచుమంటె, ఇసుర్రవు తుల గడ్క ఇసురుమంటె నీ కోడండ్ల నుంచ యితదా సెప్పు? నువ్వన్ని పనులన్ని అవ లీలగ జేసినవు" అన్నాడు వీరయ్య.

"తాతా! మేం మోస్తం ఇవ్వన్ని వాగుల దాక"

"పెద్దయి మీకు మోతురాదు ఒగలు షరి జేసే కుంచె, ఒగలు నాడె, ఒగలు చిన్న రాట్నం, ల్యాకబద్ధ గిట్ల తలోటి చిన్నయి పట్టుకోండ్రి. మొగ్గం నేనే ఎత్తుకత్త కింద పడేయద్దు"

"సరె తాతా అట్లనే చేస్తం"

"నాయనా! నీకెందుకే గింతారాటం? నువ్వు ఇంట్లనే ఉండు. ఈ కోతులను తీసు కపోయ్యి నేను స్నానం జేయించుకత్త. అట్లనే గీ అతారెలన్ని కడుక్కోని పట్టుకత్త. నువ్వొకో నేను పొయ్యత్త..." అన్నాడు వీరయ్య.

"వద్దు బిడ్డ నాకు సాతనైనన్ని రోజులు గిసోంటిపనులు నేనే సేత్త, దీంట్ల చేసేదే ముంది? మెల్లెమెల్లెగ వాగులదాక నడ్సుడే కద. పిల్లగాండ్లెట్లయిన నాతో నుంటరు. గీ ఎంకయ్య పండుగ మనకు మా దండి పండుగ. ముప్పయిమూడు కోట్ల దేవుళ్ళ కంటె ముందు గణేశుడన్నరు. గీ వినాయ కునితోనే కద మనకన్ని. గీ గణేశుడు, మన కులదైవం మార్కండేయుడు మనకు పెద్ద దేవుల్లు"

"నాయనా! చేసిన కాడికి చేసినవు. నువ్వు కష్టపడుకుంట మమ్ములను పెద్దోల్ల జేసి నవు. నువ్వు మొగ్గం నేసుకుంట మమ్ము లను సాదినవు. పెంచినవు. ఇగ సాల్తియ్యి కష్టపడ్డ కాడికి, ఉమ్మడి కుటుంబాలల్ల మస్తు ప్రేముంటది. కాని మీ కాలంలో నడి సినట్టే మా కాలంల నడువది"

వీరయ్య మాటలకు ముక్కు విరిచారు కోడండ్లు.

"ఉమ్మడి కుటుంబాలు మంచియే బిడ్డ! కాదంటలేను. ఇండ్ల ఒకరికోసమొకరు ఒకరి కొకరన్నట్టుగా ఉంటది. అందరు ఎవుసంజే సుకుంటనే బతికినప్పుడు గిది సాధ్యమైంది. అందరు ఇంటికోసమే పనిజేసుడు. తినుడు. పిల్లగండ్లను సాదుకునుడు. గిది మంచిపనే. కని ఎప్పటికి సాగుతదా? సంపాదనలు వేరయ్యేవరకు ఏది సాగది"

"ఎట్ల సాగుతది? ఇషపాతుకాలు పెరిగి నంక సాగయి. నేను సంపాయించిందెక్కో, ఇతర్లు సంపాయించేది తక్కో నా సొమ్ము తోని తమ్ములో అన్నలో ఎందుకు తినాలె అన్నప్పుడిగ ఏరువడక తప్పది. గీకాలంలనైతె లగ్గాలయిందంటెసాలు ఏర్లు వోసుకుంటండ్రు. అన్నరు మరి ముప్పయారు జుట్లు కలిసుంట యిగని మూడు శిఖలు కలువయని"

లింగమ్మ మాటలకు మూతిమూడు వంకర్లు తిప్పింది శారద. "ఎన్నొద్దులని కలి సుంటరు గీకాలంల? ఎందుకు కలిసుం టరు? ఇంటి పెద్దామె అందరికి వండి పెట్ట న్నంటె కష్టం గాదా? ఎవ్వల కుటుంబం వాళ్ళకైతె ఎవ్వల తిప్పలాల్లు పడుతరు" అంది.

"చెప్పితిగద బిడ్డలార! ఇది ఏరువడితెనే మేలు మొగడా మనము పొత్తుంటెనే పోరు మొగడా అనే కాలం. అందర్ని కలిసి పొత్తుల వండుకోండ్రంటె నడుత్తదా గిప్పుడు.? " అంది లింగమ్మ.

"అవదు! ఉమ్మడి కుటుంబంలో ఓ సమై క్యతనేది ఉన్నమాటనిజమేనే! అందరు హాయిగ కలిసుంటె మంచిదే. కాని సంపా దనలో, పనిలో తేడాలు వచ్చిన తర్వాత ఎంత కలుపుకుందామన్నా ఇది సాధ్యం కాదు... ఒకరి సొమ్మును ఇంకొకరు తింటు న్నామన్న భావన వెంటాడుతుంది. అట్లా ఒకరిపై ఒకరు తమదేదో పోతుందన్న భావంతో ఉన్నదానికంటె వేరువడుడే నయం నూటికి నూరుపాళ్ళు వ్యవసాయ

కుటుంబాలుగా ఉన్నప్పుడు ఎన్నేండ్లయినా వేరువడకున్నా నడిసింది. ఉద్యోగాలు, వ్యవసాయాలు, పారిశ్రామికీకరణ ఇవన్నీ మొదలైన తర్వాత అలా ఉండడం సాధ్యంకాదు. అందుకే ఈ గొడవంతా! చిన్న కుటుంబాల వ్యవస్థ వచ్చిన తర్వాత ఇది మరీ ఎక్కువయింది. సంతానం ఎంతున్నా ఎవరిపనులు వాళ్ళు చేసుకొని బతుకుతారన్న దున్నప్పుడు పెద్ద కుటుంబాలు నడిచాయి. చిన్న కుటుంబాలే చింతలు లేని కుటుంబాలన్న దాంతో పెద్దకుటుంబ వ్యవస్థ ఛిన్నాభిన్నమైనట్టే. నిజానికి వేరుపడటంలో కొంత స్వార్థమున్నట్టనిపించినా ఇదే మంచిదేమో ననిపిస్తుంది. ఎందుకంటే ఎవరి కుటుంబం వారిదనుకుంటే కష్టపడి సంపాదించుకుంటారు. తమ సంపాదన తమకేనన్న భావం మరింత కష్టపడేట్టు చేస్తుంది. తమ కోసం, తమ పిల్లల కోసం అనేభావం అలా చేయిస్తుంది. ఉమ్మడి కుటుంబంలో కొందరు స్వార్థపరులున్నట్టు ఇందులో ఉండే అవకాశం తక్కువ. అందరి బాధ్యత ఎవరి బాధ్యత కాదన్న భావం ఇందులో ఉండదు"

అన్నాడు ఊళ్ళో కెళ్ళి అప్పుడే ఇంటికొచ్చిన శంకరయ్య

"సదువుకున్నోనివి. సారు నౌకరీ సేత్తున్నోనివి. ఏవేవో వయిలన్ని సదువుతున్నోనివి. మాకు గవ్వన్ని తెలువయిరా శంకరన్న! కాని గిదంట్ల పెద్ద స్వార్థముందనిపిస్తుంది. ఏదో గందరగోళముందనిపిస్తుంది. ఉమ్మడి కుటుంబాలల్లనయితె పిల్లగాండ్లు మంచిగ బతికెటోల్లు. మీరంత గట్లనే బతికిండ్రు. గీ వేరుపడ్డ కుటుంబాలల్ల నాదినాకే అని కుంచించుకుపోవుడుంది. ఇగో. నేం జెప్తున్న వరకన్న మీ పిల్లగాండ్ల దగ్గెరుండయి గిది శిలాక్షరం."

తండ్రి మాటల్లో ఎంతో లోతున్నట్టు గమనించాడు శంకరయ్య. తనది అక్షర జ్ఞానమైతే తండ్రిది అనుభవజ్ఞానమని అర్థం చేసుకున్నాడు. "అవును నాన్నా! కాని నాకైతే ఈ కాలంలో వేరువడటమే మంచిదనిపిస్తుంది."

"ఏరువడకుంటె ఆడోల్లాకుంటరా మరి?"

"అదిగాదుబిడ్డా! నేను సచ్చిపోయెదాక నన్న ఏరువడకుండ ఉండుమంటె ఉండకపోతిరి. ఉమ్మడి కుటుంబాలు ఎంత మంచి గుంటయో గా కత్తెర్లోల్ల కుటుంబాన్ని సూత్తె అరుతమైతది. కత్తెర్ల రాజన్న ఉన్నప్పుడు ఆ కుటుంబ వైభవం ఎట్లుండె? నూర్లకొద్ది ఎకరాల భూమి అందరు కలిసుండేది. రాజన్నే యజమాని. గంభీరంగ అరుగు మీద కూచుండెటోడు. ఎవ్వలకు చెప్పే పని వాళ్ళకు చెప్పెటోడు. ముగ్గురు కొడుకుల కుటుంబాలు. చుట్టాలు, పక్కాలు, పాలేర్లు అదో వైభవం. అయినె చనిపోయినంక కొడుకులు ఏరువడ్డరా? భూములు పంచుకున్నరా? వాళ్ళకు పిల్లలయిండ్రా? మల్ల వాళ్ళు పంచుకుంటున్నరా? మెల్లమెల్లగ వాళ్ళ మామూలు రైతుల కిందికి వస్తుండ్రా లేదా? ఇంకొన్నేండ్లయితెట్లుంటరో సూడు..."

"అది నిజమే నాన్నా! కాని ఈకాలంలో వాళ్ళందరిని ఒక్క మాటమీద ఒక్క తాటి మీద ఉంచుడు సాధ్యమయ్యే పనేనా?"

"అయితె మానాయెపటు మీరు ఏరువడ్డా ఒక్క కాన్నే పక్కపక్కల కుంటున్నరు ఒక్కింట్ల ఉన్నట్టే సేత్తున్నరు. శంకరన్నా! నువ్వొక్కనివే నౌకరిగాని వయినవు. కొంచెం అన్నల కుటుంబాలకు గూడు సూడు. ఏరువడ్డా ఎవరికివారే యమునాతీరే అన్నట్టు ఉండకుండ ఉంటె మంచిది. ఒగల మేలొగలు సూసుకుంటె మంచిది. ఏరువడ్డా కలిసిమెలిసుండండ్రి."

తండ్రి మాటల్లో జీరను గమనించాడు శంకరయ్య "అట్లెందుకంటవే నాయిన ఎవ్వల సంపాదన వాళ్ళకే అయినా మేం బాగనే ఉంటం" అన్నాడు వీరయ్య.

"మీరు, మీ పిల్లలు పాండవులోలె ఉండాలన్నదే నా కోర్కె. కౌరవులోలె గాదు. నేనింకెంత కాలం బతుకుతబిడ్డ."



"మేం మంచిగనే ఉంటమని చెప్పుతున్న గాదె నాయిన! నీ ప్రేమ నిలవెడుతం సరేనా? "

"నాకేం పేరుందని నిలవెడుతరు బిడ్డా! నేనేమన్న తురూంఖాన్‌నా? ఏదో అట్ల రెక్కల కష్టంతోని బతికినోన్ని నువ్వు సదువుకున్నోనివి. ప్రపంచ జ్ఞానం నీకెక్కో తెలుసు. మీరు మంచిగ బతుకుతె అంతే చాలు. నా దేంది రేపో మాపో పోయెటోన్ని"

"మామా! మీరెందుకు గట్ల మాట్లాడ్తరు... ఇయ్యాల్ల పండుగ. గణేశుని పండుగనాడు గామాటలెందుకు? " అంది లచ్చవ్వ.

"పండుగయితేందే లచ్చవ్వ! నాకు సాతన యిందేదో నేను సేసిన అగొజూడు కోల్లాగె లెట్లెగురుతున్నరో...? మీరు మీ పిల్లగాండ్లకు సాతనయినకాడికి సెయ్యుండ్రి."

"తాతా? ముచ్చెట్లు మీద ముచ్చెట్లు పెట్టవడ్తివి. ఇగ పోదాంపా లేవు వాగుల దిక్కు. మేం వాగుల బొర్లుతం... నువ్వు ఇవ్వన్ని కడిగె వరకు మా తానాలయిపోతయి" అన్నాడు శ్రీరాం.

"అవు ఇగ పోవుడే" అని వాకిట్లో కొచ్చాడు చిప్పమల్లయ్య.

ఆతనితోపాటు మనుమలు, కొడుకులూ బయటకొచ్చారు.

"శనార్థే చిప్పమల్లన్న. శనార్థి ఇగొ మేమచ్చినం" నమస్కారం చేసి నిల్చున్నారు వీరేశం, వెంకటనర్సు. వాళ్ళు సాధనాసురులు పద్మశాలీలను అడుక్కొని బతికే జానపద కళాకారులు వాళ్ళ ఊళ్ళో ఉన్నన్ని రోజులూ వాళ్ల పోషణ భారం పద్మశాలీలదే. పద్మశాలీల్లో ఓ ఉపకులం వాళ్ళైన సాధనాసురులు ఊళ్ళోకొస్తే సాలీలకు పండుగలాగే ఉంటుంది.

వాళ్లకు ప్రతినమస్కారం చేశాడు మల్లయ్య, వీరయ్య, శంకరయ్యలకు కూడా నమస్కరించారు వాళ్ళు.

"సందట్లో సడేమియా అన్నట్టు గిప్పుడే మీరచ్చిండ్రా బిడ్డ! ఓ దిక్కు పండుగ లొల్లి. ఇగ గీ చవితి పండుగతోని ఓటెను కోటి పండుగలు మొదలైతయి. ఇగ మీరు గూడ త్తిరి." అన్నాడు చింతచెట్టు నీడకున్న

మంచంలో కూర్చుంటూ.

ఆతనికిరువైపులా వీరయ్య, శంకరయ్య కూర్చున్నారు.

"గట్లనవడితివేందే మల్లన్నా! మేమస్తె మీకు భారమా? పండుగనాడే ఆటలాడ్తనం టమే గదా!" అన్నాడు వెంకటనర్సు.

"కరువుల భాగోతమని."

"అడ్తివాళ్ళం మేం ఆటలాడుకుంట మిమ్ముల నడుక్కునెటోల్లం. ఆడిబిడ్డ లసోం టోల్లం. అందుకే ఆడబిడ్డ దీవన అడ్తివాళ్ల దీవన ఒక్కటన్నరు. మేం ఊళ్లెకస్తె కరువుల భాగోతమోలె అనిపిస్తున్నదానె మీకు? కొడుకులు, కోడండ్లు, పిల్లలతోని నిండుగున్న ఇల్లు" అన్నాడు వీరేశం.

"ఇగో కొండెక్కిచ్చి ఉబ్బిచ్చి దొబ్బిపోవుడు మీ కలువాటయింది. ఊరు కోమాట నేర్చుకుంటరు గద! చాలు గాల్లుంటరు." గలగలా నవ్వుతూ అన్నాడు చిప్పమల్లయ్య.

"నువ్వు గూడ గిట్లంటవానె చిప్పమల్లన్న! మెల్లెమెల్లెగ మా అసోంటోల్లకు ఆదరణ లేకుంటయి పోవట్టె. మీ తరమోల్లున్నంతవరకే గిప్పుడున్నదయినా. నీ కొడుకుల తరమోల్లు కొంచెం కొంచెం చూస్తరు. నీ మనుమలతరం వరకయితె మమ్ముల దేకిటోల్లే ఉండరు- ఇప్పటికే తోలుబొమ్మలాటలసోంటియి పోయినట్టే అయింది."

"అవును వెంకటనర్సూ! కాల ప్రవాహంలో కొత్తవి రావడం, పాతవి మూలకు పడటం జరుగుతూనే ఉంటుంది. అయినా మీలాంటి అద్భుత కళాకారులకు ఢోకా లేదు

"అవ్వన్ని వట్టి మాటలే శంకరయ్య సారూ! మీకు తెలువందేముంది? ఓటెనుకోటి అన్ని పోతున్నయి. నెలలతరబడి పాడినా ఒడవన్ని ఉయ్యాలపాటలు పాడేది గొల్ల భూమక్క గా ఉయ్యాల పాటలెవ్వలన్నా నేర్చుకున్నరా? ఇప్పుడు గా శారదాకాల్లు వస్తున్నరా? చిందు భాగోతులచ్చినా ఎవ్వలన్న కానుతున్నరా? కాటిపాపలోల్ల విద్యెం విద్య? తోలుబొమ్మలాడిచ్చెటోల్లు తక్కోవాళ్ళా? తోలు బొమ్మ లాడిచ్చే ఆరె సాంబయ్య మ్యాల్లం ఇచ్చుక పెయింద్రు. గాల్లు చేపలు వట్టుకోని అమ్ముకుంట బతుకుతంద్రు. మిత్తిరోల్లు కనవడ్తంద్రా గిప్పుడు. ఇంకొన్ని దినాలయితె మాగతి గంతే అయితదేమొ? "

వెంకటనర్సు మాటలతో చిప్పమల్లయ్య గుండె బరువెక్కింది.

"గా మాట నిజమేరా వెంకటనర్సు! కాని మన చేతిలేముంది చెప్పు? గా కాటిపాపలోల్ల విద్య మస్తు విద్య. నా కండ్లతోని జూసిన... నా ముంగట్నే ఇసుక మంత్రిచ్చి విసిరేసి పామును సృష్టించింద్రు వాళ్లు.'

"అదో కనికట్టు విద్యనే మల్లన్న! అండ్లేం లేదు. వాళ్లు బొనుగల నుంచి రూపాయి నోట్లు పుట్టిత్తరు. ఇంకేమోమో సేత్తరు. అవ్వన్ని పొట్ట తిప్పలకు జెర్రిపోతులాట సోంటి పనులే."

"రూపాయల నోట్లు సృష్టించిన తర్వాత అడుక్కును డెందుకుమరి? అవి కొద్దిసేపట్లోనే మాయమవుతాయంటారు గద!"

"శంకరయ్య సారూ! మీరంత సదువుకున్నోల్లు. అండ్లేముందో మీకు తెలువందా? విద్యగలవానికెందును వింత లేదన్నరు గద? అదంత కనికట్టే. మన కండ్లముందు జరుగుతున్నట్టే అనిపిత్తది. అగో ఇల్లు కూలిపోతంది. కూలిపోతంది అని మనతోనే అనిపించెటట్టు సేత్తరాల్లు. మనం అటు దిక్కు సూత్తాంటె ఇల్లు కూలిపోయినట్టే అనిపిత్తది మరి."

అవన్ని పొట్టతిప్పల విద్యలు.

"మరి మీ విద్యలు గూడ కనికట్టేనా? " అన్నాడు వీరయ్య.

"చెప్పితిగద! మాయిగూడ కనికట్టే అని"

"అది సరేగాని వీరేశం? బొంద దవ్వి అండ్లో మనిషిని పెడుతరు గద! గాలెట్లొడు

✤ సంఘంలో ఒక వ్యక్తి ధరించే ఉడుపులలో ఉత్తమమైనది మంచి చమత్కారం. – నథేనియల్ ఎమ్మాన్స్

తది మరి?

"గాలిలేంది మనిషి బతుకడని అందరికె రికే గద సారు! అండ్ల మహిమలు మంత్రాలేం లెవ్వు అదో విద్య గాలి లోపలికి పోయెటట్టు ఏర్పాట్లుంటయి. లేకుంటె ఊపి రాడక ఫట్‌మని సత్తడు గద!"

"అరే మేం సూడంగనే బొందల పండుకో వెడ్తిరి బొంద మీద తడుకల్లు వెట్టి మన్ను గప్పితిరి మనిషెట్ల బతుకుతడు?"

"అవ్వన్ని నిజమేనే మల్లన్నా! ఇగ మేం మొత్తం బహిరంగం జేత్తె మా బతుకుదెరువు పోదా? అండ్లేం లేదని తెలిత్తె సూడ బుద్ధయితదా సెప్పు? అందుకే గసోంటి యన్ని చెప్పొద్దుమరి. ఇందులో మాయలు మంత్రాలయితె ఏం లెవ్వు ఉన్నదల్ల హస్తలాఘవం, కనుకట్టు విద్యే"

"వీరేశం ఏది చెప్పినా ఖుల్లం ఖుల్ల చెప్పుతడు. ఏం దాసుకోడు మరి"

"కాకుంటేంది పెద్దమనిషి. కులం పేరు చెప్పుకొని వచ్చినోల్లం. ఇంత అడుక్కోని తినాలెగాని మోసం చెయ్యద్దు. తరతరాలుగ గీ విద్య నాధారం చేసుకొనే బతుకుతున్నం. బంగ్లాలు గట్టకున్నా బట్టపొట్టకయితె నడుత్తంది. మీ దయాభక్తి. ఎట్లుంటె గట్లయితది! బలుగమంత దగ్గెర పెట్టుకున్నవు. నువ్వూ లక్షలు సంపాయించలేదు కావచ్చు కాని ఓ తీరుగనయితె బతుకుతున్నవుగద! పేదరికం అనుభవించుడు మనకు కొత్తేం గాదు. ఎంత లేకున్నా ఉన్నా అడ్తివాళ్లను ఆదరించుడయితె మనందరికున్న మంచి గుణం. మాకు పెట్టింది వట్టిగ పోదు. ఒక్కటికి పదింతలయితది"

"ఓర్నీయవ్వ! భలేటోనివున్నవురా వెంకట్నార్సు.. మమ్ములను ఉబ్బిచ్చి గాలిగొట్టు. మీకిస్తె పెరుగుతదంటివి. ఏది చెప్పు పెరిగింది? ఎంత కాలం నుంచి మీకు దానాలు జేత్తున్నం! మాకున్నా లేకున్నా సేత్తున్నమా? లేదా? మరి మేం ఏపాటి పైకత్తిమి? పెద్దోడు గట్లాయె. నడిపోడు నాపనితోనే నడిపియ్యవట్టె"

"గట్లనుకుంటెట్లనే మల్లన్న! పెద్దకొడుక్కు గట్లయితదని ఎవ్వలనుకున్నరు? వలసలు పోవుడు మనోల్లకేమైన కొత్తా? కాని గట్లాయె... అయినా ఆయుషు మూడినంక ఎవ్వలాపుతారు? మీరే గట్లంటె మా బతుకులేందే? ఎప్పుడు తిరుక్కుంటనే బతుకుడాయె. ఓ ఊరు గాకుంటె ఇంకో ఊరు గొల్లోల్ల నడుక్కునే మందెచ్చోల్ల సంగతేంది? మాయి సంచార బతుకులే కాదె! మరి నువ్వేం పైకి రాలేదంటవా? శంకరన్న సర్కారు నౌకరిజెయ్యవట్టె, నీ మనుమలు సదువుకోవట్టి ఇగ మునుం పడ్డట్టేగద! అందరు పెద్దగైతరు"

"నే నోటి వాక్యంతోని అట్లనే కానియ్యి వెంకట్నార్సు! సదువుకు అంటు బాపతుండాలనుకో"

"నీ చిన్నకొడుకు ఇగో గీ శంకరన్న ఏక్ సిపాయి తేలిండు" వట్టిగ నౌకరి జేసుడే కాదు. మనోల్లకు సమాజానికేదైన సేత్తడు. అందుకే అన్నారు గద! కులములోన ఒకడు గుణవంతుడుండెనా? కులము వెలియు వాని గుణముచేత! వెలయు వనములోన మలయజంబున్నట్టు అన్నరు పెద్దలు."

"ఊరూరు తిరిగి పద్యాలు గూడ నేర్సినవా వీరేశం! అయితె మానాయెగని గా దొప్పబెండ్ల పల్లాకిమీద ఎట్ల నిల్చుంటరో చెప్పవా? మనిషి బరువును ఎట్ల మోత్తయి గా చొప్పబెండ్లు?" అన్నాడు వీరయ్య.

"అండ్లనే ఉంది మతులబు, విద్యంత! ఇదే మేం చేసే అద్భుతం"

"సరెగని ఎట్ల మోత్తరో చెప్పలేదు!"

"బరువు స్తంభన విద్య తోటి"

"అదేందో చెప్పలేదు"

"ఇసోంటి రహస్యాలన్ని చెప్పినంక ఇంకేముంది? చెప్పితిగద పొట్టతిప్పలకు బహుకృత వేషమని!"

"చిన్నబాపూ! ఓ చిన్నబాపూ! గోపాలం గోపాలం అన్న మోలె మందిల నుంచి వస్తడు సూడు గయినె వెంబడి మేమంత

ఉరికినం అయినె రానియ్యలేదు. వెళ్ళగొట్టిండు" అన్నాడు శ్రీరాం.

"చదువుకున్న పోరగాండ్లు గట్లురుకద్దు"

"అందరురుకుతె నేనురికినేందట? "

"మా చిన్నతనంలో కూడా ఇట్లనే జరిగింది. మనిషిని దాచిపెడుతరు గదమల్ల ఎక్కన్నుంచి వస్తడనుకున్నం? ఈ సంగతి తెలుసుకోవాలని ఆ మనిషి వెంటపడ్డాం. ఉరుకవట్టిండు. అయినా వదిలిపెట్టలేదు నావెంట ఎందుకు పడ్తారు? అన్నాడాయన. నువ్వే గోపాలంవు కదా! ఎలా తేలుతారో చూస్తాం అన్నాము. అయ్యా! మీరు చదువుకున్న పిల్లగాండ్లు. నా వెంట ఎందుకు పడుతారు? ఇందులో ఏం లేదు... అదంత అటు సూత్తరుగద. అందరి కన్నుగప్పి మందిల గలుత్తడు. గోపాలం అన్న మోలె ఇక్కడున్నానని వస్తడు. ఇందులో మోస మేంలేదు. పొట్టతిప్పలున్నయి అన్నడు. మేం ఊర్కున్నామిక" అన్నాడు శంకరయ్య.

"అవు మాది ఓ విద్య. ఇదో కళ. మంత్రాలు, తంత్రాలు అని మోసాలు చేసి సంపాయించుకుంటె అది తప్పుకని ఇట్ల జేత్తేముంది"

"కాదని ఎవ్వలన్నరు వెంకటనర్సూ కాని యీంగ్రడి.!

"నువ్వు మాట్లాడుతుండు. నేను పోయ్యత్త" అన్నాడు వీరయ్య.

"వద్దు బిడ్డ. నేనే పోయ్యత్త. ఇవ్వన్ని శుభ్రంగ కడుక్కొని తీసుకత్త. అటెనుక గణేశుని పూజకు పెడుదాం" కొడుకుతో అన్నాడు చిప్పమల్లయ్య లేచి నిల్చుంటూ, "వీరేశం. వెంకటేశయ్యా! కుంటెనగాని లెక్క మీరు గిప్పుడే వత్తిరి బిడ్డ! ఎవ్వలన్న గీపండుగ నాడు వస్తరా ? "

పండుగయితె మీకే మడ్డ మచ్చినం! మిమ్ములను కలిసి పోదామనచ్చినం. ఇయ్యాల్ల ఏ మాడం గద! బొద్దుల రంగయ్యను కలిసి ఇక్కడి కచ్చినం. పోతమే ఇగ." అన్నాడు వెంకటనర్సు.

"పోయి రాండ్రి. రేపు కులపోల్ల మందరం కలిసి మాట్లాడుకుంటం. అటెనుక ఆటలాడచ్చు"

"సరె. శనార్థి" అని వెళ్ళిపోయారు వాళ్ళు.

"తాతా! ఇగ పోదాం పా అబ్బబ్బ ఎంత సేపట్నుంచి మాట్లాడుతండ్రు. జెప్పన పోదాం పా ఈతగొట్టాలె. అక్కడ ఈత చెట్లకు పట్టగూల్లుంటయి. అవ్వీట్ని తెచ్చుకోవాలె"

"అందుకేగిర్త పడ్తున్నరా కోలాగెలు!" అని బొలబొలా నవ్వాడు చిప్పమల్లయ్య.

వీరేశం, మనుమలతో కలిసి పనిముట్లను పట్టుకొని, మగ్గాన్ని ఎత్తుకొని బతుకమ్మవాగుకు వెళ్ళాడు చిప్పమల్లయ్య.

అవన్నిటినీ నీళ్ళతో కడిగాడు.

మనుమలకు స్నానం చేయించాడు.

పరికరాలను మోసుకొని ఇంటికొచ్చాడు.

గణేశపూజకు పరికరాలు పెట్టుటానికి సిద్ధం అవుతున్నాడు. ఎంకయ్యా ఎంకయ్య వేముల తాతా అని పాడటానికి సిద్ధమవుతున్నాడు.

"తాతా! మనం రేపట్నుంచి సాధనాసురుల ఆటలు సూడచ్చు గద! మస్తుగుంటయి" అన్నాడు శ్రీరాం.

"అవు బిడ్డా. రేపు గాకుంటె ఎల్లుండి. వాళ్ళు గొప్ప కళాకారులు." అన్నాడు చిప్ప మల్లయ్య.

సాలీల వాడంతా సంబరంగా ఉంది. అందరూ ఉన్నదాంట్లో మంచి బట్ట లేసుకుంటున్నారు. సింగారించుకుంటున్నారు. ఆడవాళ్ళు మంచి మంచి చీరలు కట్టుకుంటున్నారు. మగవాళ్ళ సింగులు సర్దుకుంటున్నారు. పెద్దలు, చిన్నలు అందరూ హడావిడి పడుతున్నారు. చిప్పమల్లయ్య ఆనందానికయితే అంతే లేదు. హడావిడికి హద్దుల్లేవు. లింగమ్మను, ముగ్గురు కోడండ్లను, మనుమలను తయారుకమ్మని హెచ్చరిస్తున్నాడు.

"లచ్చువ్వా! తయారయినావా బిడ్డ!

కోల్లాగె తయారయిందా? " అన్నాడు పెద్ద కోడలు గది ముందు నిల్చుని.

"తాతా...! నేను తయారయిన. అమ్మ కూడ తయారైంది." అని తాత దగ్గరికి పరుగెత్తుకొచ్చాడు శ్రీరాం.

"వీరయ్యా! లక్ష్మి! తయారయింర్రా బిడ్డ! కానియ్యంర్రి. కానియ్యంర్రి." అన్నాడు రెండవ కొడుకు దగ్గరికెళ్ళి.

"నాయన తయారయిండు. అవ్వే కాలే దింక. అయితంది. తాతా! మేం గూడస్తం చెట్ల తీర్థాలకు" అన్నాడు వీరయ్య కొడుకు రాజేశం.

"అందరం పోవుడే కద. మేంగూడ వస్త మంటున్నవేందన్నా" అన్నాడు లక్ష్మీరాజం

"అందరు పోవుడే తయారు కాంర్రి." అని మూడవ కొడుకు ఇంటిముందు కెళ్ళాడు.

"శంకరయ్యా! తయారయినావుర. శార దవ్వా... ఇంకా తయారుకాలేదానె. మను మలు రమేష్, సురేష్ అంగీ లాగేసుకు న్నార్ర."

"నాయనా! మేం తయారవుతున్నం. బొడ్డులోల్లను తొందరగ తయారుకమ్మను వాళ్ళకు జామెక్కువ" అన్నాడు శంకరయ్య.

"తాతా! మేం రడీ. నీదే ఆలస్యం" అని అతని చుట్టుమూగారు రమేష్, సురేష్.

"మీరందరు తయారుకాంర్రి. అందరి నెగేసుకత్త" అని లింగమ్మ దగ్గరికొచ్చాడు మల్లయ్య.

"అరరే ఇంకా తయారుకాలేదా నువ్వు పొద్దుబారెడెక్కింది. అన్నీ సర్దుకునేవారకే అంబటాల్ల దాటుటెట్ల? జెప్పన పోయి వంటలు జేసుకోవాలె. పొల్లగాండ్లు ఆకలి కాగుతరానే తొందరగ పోతెనే మంచిది"

తొందర పెడుతున్నాడు చిప్పమల్లయ్య

"అయ్యో! ఆగనన్నాగడే గూనిపోసి మొగడు అన్నట్టు సెయ్యవడ్తివేంది? లేడికి లేసిందే పరుగన్నట్టు చేస్తెట్లనే అన్ని సర్దుకో వద్దా? తయ్యారుగావద్దా? గిప్పుడే ఊరికి పొయ్యి అక్కడేం జేస్తం? అయినా అక్కడ చేసేదేముంది? ఇంతంత వండుకోని తిను డేగద" అంది లింగమ్మ.

"మంచి దానివే ఉన్నవు. వట్టిగ వండు కోని తినుటానికయితె గక్కడికి పోవుడెం దుకు? చెట్ల తీర్థాలు పోవుడంటె వండుక తినుడే అంటె ఐపోతదానోయ్"

"గంత కాకుంటేంది మరి? అక్కడేం జేత్తరు? "

"అయ్యో లింగమ్మ గట్లమాట్లాడవడ్తి వేంది? చెట్ల తీర్థం ఎప్పుడు పోలేదా! కులం బలం అన్నరు. అందరు కులపోల్లు కలుస్త రుగద! పదిమందిల చావయినా పెండ్లిలాం టిదన్నరు. అందరం కలుసుకొని కష్టసు ఖాలు మాట్లాడుకుంట తింటుంటె ఎంత సంబురంగుంటది? "

"వట్టిగ తినుటానికే అయితె గింత సంబు రమేముంటది? మీరంత తాగుతరు గదా"

"రోజు తాగుతలేమానోయ్? పొద్దు వంగిందంటె తాళ్లదిక్కు గోసులు సర్దుకుంట ఊరుకుడేనాయె"

"ఏ నీయవ్వ కల్లింట్ల పీనుగెల్ల. అండ్లేం పాడయిందని తాగుతరో మరి? గా కల్లు దాగి బాస మాట్లాడ్తరుగదింక. నీ ఏషం పాడుగాను" అంది లింగమ్మ.

"అయ్యో లింగమ్మా! బావండ్ల పిల్లలెక్కనే చెయ్యవడితివేంది? కల్లు దాగనట్టే చెప్పవడి తివేంది? "

"ఏందాగినా మీ తీరుగ రోజు తాగుత న్ననా? ఎప్పుడన్న ఇంటికిదెత్తె తాగితి. ఇగ మీ మొగోల్లకేమో అదే పనాయె. రోజు తాళ్లళ్లకు పోయి తాగితిరి"

"అవునోయ్! మరి మావున్నది గాసుఖమే కాదోయ్"

"తాగుడు సుఖమా? సరెగని బాగ ముచ్చ ట్లకెగవడ్తవేంది? ముసల్తనానికి దసల్ రైక న్నట్టుంది ఎవారం? "

బాగ ముచ్చట్లువెట్టేది ముసలితనానికే కాదోయ్. అయితె నేను ముసలోన్ని అయి పోయాన్నంటవా? "

"నువ్వు ముసలోనివి గాలేదు. పడుసు పిల్లగానివే. మనుమలే ఇంతెత్తు మనుషుల యిరి. ఇంకా పడుసోన్నే అనుకుంటు న్నవా? "

"ఐతే మానాయెగని తయారయితె గామరి!"

"ఓ చిప్పమల్లయ్యా! కేకవిని వాకిట్లోకొ చ్చాడు.

కాపు రాజిరెడ్డి వచ్చి నిల్చున్నాడు వాకిట్లో.

"ఏం మల్లయ్యా! పెండ్లి పిల్లగానోలె తయారయినావు ఏడికి పోతున్నవు? "

"ఎక్కడికి పోయేదేముంది పటేలా? ఇయ్యాల మా సాలోల్లంత చెట్ల తీర్థాలకు పోతున్నం గద అందరం తయారైనం"

"ఓహో అదా సంగతి అందుకే మీ వోళ్ళం దరు బురుక పిట్టలోలె ఉరుకుతండ్రు అయితె ఇయ్యాల్ల మీకు పండుగన్న మాట. మంచిగ కూర తింటరు, తాగుతరు."

"ఉన్నోల్లకు రోజు పండుగే గద పటేల మా అసోంటోల్లకు ఇసోంటియే పండుగలు గద!"

"ఆఁ మీకేంది మల్లయ్య వ్యాపారం జేసు కునెటోల్లు తెల్లబట్టలోల్లు"

"మేం తెల్లబట్టలోల్లమా పటేల! భలేటో లున్నరు. మరి మిమ్ములను తెల్లబట్టలేసు కోంగ ఎవ్వలు వద్దన్నరు? "

"మీ పనివేరు, మా పనివేరు. నువ్వు వద్దంటె ఊకుంటమా కాని మేం చేసే పనేంది? ఎవుసం గద! అంటె మట్టి పన న్నట్టే కద! ఎద్దుల్ని పొడుసుకునే పనోల్లకు తెల్లబట్టలేసుకుంటె నడుత్తదా చెప్పు? "

"గా మాట నిజమే కాని పటేల మీరు మట్టిపని చేస్తరన్నట్టేకాని మాది మాత్తు రమేం తక్కో పాడయింది? మోటు కష్టం కాదన్నట్టే కాని ఇండ్లే మన్నుందా? సాలోల్లు ఎవుసాలు చేసెటోల్ల కన్న తెల్లబ ట్టలేసుకునే వాళ్ళ తీరుగ కనవడుతురు నిజమే. కాని పైన పటారం, లోన లోటా రమే మాకన్న కిందికో మీదికో తిండికి ఢోకా లేకుంట నడుత్తదేమో కాని మాకయితె అది గూడలేదు గద!

"మీకు కొద్దోగొప్పో భూములుంటయి కాబట్టి ఊర్ను విడువద్దన్న మనస్తత్వముం టది? మాది కొంచెమంత వ్యాపార మన స్తత్వం గద! ఎక్కడ బతుకుదెరువుంటె అక్కడన్నట్టుంటది. గీతరపోల్లకైతె ఇంకా ఎక్కువయింది గీ మనస్తత్వం. మీరెమొ తెల్లబట్టలోల్లంటరు. మరి నా పెండ్లాం కొనుమన్న ఒక్క పట్టుచీర గూడ ఏండ్ల యినా కొన్లేదు. గిదీ మా తెల్లబట్టవేషం!" అన్నాడు చిప్పమల్లయ్య.

"మంచోనివే ఉన్నవు బట్టలు నేత్తవుగని నీ భార్యకు బట్టలు కొనియ్యనంటవు. అవు మరి... కాలమే గట్లుంది. చేసెటోనికి అన్ని దొరుకుడు కష్టమే"

"సరెగని ఎందుకో వత్తివి పటేల!"

"ఓ ధోతుల జోడ నెయ్యమని చెప్పిపోదా మని. నీ వారసత్వం వీరయ్య ఒక్కడే తీసు కున్నట్టున్నడు గద!"

"అవును పటేల! వాడు నేత బట్టలతో పాటు ఛద్దర్లు, నమారు నేసుకుంట బతుకు తండు. అదిలాబాద్దిక్కు పోవుడు బందు జేసిండు. అటు మునుపటి తీరుగ బ్యారాలు నడుత్తలెవ్వుగద!"

"సరే, వారం రోజుల్ల నేసియ్యి. ఇంటికచ్చి సంచకరి తెచ్చుకో. నేంబోతన్న మల్లయ్యా. పండ్లుసైలం మరి. బొక్కలు కొరుకవోయి పండ్లూడగొట్టు కునేవు."

"ముందటియ నాలుగు పండ్లూడిపెయిన యిగని దౌడపండ్లు మంచిగానే ఉన్నయి. దౌడపండ్లతోనే గద బొక్క నములుడు"

"దౌడ పండ్లతోని నమిలి మింగుతావు నిజమే! కాని బొక్కకున్న కండను గుంజ న్నంటె కావల్సింది ముందటి పండ్లే గద! గందుకే సైలమంటున్న."

"ఏంగాదు పటేల! ముదుసులు కంకిన పండ్లివి. పండ్లూసి పెయినా చిగుర్లతో నయిన చప్పరిచ్చి మింగుత."

"జోరు మీదనే ఉన్నవోయ్ మల్లయ్యా! అయితె మానాయెగని అక్కడ తాగుడు తిండి రొండుంటయి గద! బొక్కకూర పంచాయతులు పెట్టుకోకుంౖడి. ముక్కలు తక్కువ పడుతె పంచాయతులు పెట్టుకుం టరు గద మీరు."

"గిండ్ల పంచాయతీలేముండయి? ఎవ్వ లది వాళ్ళు వండుక తినుడేనాయె. పెండ్లి భోజనాలల్ల గసోంటి పంచాయతులైతయి. మరి బంతిల పలపక్షం చూపిస్తె పంచాయ తులు గాకుంటేమయితయి? బంతిల కూసుండి అందరు తింటున్నప్పుడు ఒగలకె క్కువ ఒగలకు తక్కువ ముక్కలు పెడితె మంచి గుంటదా చెప్పుంౖడి. గట్ల చేసి నోనికి పంచాయతి పెట్టి కులతప్పు పెడ్తరు. కులమన్నప్పుడు కొన్ని కట్టుబాట్లుంటయి గద! మా వోల్లకు పట్టింపులెక్కువ"

"ఆఁ మీదేంది గని కొట్లాడుతరు. కల్లుదా గిన మోలెపొత్తు గూడుతరు. అంతే కద. మంచిగ పోయి రంౖడి నేబోతన్న మరి" అని వెళ్ళిపోయాడు కాపు రాజిరెడ్డి.

అతడు వెళ్లగానే ఇంట్లోకెళ్ళిపోయాడు చిప్పమల్లయ్య.

"తొందగర కానియ్ లింగమ్మా. అందరు తయారైనట్టున్నరు." అన్నాడు.

"మా అయిపోతది గని నువ్వు లొల్లి పెట్టకు. గా కంచాలు చెంబు గివ్వన్ని గంప లవెట్టు." అంది లింగమ్మ.

"ఏంది లింగమ్మ నన్ను గీ పనులు చెయ్యమనవడ్తివి."

"చేత్తేమన్న పెద్దిరుకం పోతదా? ఇంటి పేరు కస్తూరోల్లే కని ఇంట్ల గబ్బిలాల వాస నన్నట్టే ఉండెమన పని."

"ఇగో ఎటు జూసుకుంటె గటే ఉందోయ్ సంగతి. మన మనుమడు చదువుల మస్తు హుషారు. వాడు పై కత్తడు. తంౖడి లేనం దుకు వాన్ని కష్టపడి చదివిత్తంది లచ్చువ్వ. మన శంకరయ్య నౌకరిగాడే నాయె. వాని పిల్లలు మంచిగానే చదువుకోవట్రి. ఎవ్వల కాల్లు ఎదో తీరుగ బతుకుతున్నరు గద. గదానితోని సంతోషపడాలె." అని ఇంట్లోంచి బయటకెళ్ళాడు చిప్పమల్లయ్య.

ఇంటింటికి తిరుగుతూ అందర్నీ తయా రుకమ్మని చెబుతున్నాడు.

"ఇంకా తయారు కాలేదా? కానియంౖడి"

"ఓ పిల్లా! మనుమరాలా! బాగ సదురవ డితివేంది? ఇంకెప్పుడు తయారైతవు? కానియ్, కానియ్."

"ఏయ్ మనుమడా! తెల్లందాక నిద్రపో లేదా? ఎంత నిద్రపోకున్నా ఇయ్యాల్ల పండుగాయె. నడువుంౖడి. నడువుంౖడి. నడువుంౖడి." అని పరాచికాలాడుతూ తయారు చేస్తున్నాడు.

"ఏందే బిడ్డా! ఇంకా తయారు కాలేదా? గిట్లయితెట్లనే తొందరగ కానియ్!"

"అల్లుడా! మంచోనివే ఉన్నవు. ఆడపి ల్లోలె తయారుగావడ్తివి. చీర గడ్తున్నవా ఏంది?"

మరో దిక్కు మచ్చయ్య, రంగయ్య అందర్నీ కదిలిస్తున్నారు.

"వదినే ఇంకా తయారు కాలేదా? గిట్ల యితె ఇగ బాగానే."

"మరుదలు పిల్లా! తమ్ముడు లేడా? తొందరగ కానియ్."

"తాతా! రడీ గున్నట్టున్నవు గద పోదాం పాంౖడిగ."

"బామ్మర్దీ కానియ్మంటె వినస్తలేదా?"

ఒక్కొక్కరిని వరుసపెట్టి పిలుస్తూ అంద రినీ తయారు చేయిస్తున్నాడు చిప్పమల్లయ్య.

అందర్నీ తయారు చేయించి ఇంటికొ చ్చాడు.

"అయిపోయినట్టుంది గద? ఇగ బైలెల్లు దామా?" అన్నాడు.

"ఎవ్విలెల్లకముందే మనమెల్లి ఏం సేత్తాం. శంకరయ్య పొద్దుగాల లేసి ఊరికి పోయాడు... అక్కడికే వత్తనన్నడు. మను మలను తీసుకొని నువ్వు నడువు. కోడం డ్లను తీసుకొని నేనత్త!" అంది లింగమ్మ.

"మనం పెద్ద మనుషులంగద ముందుం డాలె" అని చుట్టూ మూగిన మనుమలతో బజార్లో నిల్చున్నాడు చిప్పమల్లయ్య.

గంపల్లో వంట సామాన్లు, వంట దినుసులు వేసుకొని తలల మీద పెట్టుకున్నారు స్త్రీలు. పిల్లలు పెద్దలంతా కలిసి ఊరిబయటకు చెట్ల తీర్థాలకు బయలుదేరారు.

"బుక్కెడంత చల్లవడస్తమే." అన్నాడు సుంకనపల్లి సత్తయ్య.

"ఏం చల్లవడుతవురా! నీ కడుపు పాడుగాను! ప్రభోజనానికి పోవుకుంట కడుపు నిండ తిని పోయినట్టుంది. కడుపు గంత గనం కొట్టుక పోతందా? బాగ ఆకలయితేనే మంచిగ తినచ్చు తాగచ్చు పొల్లగండ్లకింత తినిపియ్యక పెయింగ్రు." అన్నాడు మచ్చయ్య.

అందరూ బయలుదేరారు. తలల మీద గంపలతో పిల్లాపాపలతో నడుస్తున్న వాళ్ళను చూస్తుంటే కన్నుల పండుగగా ఉంది.

ఒకరినొకరు పలుకరించుకుంటూ కష్టసుఖాలు కలబోసుకుంటూ నడుస్తున్నారు. వాళ్లంతా ఊరిబయటున్న మామిడితోటలోకి చేరుకున్నారు. చెట్లకింద గంపలు దించుకున్నారు.

బండలు తీసుకొచ్చి పొయ్యిలుగా పెట్టారు. పుల్లలేరుకొచ్చి వంట చెరకు సిద్ధం చేసుకున్నారు. మచ్చయ్య, రంగయ్య, చిప్పమల్లయ్య దగ్గర కూచొని యాటలు కోయిస్తున్నారు. ఆడవాళ్ళు అన్నం వండే ప్రయత్నంలో ఉన్నారు. చాకలి బాలమల్లు పోచమ్మ దిక్కు గొర్రెను చూసి మొక్కి కోశాడు. రక్తాన్ని తాంబాలంలో పట్టాడు. రాజలింగు మరో గొర్రెను కోశాడు. ఇద్దరు కలిసి గొర్రెల మాంసాన్ని కోస్తూ కుప్పలుగా వేస్తున్నారు. కొద్దిసేపట్లోనే కోయడం పూర్తయింది.

ఆ మాంసాన్ని ముప్పయి భాగాలు పోగులేస్తున్నారు. పొయ్యిమీద అన్నం ఉడుకుతోంది. పిల్లలు చెట్ల కింద ఆడుకుంటున్నారు. గౌండ్లు తెల్లకల్లు కుండలు తెచ్చి చెట్ల కింద పెడ్తున్నారు.

"కల్లు వచ్చింది అన్నం అయిపోయినట్టే. ఇగ మాంసం ఉడుకుతె అయిపోతది."

"ఓ పనాగుతదా చిప్పమల్లయ్యా! గొర్లను కోసుడయిపోయింది గద. ఎవ్వల పాలును వాళ్ళు కొంచవోంగ్రి."

"పొద్దు నడినెత్తిమీద కచ్చింది. పొల్లగాండ్లు ఆకలికేడ్తారు. తొందరగ కానిస్తె మంచిది."

"తీర్థాలకు వచ్చి జెప్పన బువ్వ గావన్నం టెట్ల? పొలగండ్లు మాతిన్నరు. మనం కొంచెం పొద్దుపోయి తింటెనే ఆకలయితది. మంచిగ తినబుద్ధయితది."

"ఆ మాట నిజమేనోయ్ సుంకనపెల్లి పోచయ్యా! కాని, ఇది వానాకాలం. పొద్దు పోతె వర్షమత్తది."

"మోటలకు పోయినోల్లు మొత్తుకుంటచ్చిరి అన్నారు గని వర్షమత్తె తీర్థాలకు పోయినొల్లు తిట్టుకుంటచ్చిరి అనే కాలమత్తది." వీరయ్య మాటలకు అందరూ నవ్వారు

ఎవరి వంతు వచ్చిన మాంసం వాళ్ళు తీసుకున్నారు. అన్నం దించి మాంసం పొయ్యి మీదేశారు. ముప్పయి పొయ్యిల మీద మాంసం తుకతుకా ఉడుకుతుంది. వాసన ఆ ప్రదేశమంతా వ్యాపించి ఉంది. అటు కల్లు వాసన, ఇటు మాంసం వాసనతో అక్కడి గాలి అదో వాసనేస్తుంది.

వాళ్లంతా సంబరంగా మాట్లాడుకుంటున్నారు. కల్లు తాగుతూ, మాంసం తింటూ చేసుకోబోయే విందు గురించి ఆనందపడుతున్నారు.

మామిడిచెట్టుకు ఒరిగి కూర్చున్నాడు చిప్పమల్లయ్య. అందరినీ గమనిస్తున్నాడు.

గత జీవితాన్ని మననం చేసుకుంటున్నాడు. తరతరాలుగా తాము నేత పనినే వృత్తిగా చేసుకొని బతుకుతున్నారు. గ్రామాల్లో తనలాంటి సాలీలు పేరునకు గురవుతున్నవాళ్లే. కులం పేరు మీద ఇత



ర్రత్రా అనేక అవమానాలను పొందినవారే. ఇటీవలి కాలంలో జరిగిన పరిణామాల వల్ల కొంత మార్పు వచ్చినా తమపై పీడన సాగుతూనే ఉంది. స్వాతంత్ర్యానంతరం తమ కులం వాళ్లు కొందరు బతుకుదెరువు కోసం పొట్టలు చేతుల్లో పట్టుకుని వివిధ ప్రాంతాలకు పోయారు. అందులో భాగం గానే భీవండికి పోయారు. అక్కడ తాము కష్టపడ్డారు. పీడనకు గురయ్యారు. తమ వాళ్ల శ్రమదోపిడీని పిండుకున్నారు. కొందరు ఆదిలాబాదు దిక్కు వ్యాపారానికి పోతున్నారు. గిరిజన ప్రాంతంలో బట్టల మ్ముకోవడానికి పోయారు. అక్కడ షావుకా ర్లయ్యారు. అమాయక గిరిజనులను దోచారు. ఈ గిరిజనుల కంటె తెలివికల వాడు కాబట్టి వాళ్లను దోచాడు. ఎంత విచిత్రం? ఇక్కడ పీడితులయిన వాళ్లే అక్కడ ఏదో మేరకు పీడకులయ్యారు. పది రూపాయల చీరను వంద రూపాయలక మ్మారు.

అంటే? ఎవరికి అవకాశం లభిస్తే వాళ్లు దోచుకుంటున్నట్టే కదా! అంటే దోపిడీ స్వభావం అందరిలో ఉందా? అయినా ఆదిలాబాదు దిక్కుపోయి సంపాదించిన వాళ్లు కొద్దిమందే. అక్కడికి అన్నలొచ్చిన తర్వాత గిరిజనులు కొంత తెలివికొచ్చారు, అక్కడ బేరాలు కొంత కష్టతరమయ్యాయి. దాంతో చాలా మంది అటుపోయి బతికే తమ వాళ్ల బతుకులు కష్టతరంగా మారాయి. చాలామంది అటుపోవడం మానుకున్నారు. ఏదిఏమయినా ఈ మధ్య తమ వాళ్లు కొంత నయంగానే బతుకుతు న్నారు. కొందరు సొంచాల నాశ్రయిం చారు. కాని, తనకది ఇష్టం లేదు. తన కొడుకూ ఇంకా మరమగ్గాల జోలికి పోలేదు.

కూరలుడికాయి చెట్లకింద గుంపులుగా కూర్చున్నారు. వాళ్లంతా కల్లు తాగుతూ మాంసం తింటూ ఆప్యాయంగా మాట్లాడు కుంటున్నారు.

"మనవాళ్లు నిజాంకు కూడా బట్టలు నేసి చ్చారు. దేవునికి బట్టలు నేసిచ్చారు. అగ్గిపె ట్టెలో పెట్టగలిగేంత నాణ్యమైన చీరలు

నేసిన ఘనత మనవాళ్లకుంది. మనవాళ్ల పనితనాన్ని చూసి నైజాం నవాబు కొంద రికి భూములు ఈనాంగా ఇచ్చాడు. అందుకే కొంతమందికి భూములున్నాయి. నేతపనే ప్రధాన వృత్తయినా వ్యవసాయాలు చేస్తూ బతికేవాళ్లు కొంతమందున్నారు. మనూల్లో, పెద్దపల్లిలో వేములవాళ్లకు చాలా భూములున్నాయి. అయినా మన వాళ్ల వృత్తి ప్రధానంగా వ్యాపారమే." అన్నాడు శంకరయ్య.

శంకరయ్య మాట తీరు వాళ్లకదో విధంగా అనిపించింది.

"ఎంతయినా బాగా చదువుకొని సారు నౌకరి చేస్తున్నవాడు శంకరన్న. గందుకే మన తీరుగా మాట్లాడడు. చదువుకున్నోని లెక్క మాట్లాడ్తుండు. నౌకరి జేసుడే కాక బాగ వయిలు సదువుతాడు. అయిన కన్నె రికే" అన్నాడు వెంకటేశం.

"మన శంకరన్న కథలు గూడ రాస్తు న్నడు గాదె." అన్నాడు నారాయణ.

"అవును ఎంతయిన శంకరయ్య తెలివిక లోడే"

"మనోల్ల గురించి గొప్పలు చెప్పుకునుడు బాగానే ఉంది. మెల్ల మెల్లగ మన వృత్తులే మూతపడే ప్రమాదమస్తంది"

"ఏంగాదు తియ్యి! మన వృత్తులేం పోవు. ఎందుకంటే బట్టల అవసరం లేందె వరికి?

"మొదట్లో విప్లవాలు నడిపింది కూడా సాలేలే కల్లూరి నారాయణ నడిపిన విప్లవం సాలీల విప్లవమే. సాలీలలో మేధావులు, బోధకులుగా మారినవాళ్లూ ఉన్నారు. రాజ య్యగారని మనూరుకు వచ్చేవాడు. అచలత త్వాన్ని బోధించే వారాయన. నా చిన్న తనంలో చూశా" అన్నాడు శంకరయ్య.

"నీకేంది శంకరయ్యా! సారు నౌకరి చేస్తు న్నావు. అచల తత్వమో ఇంకేం తత్వమో గాని మనకు కడుపు నిండే ఉపాయాలు కావాలె. మెల్ల మెల్లగ మగ్గం గుంటలు మూలకు పడ్తున్నయి. షరిగుంజలు పుచ్చు పడ్తున్నయి. ఇగ బతికేదెట్ల? "

"ఏంది తిరుపతి, ఏందో మునిగిపోయి నట్టు చేయవడ్తివి. మగ్గాలు వోతె సాచాల త్తయి. అవ్వీటితోని బతుకరాదా? ఇంకే టేదో పత్తయి అయ్యో మనూల్లెకు ఒకటో రొండో ట్రాక్టర్లు రాలేదా? గా సిరిసిల్ల ల్నాయితే సాంచాలు బాగా నడుస్తయి. కుండలు వోయి ప్లాస్టిక్ వచ్చినట్టు ఓటి పోయి ఓటి మా వత్తది. వృత్తిల మార్పులు వచ్చుడనేది మామూలేకద మరి!" అన్నాడు నారాయణ.

"ఓ నీయవ్వ పిల్లగాడు. జోరుగ మాట్లా డుతండు. గవ్వన్నున్ను మన వృత్తి ఒక్క టేనా? "

"అందరు వృత్తితోనే బతుకాల్నంటె బతు కుతారా మరి! మనోల్లు ఎంతమంది పాలే ర్లుంటలేరు. ఎంత మంది చదువుకొని ఉద్యోగాలు చేస్తలేరు? వేముల వాళ్లిండ్లల్ల ఉన్న ఇంటికొట్టు నౌకర్లే చెయ్యవట్టిరి. బొద్దులోల్లు గూడ మంచిగనే సదువుకోవ ట్టిరి. రంగయ్య కొడుకు మస్తు సదివిండు గద. ఇగ ఎట్ల బతికెటోల్లు అట్ల బతుకు తరు."

"గా మాట నిజమే నారాయణ! గా జగి త్యాల దిక్కయితె చాలా మంది మన కుల పోల్లు ఇంట్ల బీడీలు జేత్తరు. ఆడోల్లు ఇంటి పనులతో పాటు బీడీలు చేసుకుంట మొగో ల్లంత సంపాయించుతరు. అందుకే అక్కడి ఆడోల్ల ఆదాయం ఎక్కువంటరు."

"అవును... బీడీలు చేయడం వాళ్లకు కుటీర పరిశ్రమ అందుకే అటు దిక్కు మన కులంలో కట్నాలెక్కువ. అటు దిక్కు వ్యాపారాలను, చదువులను స్వంతం చేసు కొని మనవాళ్లు జీవితాలను గెలుచుకుంటు న్నారు." అన్నాడు శంకరయ్య

"కట్నాలతో పాటు కట్నాల చావులు గూడెక్కువే. మనోల్లు ప్రతిదానికీ లెక్క పెడ తారు గదా!"

"మల్లీశ్వరి సినిమా చూస్తే హాయనిపిస్తుంది. అందులో మనవృత్తి గురించి ఉంది. మన వృత్తి గురించి హిందీలో సినిమా కూడా తీశారు."

"చదువుకున్నోని నీకు అవన్నీ తెలుస్తాయి. మాకు గవ్వన్నేమెరుక శంకరయ్యా!"

"మనసుంటే మార్గముంటుంది. ఇదువరకు అన్ని కులాల మధ్యనే ఉన్న సహజీవన సంబంధం, బంధాలు, వరుసలు పెట్టుకొని పిలుచుకునేలాంటి వన్నీ నశించిపోతున్నట్లనిపిస్తోంది."

"శంకరన్న మాటలు కొన్ని లోతుగుంటయి. ఆ లోతు ఒక్కొక్కసారి మా అసోంటోల్లకయితె అరుతమే కాదు."

"ఇప్పుడు గూడ మనుపటి తీరుగ అయ్యబాంచెను, అవ్వబాంచెను అనుకుంట బతికితె మంచిదా? ఏంబోతుందో ఏముంటుందో కని నాకయితె గిది మంచిగనే అనిపిత్తంది. సుసంత్రం తర్వాత పుట్టినోల్లు అన్ని కులాల నుంచి సానమందే చదువుకుంటంద్రు. అక్షరజ్ఞానం వరకు సదువుతాంద్రు"

మునుపటికంటే తెలివి కత్తంద్రు. పోరగాండ్లు ఢీ అంటే ఢీ అంటుంద్రు. ఎవ్వలనైన ఎదిరిత్తంద్రు. ఇంతకు ముందు మన కులపోల్లు దొరల ముందు వంగి వంగి నమస్కారాలు చేసుకుంట పోయెటోల్లు. ఇప్పుడు-అంతగనం ఏం లేదు. ముఖ్యంగ పడుచోల్లయితె గింతంతయితె మర్ల వడుతంద్రు" అన్నాడు నారాయణ.

"మన దిక్కు వచ్చిన విప్లవోద్యమంలో మన కులం వాళ్ళున్నది చాలా తక్కువే. ఎందుకంటే మనవాళ్ళలో చాలా మంది వ్యాపారాల్లో, ఉద్యోగాల్లో, చదువుల్లో స్థిరపడుతున్నారు. వ్యవసాయ వృత్తుల్లో ఉన్న గొల్ల, గౌడ ఇతర కులాల వాళ్ళు చాలా మంది ఆ ఉద్యమాల్లో మునిగి తేలుతున్నారు"

"నిజమేనే శంకరన్న చాలా చక్కగ చెప్పినవు. మనవాళ్ళు మంచిగ చదువుకున్నోల్లున్నరు. సగంలో చదవుల ఆపిన వాళ్లున్నరు. అసోంటోల్లు సానమంది ఆర్.ఎమ్.పి.లు, పి.యమ్.పి.లుగ ఊళ్ళళ్ళ వైద్యం చేస్తున్నరు. ఊళ్ళళ్ళ సానమంది వైద్యులు మనోల్లే కొందరు ఆయుర్వేద మందులు గూడ ఇస్తున్నరు. ఒకప్పుడు మంగలోల్లు సర్జన్లయితె గిప్పుడేమొ సాలోల్లే ఊళ్ళళ్ళ డాకర్లన్నట్టు." అన్నాడు నారాయణ.

"నిజమే భలే పాయింటు దొరుకబట్టినవు నారాయణ గీ సంగతి ఎవ్వలకు తట్టలేదు అవు గీ వైద్యులు సానమంది మనోల్లే"

"కబీర్, గురునానక్ లాటివాళ్ళు మనవాళ్ళే "ఒకప్పుడు ఎంతో ఉన్నతంగా మనముండేవాళ్లమని తోస్తుంది. చేతి వృత్తులు కోల్పోయిన తర్వాత పరిస్థితి మారింది. రైలు మార్గాలొచ్చి సాలీల గుండెల మీదినుంచి పయనించాయన్న వాళ్ళున్నారు. సాంచాలు పట్టణాల్లో రాండాఫి ముందు, అంటే యంత్రాలతో బట్టలు నేయడం కంటె ముందు మనకు అత్యున్నత గౌరవముండేది"

"నువ్వు చదువుకున్నోనివే శంకరన్న బాగా పుస్తకాలు చదివెటోనివి. గా సంగతులన్నేమో కాని మునుపటికంటె గిప్పుడే మనకు మంచిగయిుందనిపిస్తుంది నాకు సాలె సంకుటం- లాంటి అవమానాలకంటె ఇది నయం కదా"

"ఏదేమైనా మన వాళ్లు జీవితాలను గెలుచుకుంటున్నారు. ఇంకా గెలుచుకోవాలి." అన్నాడు శంకరయ్య.

వాళ్ళనేక విషయాలు ఆనందంగా మాట్లాడుకుంటూ విందు చేసుకుంటున్నారు.

★ ★ ★

నులక మంచంలో పరుచున్న బొంత...

✤ జీవులను హింసించడమే జీవితం విలువ అయినప్పుడు ఆ రకమైన జీవితాన్ని కొనసాగించడానికి నిరాకరించాలి. – గాంధీ

ఆ బొంతపై షోలాపూర్ ఛద్దరు... ఆ మంచంలో పడుకొనుంది లింగమ్మ... జీవితం చరమాంకంలో ఉంది. ఆమె కళ్ల ముందెంతో జీవితం కదులుతున్నది.

తాను నేత పనివారి కుటుంబంలో పుట్టింది. నేత పనివారి కుటుంబంలో పెరిగింది. ఆ వృత్తిగలవారి కుటుంబంలోనే మెట్టింది. తన వాళ్లు వేల కొద్ది గజాల చీరలు నేశారు. వేలాది మందికి బట్టల అవసరాలను తీర్చారు. తాను తన తండ్రి, అన్నయ్య, భర్త, కొడుకు నేచిన వస్త్రాలనే ధరించింది. తన పట్టు చీర కోర్కెను మాత్రం తీర్చుకోలేక పోయింది. మూడు తరాలు గడిచినా తన కోర్కె తీరలేదు. నేత కుటుంబంలో పుట్టిన తనకు చిత్రాతి విచిత్రంగా పట్టుచీర కోర్కె తీరలేదు. ఇంతకూ తనకా చీర కోర్కె ఎలా కలిగింది? ఎప్పుడు కలిగింది?

వెల్లకిలా పడుకోనున్న లింగమ్మ కళ్ల ముందెన్నో దృశ్యాలు కదులుతున్నాయి.

అప్పుడు ఏడేళ్ల వయసులో ఉంది లింగమ్మ. తాను నేచిన ఒళ్లె కట్టిచ్చాడు అంకయ్య. ఆ ఒళ్లెలో ఎంతో ముద్దొస్తుంది లింగమ్మ. ఆడుకుంటూ దొరల ఇంటి దిక్కు వెళ్లింది. దొర కూతురు పట్టు ఒళ్లె కట్టుకొనుంది. తళతళా మెరిసిపోతోంది. ఆ చిన్నారి చీరను చూసింది లింగమ్మ. తనకలాంటి పట్టు చీరుంటే? ఎంత బాగుంటుంది?

తనలో తానే పదే పదే అనుకుంది. తననా చీరలో ఊహించుకుంది. ఆ చీరపై మోజు పెంచుకుంది. కన్నార్పకుండా ఆ చీరనే చూస్తూ చాలాసేపు నిల్చుంది..

ఇంటికొచ్చింది.

"ఏంది బిడ్డా! ఎట్లనో ఉన్నవేంది?" అడిగింది చంద్రమ్మ.

"నాకు పట్టు ఒళ్లె కావాలె"

కూతురు మాటలకు నోరు తెరిచింది చంద్రమ్మ. "ఇగో... ఇట్రా.. ఇట్రా." మగ్గం నేస్తున్న భర్తను పిలిచింది.

"ఏందేమొ జోరుగ పిలువవడ్తివి"

అని బయటకొచ్చాడు అంకయ్య.

"నీ బిడ్డేమంటుందో ఎరికేనా?"

"ఏమంటంది? చెప్పంది నాకెట్ల తెలుస్తది...?"

"పట్టు ఒళ్ళె కావన్నట."

"పట్టు చీర కోరినావా లింగవ్వ గీ కోర్కె నీకెట్ల కల్గింది?"

"దొర బిడ్డ కట్టుకున్నది చూసిన అది మంచిగుంది."

"దొర బిడ్డలు కట్టుకునేది మనకెట్ల దొరుకుద్ది బిడ్డ?"

"ఒక్కటే నాయినా? నేనెప్పుడన్న బలవంతం చేసిన్నా?"

"నీ పెండ్లి వరకు సూద్దాం తియ్యి" అన్నాడు అంకయ్య.

"భలే వాయిద పెట్టినవు. దాని పెండ్లెప్పుడు గావాలె" అంది చంద్రమ్మ.

"ఇంక రొండేండ్ల లోపల లగ్గం జెయ్యమా ఏంది?"

అంకయ్య అన్నట్టుగానే రెండేండ్లలోనే లింగమ్మ పెళ్ళి నిశ్చయమైంది.

"లింగవ్వా! నీకు పెండ్లే"

తండ్రి మాటలు విని నవ్వింది లింగమ్మ. పెళ్లంటే తెలియని వయసులో పెళ్ళి.. పెళ్ళంటే పల్లకిలో తిరగడం, బీంబాజల మోత, కొత్త చీరలు, బాసింగాలు, మాంసంతో తిండి అని మాత్రమే తెలుసు లింగమ్మకు.

"ఐతేంది? నాకు పెండ్లయితె మంచిదే గద!" అంది.

"పెండ్లంటె సిగ్గు పడాలె కాని గిట్లంటేమన్నట్టు?"

"ఏమో? నాకేమెరుక మరి గవ్వన్ని"

"సరెగని నీ పెండ్లికేం గావన్నో చెప్పు."

రెండేళ్ల క్రితం తండ్రి ఇచ్చిన మాట జ్ఞాపకం వచ్చింది.

"ఏం గావన్నొ నాకయితె తెలువది. దొర్సాని బిడ్డ కట్టుకున్న సోంటి పట్టు చీర

యితె ఒక్కటి కావాలె" అంది లింగమ్మ.

"ఏంది బిడ్డా? ఏమో అంటివి. పట్టుచీర గావన్నా? మల్లొక్కసారను. పట్టు చీరంటె ఏందనుకున్నవు. అయినా నువ్వింక ఒల్లెలే కడుతున్నవు గాదె."

"గదే పట్టు ఒల్లె కొనియ్యండ్రి. లగ్గమైతే ఒక్క పట్టు చీరన్న కొనియ్యరా? "

మంచిదానివే ఉన్నవు లగ్గమయితె పట్టు చీర కావన్నంటె ఎక్కన్నుంచత్తది? ఒక్క పట్టు చీరతోని పది పెండ్లి చీరలు కొనచ్చు."

"ఆనాడు కొనిత్తనంటివి గద పెండ్లికి!"

"గా మాట నువ్వింకా మరిచిపోలేదా? ఏదో అట్ల మాట వరుస కంటె అట్లనే యాది కుంచుకున్నవా? మనకు పట్టు చీరెందుకే? "

"ఎందుకంటె? మనం మనుషులం కాదూ మరి? "

"అది కాదే మనం మొగ్గం నేసుకుంట బతికెటోల్లం. మనకు పట్టు చీర లేన్నుంచ త్తయి? "

"ఊరందరికి చీరలు నేసిత్తరు- నాకేమొ ఒక్క పట్టు చీర కొనుమంటె కొనరు" ఆరిం దలా అంది లింగమ్మ.

"అదిగాదు బిడ్డా! నేను నేసేటియి పట్టు చీరలు కాదుగద! గంత ధర వెట్టి చీరలు కొనియ్యమంటె ఏన్నుంచత్తయి పైసలు? "

"ఎపో నీయవ్వా! మన చేతిలున్న పనేనని ఎప్పుడు గీ నేత చీరలే కట్టుమనవడ్తిరి. అదెపాయె పోనియ్యని ఊకుంటె లగ్గానికన్న ఒక్క పట్టు చీర కొంటలేక పోతిరి! నేనే మన్న ఊకూకె కొనుమంటున్ననా? గీ ఒక్క సారే కదా? గా అమృతవ్వ దొర్సాని బిడ్డ కట్టుకున్న పీతాంబురం ఒల్లె ఎంత ముద్దుగుంది? గసోంటిది ఒక్కటన్న కొనియ్యే అవ్వ" మొత్తుకుంటున్నట్టుగా అంది లింగమ్మ.

"అయ్యో నీయవ్వ! పెద్ద మనిషోలె మాట్లాడవడ్తివేందె లింగవ్వ. మీ నాయి న్నకు వెళ్లినంక కొనియ్యడా? మనం చీరలు నేసినంత మాత్రాన పట్టు చీరలు కట్టే శక్తి మనకుందా చెప్పు? నోసుక పుట్టినోళ్లకు పట్టు చీరలు దొరుకుతయిగని మనసోంటో ళ్లకు గాదెరికేనా? "

"అన్నిటికన్ని చెప్పుతరు. లగ్గం జేస్తరు గని ఒక్క పట్టు చీరన్న పెట్టరా? వాళ్ళ నన్న పెట్టుమన్లేరు మరి!" లింగమ్మ మాట లకు ముక్కు మీదేలేసుకున్నారు వాళ్లు.

"నువ్వు చిన్న పొల్లవు గాదె! నీకు గివ్వ న్నేమెరుక? "

"చిన్న పొల్లనయితె లగ్గమెందుకు జేత్తు న్నరు మరి? "

ఆ మాటలకు మరింత ఆశ్చర్యపోయారు వాళ్ళు.

"అయితె ఎవ్వలను కొనియించుమంటవు పట్టు చీరను. మీ అత్తగారోల్లనా? " అంది అప్పుడే వచ్చి అక్కడ కూర్చున్న భూదేవి.

సిగ్గు పడుతూ నవ్వింది లింగమ్మ.

"నీ మొగన్ని కొనియ్యమంటవా? " అంది భూదేవి.

"ఎపో నేను పట్టుచీరడిగితె గివ్వన్నం టరు."

"నువ్వేమో ఇంట్లకు పోతివి. నీ బిడ్డ పట్టు చీరె వాదమింక ఐపోలేదు."

అంది చంద్రమ్మ వాకిట్లో కొస్తున్న అంక య్యతో.

"లింగవ్వా! లగ్గంల పట్టుచీర గురించి మీ మామను మా అడిగిన. లగ్గంల ఒక్క పట్టు చీరన్న పెట్టలేవోయ్ అని. మా అన్న నా మాట విని పక్కడ పక్కడ నవ్విండు మీ మామ. నేను పరేషానయిన... ఏంది బావా గంతగనం నవ్వవడితివని అడిగిన. నవ్వకుంటె ఏం జెయ్యిమంటవోయ్‌నన్ను నువ్విత్తున్నవు ఇంత పొడుగు కట్నమని నన్ను పట్టుచీరె పెట్టుమంటున్నవా? ఏంద నుకుంటున్నవు పట్టుచీరంటె? ఏందోయ్! దొరననుకుంటున్నవా? రైతుననుకుంట న్నవా? మనకేన్నుంచత్తయి పట్టుచీరలు? ఒక్కటేంది? రొండు పట్టుచీరలు గొంట



కట్నం నేనడిగినంతియ్యి. అరసోల బియ్యంల బోడి పరాశికమన్నట్టు నువ్విచ్చిన కట్నానికి పట్టుచీర కొనుమంటున్నవా అని మల్ల పక్కడ పక్కడ నవ్వబట్టిండు. ఇగ గిప్పుడు పట్టుచీరంటె ఎట్లత్తదో చెప్పుబిడ్డ" అన్నాడు అంకయ్య.

తండ్రి మాటలకు ముఖం మరింత చిన్న బుచ్చుకుంది లింగమ్మ. బిడ్డను దగ్గరకు తీసుకున్నాడు అంకయ్య.

"గంత చిన్నవోతవెందుకు బిడ్డ! ఇప్పుడయితె పట్టుచీర కొనుడం నానుంచి గాదు. నీ కాళ్ళగోళ్ళప్పుడు మా కొంటతియ్యి. మీ మామనన్న కొనుమంట తియ్యి." అన్నాడు.

ఆ మాటల కందరూ నవ్వారు.

కాళ్ళగోళ్ళంటేందో లింగమ్మకు తెలియదు. అయినా "అప్పటికి ఏ రాజు ఏ పట్నమేలుతడో ఎవ్వలకెరుక! ఇప్పుడు లేంది గప్పుడెట్ల కొంటరు?"

పెద్దమనిషిలా మాట్లాడుతున్న కూతురు దిక్కు ఆశ్చర్యంగా చూస్తున్నాడు అంకయ్య. "ఏ రాజు ఏ పట్నమేలినా తండ్రినయితె నేనేగద! అప్పుడు నేనన్నగొంట. మీ మామ తోనన్న కొనిపిత్త తియ్యి... సరెనా! ఇగ ఇప్పుడయితె నువ్వు పట్టుచీర మాట మరి చిపో" అన్నాడు.

గొణుక్కుంటూనే మౌనంగా ఉంది లింగమ్మ.

చీరగూర్చి మాత్రం మరిచిపోలేదు.

పెళ్ళయిన ఏడేళ్ళకు పెద్దమనిషయింది లింగమ్మ. తర్వాత శోభనమన్నారు.

అప్పుడు తండ్రి నడిగింది చీర గురించి.

"నాయినా? పట్టుచీర సంగతేమయిందే?"

"అయ్యో బిడ్డ! ఇంకా మరిచిపోలేదా గా సంగతి. ఏదో సభ గతి మాటకు అట్లంటె దాన్నే మనసుల పెట్టుకోనున్నవా? నా నుంచయితదా బిడ్డ పట్టుచీర కొనుడు?" అన్నాడు అంకయ్య.

"అంటె? నాకు పట్టుచీర కొనియ్యవా నాయిన?"

"ఎల్లుమానయినంక ఎందుకు కొనియ్య బిడ్డ! బిడ్డా! నువ్వు గిప్పుడు ఆడపిల్లవు. అంటే అత్తగారింటి పిల్లవు నువ్వు సేవజేసేది ఇంటి కోసం పనిజేసేది చిపోల్లింట్లనే కద! ఇగ వాళ్ళే కొనియ్యాలె. ఓ దిక్కు పొట్ట గడుసుడే కష్టమైతున్నదంటె పట్టుచీరంటె ఏన్నుంచత్తది? మీ అత్తగారోల్లే కొంటరు తియ్యి."

తండ్రి మాటల్తోని లింగమ్మ ముఖం వాడిపోయింది. ఏం మాట్లాడాలో తోచడం లేదు.

ఇంతలో అంకయ్యే అన్నాడు మళ్ళీ "మీ మామనడుగుత తియ్యి కొనియ్యమని."

"పొల్ల ఎప్పటినుంచో అనవట్టె. ఓ చీర కొనియ్యలేవు." అంది లింగమ్మ తల్లి.

"ఏందో పిల్ల! బగ మాట్లాడవడ్తివి. నాకేమొ నా బిడ్డమీద ఏం ప్రేమ లేదు నీకేమొ బాగున్నదనుకుంటున్నవా? పట్టుచీరంటె ఏందనుకున్నవు? ఏన్నుంచి తెమ్మంటున్నవు? మనకు కట్టుకునే బట్టలు దొరుకుడే కష్టమంటె పట్టుచీరలట. ఎల్లుమానయినంక కొనియ్యనా ఏంది? నాకు నా బిడ్డ మీద ప్రేమ లేదనుకుంటన్నవా ఏంది?" అన్నాడు అంకయ్య.

"నేనేమన్ననని నామీదికి గుర్రుమనవడ్తివి. తండ్రివి నువ్వు కొనియ్యవు కాని వాళ్ళను కొనియ్యిమంటె కొనిత్తరా భలెటోనివే ఉన్నావు ఘరి?"

"వాళ్ళింటికోడలు. వాళ్ళ మనిషి. కొనిత్తె వాళ్లకే ఉంటుంది గద! గందుకే కొనుమంట."

కాగల కార్యము గంధర్వులు తీర్చారన్నట్టు వాళ్ళ మామ రానే వచ్చాడు. మాటల సందర్భంలో ఆ ప్రస్తావన తెచ్చాడు అంకయ్య.

"నీ కోడలుకు పట్టుచీర కావన్నట బావా! లగ్గమప్పుడు కొనుమంటె కొన్లేదు. గిప్పుడన్న కొంటవా? కొనవా?"

"ఇగో బావా! నీ సంగతెట్లున్నదంటె మా

ఇంటికత్తె నాకేం తెత్తవు? మీ ఇంటికత్తె నాకేం పెడ్తవు అన్నట్టుంది వివాదం కట్నాలు, కానుకలు, నీ బిడ్డ, అల్లుడు నువ్వు పెట్టుకుంటవా? నేను పెడుతనా? మంచో నివే ఉన్నవు." అని గలగలా నవ్వాడు.

"నీ మాటలు మంచిగున్నయి బావా! గమ్మతుగ మాట్లాడ్తవు నువ్వు నీ ఇంట్లుండె కోడలుకో పట్టుచీరె కొనుమంటె గిన్ని చెప్ప వడ్తివి. నీ కోడలు మీద ఏం బెట్టుకున్నా అవ్వి మీ ఇంట్లనే ఉంటయిగద. మాకె మన్న వత్తయా చెప్పు?"

"కొడుకు కోడలు నిజమేనోయ్? కని నాకు వెళ్ళద్దాచెప్పు నా బతుకెంత? నేనెంత? పట్టుచీరలు కట్టెటోల్లమా, కొనేటోల్లమా మనం? మన నుంచి గాదు అవ్వికొనుడు. నా కొడుకు అటెనుక మా కొంటడు తియ్యి. వాళ్ళకు పిల్లగండ్లమితె వాళ్ళకాల్లు కొనుక్కుం టరు. నడుమ మనకెందుకు?" అన్నాడు.

'భలెటోనివి బావ? ఎవ్వల చేతులు వాళ్ళ నెత్తిమీదనే పెట్టినవన్న మాట. వాళ్ళ సంపా దనతోని వాళ్ళనే కొనుక్కొమ్మంటవు గంతే కద!"

"గంతేననుకోలేవు" అని పకపకా నవ్వాడు.

లింగమ్మ పట్టుచీర కోర్కె ఆ సమయం లోనూ తీరలేదు. "బిడ్డా! నువ్వు మను సులేం. బెట్టుకోకు. నీకు కొడుకన్న బిడ్డన్న పుడుతరుగద! గప్పుడు అల్లుడు మా కొంటడు తియ్యి." అంది చంద్రమ్మ.

"మీరు గొన్నరని అయినె కొంటడు తియ్యి. మీరు కొన్నట్టే నేను కట్టుకున్నట్టె" అంది లింగమ్మ.

అయినా ఆమెకు ఆశ చావలేదు. అందరు మరిచిపోయినా ఆమె మరిచిపో లేదు.

లింగమ్మకు సంతానమూ కలిగింది.

పట్టుచీర విషయం జ్ఞాపకం చేసింది భర్తతో

"ఏందోయ్ గిప్పుడట పట్టుచీరలట. మనం బతుకుడే కష్టమంటె పట్టుచీర లేడి నుంచత్తయి? మనకు పిల్లగాండ్లయితం డ్రంటె ఖర్చులు పెరుగుతయి. గీ మొగ్గం తోని బతుక్కుంట పట్టుచీరలా? మనం తయారుజేసే బట్టలు మనం కట్టుకునుడే కష్టమంటె పట్టుచీరలు కొని కడుతమా?" అన్నాడు చిప్పమల్లయ్య.

ఆమె పట్టుచీర ఆశలపై అలా నీళ్ళు చల్లాడు. నలుగురు పిల్లలను కన్నా ఏ ఒక్కరి పురుడుకూ ఆమె ఆశ తీరలేదు.

పిల్లలెదుగుతున్నారు. అయినా తీరలేదు.

"పట్టుచీరని ఊకె అంటున్నవుగద! మన పిల్లగండ్ల లగ్గాలకు కొందాం తియ్యి. తల్లి చీరకిందికి" అన్నాడు భర్త.

"ఆc ఇగ కొంటవు తియ్యి. మింగమెతుకు లేకున్నా మీసాలకు సంపెంగనూనని మన మిద్దరమున్నప్పుడే కొన్లేదు. వాళ్ళ లగ్గాలకు కొంటవా? నువ్వు కొన్నట్టే నేను కట్టినట్టే."

"గట్లెందుకంటవోయ్. ఆఖరుకు తల్లి చీర కిందికన్న పట్టుచీర పెట్టుమందాం తియ్యి..."

"ఇగ గా గుంజిగాళ్ళను పట్టుచీర కొను మని అడుగుత పటు మనకే చెప్పేత్తె కుండ దాకుత లేదు. మన కాల్లేం బెడుతరు."

"వియ్యపురాండ్లు గాకుంటె మన కొడు కులు కొంటరు తియ్యి."

"గది వట్టిమాట అడ్డాలనాడు పిల్లలుగాని గడ్డాలనాడా అన్నరు. మనం కొనుక్కోలేదు గని వాళ్ళు కొంటరంటె ఏమన్నట్టు?" అంది లింగమ్మ.

"మన శంకరయ్య మంచిగ చదువుకుం టున్నడు గద! పెద్దోల్లిద్దరి నుంచి కాదు గని వాడు మా కొంటడు."

"ఇగో ఎంతమందిని చూల్లేదు మనం లగ్గ మయిందంటె పెండ్లాం బెల్లమయితది. తల్లి అల్లమయితది. అదువరకు సూత్తాం పటు."

లింగమ్మ పట్టుచీర కోర్కె భర్త తరంలో తీరేది కాదని తెలిపోయింది.

ఇద్దరు కొడుకులు వృత్తిలో స్థిరపడ్డారు. ఓసారి చీర ప్రస్తావన వచ్చింది.

"మా భార్యలకే పట్టుచీరలు కొనే స్థితి లేదంటె ఇగ నీకేన్నుంచి వత్తదే అవ్వ!" అన్నారు వాళ్ళు.

లింగమ్మ ముఖం మరింత చిన్నబో యింది.

ఇక ఆ విషయం మరిచిపోవాలనే అను కుంది. కాని బాల్యంలో ఆమెపై పడ్డ ముద్ర తొలగిపోవడంలేదు. చీరకోర్కె ఆమెను వెంటాడుతూనే ఉంది.

చిన్నకొడుకు శంకరయ్య ఉద్యోగం చేస్తు న్నాడు. చిన్నతనంలో ఎన్నోసార్లు మొదటి జీతంతో పట్టుచీర కొంటానన్నవాడు ఆ విషయమే మరిచిపోయాడు. కొత్తగా పెళ్ళైన మోజులో భార్య తప్ప తల్లి కనబడ టంలేదు. ఓ దసరాకు అందరికీ బట్టలు తెచ్చాడు శంకరయ్య.

అందులో ఓ పట్టుచీర ఉంది. అది తనకే ఇస్తాడనుకుంది కాని అలా జరుగ లేదు.

ఆ చీరను భార్య చేతిలో పెట్టాడు. నేత చీరను తల్లిచేతిలో పెట్టాడు. లింగమ్మ ముఖం వాడిపోయింది.

ఏం మాట్లాడకుండా చీరను నేలపై పెట్టింది.

"ఏందే అవ్వ చీరెట్లున్నదో చెప్పకపో తివి? " అడిగాడు శంకరయ్య.

"మాట్లాడటానికేముంది బిడ్డ? ఊరు పొమ్మంటుంది. కాడు రమ్మంటుంది" అంది లింగమ్మ.

"ఎందుకే అవ్వా! అట్ల మాట్లాడుతవు? "

"కాదురా శంకరన్న! నీ పెండ్లానికి చీరదె చ్చినవు మంచిదే. నౌకరి జేతున్న నీ భార్య పట్టుచీర కట్టుకోవాలె. నిజమే. అట్లనే మీ అవ్వకు గూడో చీర తెస్తేంబోయేది? ఎన్ని రోజులాయె మీ అవ్వ చెప్పవట్టి... నానుంచేమొ కాకపాయె. మీ అన్నల నుంచి గూడ కాదు. చదువుకున్న నువ్వన్న గీ చిన్న కోర్కె తీర్చకపోతివి" అన్నాడు చిప్ప మల్లయ్య.

శంకరయ్య ముఖం వివర్ణమైంది.

ఆ మాటలకు శారద మాత్రం గయ్‌మని లేచింది.

"ఏంది? నాకో పట్టుచీర తెచ్చినందుకు గింతగనం చెయ్యవడితిరి. మన మొకాలకు పట్టుచీర గావన్నా? గిన్నేండ్లు లేంది గీ ముసలితనానికి పట్టుచీర గడితెట్లుంటది? ముసల్తనానికి దసల్ రైకనరామరి? ఏ వయసుల ముచ్చట ఆ వయసుల తీరితె మంచిది గాని గిప్పుడు పట్టుచీరో చీరని అయినెను పట్టుక తింటేమన్నట్టు? నాకు తెచ్చినందుకు మీకు కండ్లోర్తలేవా? అయిం తొక్కడు నౌకరి జేత్తున్నడని గిట్ల మాట్లాడు తున్నరా? " అంది కోపంగా.

కోడలు మాటలు మరింత బాధించాయి లింగమ్మను.

ఇంకేం మాట్లాడినా స్పర్థలు పెరిగే అవ కాశముందని గ్రహించింది. అయినా తన బాధను వ్యక్తం చేయడానికే నిర్ణయించు కుంది.

"అయితె మానాయె తియ్యి బిడ్డ! ఇయ్యాల్ల నువ్వు పెండ్లానివైతివి. వట్టిగనే అన్నరా ముందచ్చిన చెవ్వుల కంటె ఎనుక చ్చిన కొమ్ములు వాడిగుంటయని- పట్టుచీరలో ఏం చీరలో మీరే కొనుక్కోండ్రి. మీరే సుఖ పడండ్రి నాకేమద్దు" అంది.

భార్యకు సంజ్ఞ చేసి ఏమనవద్దన్నాడు శంకరయ్య. బట్టలు తీసుకునే సమయంలో తల్లికి పట్టుచీర విషయం మరిచే పోయాడు. తర్వాత జ్ఞాపకం వచ్చినా ఒకే సారి రెండు పట్టుచీరలు కొనే స్థితి లేదని గ్రహించాడు. ఇకముందయినా తప్పకుండా కొనాలనే నిర్ణయించుకున్నాడు.

"అవ్వా! ఈసారి నీకు తప్పకుండా పట్టుచీర కొంట. నువ్వేమనుకోకు. ఇప్పుడిప్పుడే నౌకరి దొరికింది గద. అటెనుక మా కొంట"

చిప్ప మల్లయ్య భార్యను సముదాయిం చాడు.

"కొడుకులు, కోడండ్లు, అందరితోని

సంబురంగ ఉండాలెగాని గా పట్టుచీర లేకుంటే ఏందోయ్! అది లేకుంటె బతుకమా ఏంది? " అన్నాడు.

లింగమ్మ ఇంకేం మాట్లాడలేదు.

ఇంకెప్పుడూ పట్టుచీర విషయం తేకూడదనుకుంది.

మరికొంతకాలం గడిచింది. ఆ చీర విషయాన్నందరూ మరిచిపోయారు.

లింగమ్మ ఇప్పుడు మంచం పట్టింది.

ఆమెను బాగానే చూసుకుంటున్నాడు. శంకరయ్య. కానీ ఆమె పట్టుచీర కోర్కె మాత్రం తీరలేదు. ఇప్పుడు తెచ్చినా కట్టుకోలేదని ఊర్కున్నాడు.

అయితే మాటల ప్రస్తావనలో అను మాండ్ల నర్సమ్మ చీర ప్రసక్తి తెచ్చింది.

"ఏం చేద్దాం... లింగమ్మ పురాగ ముసలిదాయె. సావుదలకచ్చె కాని చిన్నప్పటి నుంచి అనుకుంటున్న పట్టుచీర కోర్కయితే తీరకనే పాయె. కొందరి బతుకులు గంతే. మూడు తరాల్ల ఆమె కోర్కె తీరలేదంటె ఏమనుడు' ' అంది.



శంకరయ్య ఆ మాటలు విన్నాడు.

"నేను కరీంనగర్‌కు పోయి పట్టుచీర తెస్త" అని వెళ్లాడు.

★ ★ ★

కళ్ళముందు లీలగా అన్నీ కదులుతున్నాయి.

"శంకరయ్యొచ్చిండా? " లింగమ్మ గొంతు బలహీనంగా ఉంది.

ఆమె చుట్టూ జనాలు బంధువులు మనవలు కోడండ్లు కొడుకులు అంతా

"శంకరయ్య వచ్చిండా? " మరోసారని కండ్లు మూసింది లింగమ్మ. చుట్టూ ఉన్న వాళ్లంతా గొల్లుమన్నారు.

శంకరయ్య తెచ్చిన పట్టుచీర లింగమ్మ శవం మీద కప్పడానికి ఉపయోగపడింది.

★ ★ ★

సంక్రాంతి పండుగ రోజులు. శారద పిల్లలను తీసుకొని తల్లిగారింటికి పోయింది. ఇంట్లో ఒంటరిగా ఉన్నాడు శంకరయ్య. పెద్ద వదిన లచ్చవ్వ, రెండో వదిన లక్ష్మి తెచ్చిచ్చిన చకినాలు, గారెలు డబ్బాలో ఉన్నాయి. అందులోంచి నాలుగైదు తీసుకొని తిన్నాడు.

మంచంలో వెల్లకిలా పడుకున్నాడు.

ఇంటికప్పుకేసి చూస్తూ ఆలోచనలో పడ్డాడు. అతని కళ్ళ ముందు తల్లి కదులుతోంది. కడుపులోంచి సోద తన్నుకొస్తోంది. అతనిలో అంతర్మథనం కొనసాగుతోంది. ఓ పట్టుచీర కోర్కెనయినా తీర్చుకోలేని తల్లి లింగమ్మ జ్ఞాపకాల్లో దొర్లుతోంది.

తన తల్లి లింగమ్మ తనను కని పెంచిన మాతృమూర్తి. తమ కోసం ఎంతో ఆరాటపడింది. తన జీవితకాలమంతా తమ కోసమే వెచ్చించింది. కుటుంబం కోసం రెక్కలు ముక్కలు చేసుకుంది. కాని తానేం చేశాడామెకు? నిజానికి స్త్రీ బతుకెంత పరాధీనమైంది. మూడు తరాల్లోనూ తన తల్లి పట్టుచీర కోర్కెను తీర్చుకోలేకపోయింది. ఆమె తండ్రి, తన తండ్రి తరంలో పేదరికంతో ఆ కోర్కె తీరలేదు. తన అన్నల కుటుంబాల ఆర్థిక పరిస్థితీ అంతంత మాత్రమే. తాను మాత్రం ఉద్యోగంచేస్తున్నాడు. ఏడేడు తరాలు వెనక్కి పోయి చూసినా తన కుటుంబంలో

ప్రభుత్వ ఉద్యోగం చేసినవాళ్లు దొరకరు. తానే చదువుకొని ఉద్యోగం చేస్తున్నవాళ్లలో మొదటివాడు. ఉద్యోగం చేస్తున్నంత మాత్రాన తాను ఆర్థికంగా గొప్పగా ఏం మారలేదు. దుర్భరమైన ఆర్థిక దుస్థితి లోంచి ఓ తీరుగా బతికే స్థితి కెదిగాడు. బట్ట, పొట్టకు ఇబ్బంది లేకుండా బతుకుతు న్నాడు. అయినా తన తల్లి కోరిన ఒక్క పట్టుచీర కొనివ్వలేకపోయాడు.

నిజంగా తమవాళ్ళవెంత పరాధీన బతుకులు? బట్టలు నేసినా ఒంటినిండా బట్టలు కట్టుకోలేని స్థితి. ఒంటినిండా బట్టలు కప్పుకోలేని స్థితి. తన చిన్నతనంలో తల్లి దగ్గరకు తీసుకొని నాన్న నేచిన తెల్ల దుప్పటి కింద పడుకోబెట్టేది. తనలో ఒదిగించుకునేది. ఒకే దుప్పటి కింద తామంతా పడుకునేవారు. పాపం తన తల్లిదెంత పరాధీనబతుకు? ఒక్క చీర కోర్కె తీర్చుకోలేని బతుకు... జీవితాంతం ఆమె ఆ కోర్కె కోరుతూనే ఉంది. కానీ తానయినా ఆ కోర్కె తీర్చలేకపోయాడు. ఉద్యోగం చేస్తున్న తాను ఆ కోర్కె తీర్చవచ్చు కాని తాను నిర్లక్ష్యం చేశాడు. తన తండ్రికి అన్నలకు ఆ స్థితి లేకున్నా తాను తలుచుకుంటే తీర్చగలడు. తానాపని చేయలేకపోయాడు. చేయాలనుకొనీ చేయలేకపోయాడు. తానెంత పొరపాటు చేశాడు? అసాధారణమైన కోర్కెం కాదది. అయినా వాయిదా వేస్తూ పోయాడు. ఆ వాయిదా జీవిత వాయిదా అయింది. ఈలోగా తన తల్లే తమను విడిచి శాశ్వతంగా వెళ్ళిపోయింది. తాను తెచ్చిన చీర ఆమె శవంపై కప్పడానికుపయోగపడింది. కని పెంచి, అష్ట కష్టాలు పడి తనకు విద్యాబుద్ధులు నేర్పించిన తల్లి అతి చిన్న కోర్కె తీర్చలేకపోయిన తానెంత దౌర్భాగ్యుడు?

తాను చదువుకున్నాడు. ఉపాధ్యాయ వృత్తిలో ఉన్నాడు. మరి తన చదువు తనకేం చెప్పింది? ఏం నేర్పింది? తన చదువులు, కాలేజీ చదువులు జీవితాలను గెలుచుకునే రహస్యాలను చెప్పాయా? ఆ క్రమాన్ని చెప్పాయా? ఉద్యోగం అయితే జీవితాలను గెలుచుకున్నట్టేనా? తాము జీవితాలను గెలుచుకోవాలి. ఇంతకీ జీవితాలను గెలుచుకోవడం అంటే ఏమిటి? స్వాతంత్ర్యానంతరం తమ కులంలో, ఊళ్లో కొంతమంది చదువుల పేరుతో పైకొచ్చారు. అదేనా జీవితాల్ని గెలుచుకోవడమంటే? తాను చదువుకొని తన వాళ్ళకు ఏపాటి అండగా నిల్చొంటున్నాడు? అమ్మ కొనివ్వమన్న ఓ పట్టుచీరనే కొనివ్వలేనివాడు తన వాళ్ళకోసమేం చేస్తాడు?

శంకరయ్య కళ్లవెంట నీళ్లు కారుతున్నాయి.

ఇంతకీ ఈ కులం, మతం, ఇవన్నీ ఏమిటి? తాను అనేకమంది తాత్వికతలను చదువుతున్నాడు. తాత్వికతలను అలవరచుకుంటున్నాడు. కథలు రాస్తున్నాడు. సమాజాన్ని నిశితంగా చదువుతున్నాడు. ఏం చేసినా తాను తన తల్లి చిన్న కోర్కెను తీర్చలేకపోయాడు. ఇది కేవలం ఆర్థికపరమైన విషయమేనా? తన వాళ్ళంతా మగ్గం గుంటకే అంకితమై బతికేవారు. ఏదో బట్టకూ, పొట్టకూ ఢోకా లేదన్నట్టుగా బతికేవారు.

మిల్లు బట్టలు వచ్చాయి. యంత్రాలు వచ్చాయి. వీటితో కొంతమంది లాభపడింది నిజమే. లాభపడుతున్నదీ వాస్తవమే. కాని ఎవరు? ఎందరు? పదిమంది పనిచేసే పనిని ఓ యంత్రం చేస్తుంది. దాంతో చాలామంది ఉపాధి కోల్పోతున్నారు. నూలు దొరకని దుర్భర పరిస్థితి ఏర్పడుతుంది. పెట్టుబడులు లేక తనవాళ్ళు కూలీ నేతగాళ్ళుగా మారుతున్నారు. రైతు తన భూమిలో తానే పాలేరయినట్టే నేత రైతులు కూలీ నేతగాళ్ళవుతున్నారు. స్వయంగా బట్టలు నేచుకుంటూ బతికే మగ్గం యజమాని కూలీగా మారుతున్నాడు. పట్టణాల్లో యంత్రాలపై పనిచేసే తన

వాళ్లంతా చేస్తున్నదదే కదా! కొన్ని సహకార సంఘాలు ఏర్పడ్డాయి. కొంచెం చదువుకున్న వాళ్లు, తెలివైన వాళ్లని చెప్పబడే వాళ్ళు వీటితో లాభపడ్డారు. ఇందులోనూ ఎన్నో గోల్‌మాల్ వ్యవహారాలు జరుగుతున్నాయి. దీంతో లాభపడిన వాళ్ళలో చాలా మంది పైరవీకార్లలాంటి వాళ్ళే అంటే తమలోనూ కొత్తకొత్త తెల్లబట్టల వాళ్ళు బయలుదేరారు. వీళ్ళు బాగా లాభపడ్డా, పైకొచ్చినా కులం వాళ్ళు సహకార సంఘాలను ఉపయోగించు కొని స్వల్పంగా లాభపడ్డారు. ఆప్కో సంస్థలు ఇతర సంస్థల వల్ల కూడా కొందరు బాగుపడ్డారు.

మరమగ్గాలు వచ్చాయి పట్టణాల్లోకి కొంచెం పెద్దగా ఉన్న ఊళ్లలోకి మరమగ్గాలతో చేనేత కులాల, వృత్తుల జీవితాలు బాగుపడ్డాయా? కొంత మంది పైకి వచ్చినట్టు కనబడుతుంది. సిరిసిల్లలాంటి ప్రాంతంలో మరమగ్గాలతో చాలా మంది పైకొచ్చారు. నేతవృత్తి మాత్రం మూలకుపడుతున్నట్టనిపిస్తుంది. ఈ సాంచాల పనితో పైకి వచ్చినట్టు కనబడేదంతా వాస్తవమేనా? వాటి మీద కూలీలుగా పనిచేసే వాళ్ళు చాలా మంది తమ వాళ్ళే. అందులోంచి వెళ్లే దుమ్ము, ధూళి, బట్టల నుసి గొంతులోకి పోయి చాలా మంది క్షయవ్యాధికి గురయ్యారు. దుర్మరణానికి గురయ్యారు. తన అన్న ఆ పనికే పోయి మత కలహాల్లో కన్నుమూశాడు. తన తండ్రి, తన రెండో అన్న మాత్రం మగ్గం గుంటకే అంకితమై బతుకుతున్నారు. తమ ఇంట్లో ఎప్పుడూ షట్లుంషట్లుం అంటూ నాడె చప్పుడు వినబడుతూనే ఉంటుంది. అదిప్పుడు తక్కువవుతుంది. షరి గుంజలు పుచ్చుబట్టబోతున్నాయా? ఇప్పుడు తన నాన్నలాంటి వాళ్ళు నేచే నేతబట్టలు వాడే వాళ్ళు చాలా తక్కువ. ఇంకొంత కాలంలో ఆ మగ్గం గుంటలు మూసుకుపోతాయా? అంతా యంత్రాల మయమేనా?

తన ఊళ్ళోకి ఇంకా మరమగ్గాలు రాలేదు కాని ఊళ్ళోకి వచ్చాయి. ఇప్పుడయితే అవి బాగానే నడుస్తున్నాయి. బాగా అంటే లాభసాటిగా అన్నట్టే. సిరిసిల్లలో వేలాది మంది మరమగ్గాల మీద పనిచేస్తూ బతుకుతున్నారు. అది 'సిరి'శాలగా పేరు పొందింది. అందుక్కారణం మరమగ్గాలేనా? తన ఊరు పారిశ్రామిక నాగరికతకు, పట్టణాలకు దూరంలో ఉండటం వల్ల మరమగ్గాలింకా రాలేదు. పారిశ్రామిక ప్రగతి ఇప్పుడిప్పుడే చోటు చేసుకుంటున్న ఎప్పట్నుంచో సిరిసిల్ల ప్రాంతం నుంచి, జగిత్యాల దిక్కు నుంచి మహారాష్ట్రకు పద్మశాలీలు వలసపోతున్నారు. గణనీయమైన సంఖ్యలోనే పోయారు- పెద్దపల్లి రెవెన్యూ ప్రాంతం నుంచి కూడా కొంత మంది పోతున్నారు- తన ఊళ్ళోంచీ పోతున్నారు- ఈ నడుమ దేశాన్ని విడిచి మస్కట్ దేశాలకు కూడా పోతున్నారు అందులో తమ వృత్తివాళ్ళూ ఉంటున్నారు. అంటే జరుగుతుందేంటి? ఊళ్ళలో వృత్తి పనులు నశిస్తున్నాయా? కలకాలంగా బతుకుతున్న పనులుంటే ఊరును వదిలి వలసలెందుకుపోతారు? వృత్తుల పతనంతో చాలా మంది వీధుల్లో పడుతున్నారా? ఇది అభివృద్ధియేనా? ఊళ్ళలోనే ఉండి బతకాలనుకోవడం అభివృద్ధి నిరోధకమా? వెనుకబాటుతనమా? తమ గ్రామాలను వదలంది అభివృద్ధి చెందడం సాధ్యం కాదా?

ఊళ్ళల్లో మిల్లుబట్టల వ్యాపారాలు చేస్తున్నారు. కొందరు పట్టణాల్లోంచి తీసుకొచ్చి చిన్న చిన్న దుకాణాలు పెట్టి అమ్ముతున్నారు. పెద్ద దుకాణాల వాళ్ళు బాగా సంపాదిస్తున్నారు. చిన్న చిన్న దుకాణాల వాళ్ల పరిస్థితి అంతంత మాత్రంగానే ఉంది. కొందరు సైకిళ్ల మీద బట్టల మూటలు పెట్టుకొని ఊళ్లు తిరుగుతూ అమ్ముకుంటున్నారు. అంతా సంధి దశలో ఉన్నట్టనిపిస్తుంది. గందరగోళంగా అనిపిస్తుంది.

తాను తాత్వికత గూర్చి చదువుతున్నాడు.

తనకంటూ ఓ ప్రత్యేకత తాత్వికత కావాలని ఆరాటపడుతున్నాడు. తను పని తాత్వికత గురించి పరిశోధనలాంటివి చేస్తున్నాడు. పని కులాల, శ్రామికుల తాత్వికతలోని గొప్ప తనం గూర్చి వెతుకుతున్నాడు. తానింకా వెతుకులాటలోనే ఉన్నాడు. అధ్యయనం చేస్తూనే ఉన్నాడు. తనకింకా స్పష్టత రాలేదు. తన అన్వేషణ కొనసాగుతూనే ఉంది. పని కులాల్లోంచి ఎదిగి తాత్వి కతనందించిన వాళ్లెంతో మందున్నారు. వీర బ్రహ్మం, నానక్, కబీర్‌లాంటి వాళ్లు బ్రాహ్మ ణేతర కులాల నుంచి తాత్వికులుగా ఎది గారు. వీరి తాత్వికత ఇతరుల తాత్వికత కంటే భిన్నమైంది. ఇందులో దార్శనికతుం టుంది. ప్రేమ పరిమళముంటుంది. మాన వతా సుగంధముంటుంది.

ఇప్పుడు కావాల్సింది తాత్వికత ఎలాంటి తాత్వికత? ఈ దేశంలోని చాలా మంది శ్రమతో బతుకుతున్న వాళ్ళే. వాళ్ళకు అను కూలమైన తాత్వికత కావాలి. అదే శ్రమ తాత్వికత శ్రామిక వర్గాల తాత్వికత... అందుకోసమే తన అన్వేషణ తమ వాళ్ళవి కష్టమైన బతుకులు వీళ్ళంతా నేలను తన చెమటతో పునీతం చేస్తారు. కాని వీళ్ళు అనుభవిస్తున్నదేంటి? అసలేం జరుగు తోంది? ఇలాంటి వాళ్ళ కోసం అద్భుత మైన శ్రామిక సాంస్కృతిక నేపథ్యం కావాలి. అందుకే తన తపన, ఆరాటం నిరంతర అధ్యయనం, రచనలు, మానవతా పరిమళం చిమ్మే తాత్వికత కోసం తాను నిరంతరం కృషి చేస్తూనే ఉన్నాడు. తన జీవిత కాలంలో తానది సాధించగలడా? అయినా అన్వేషణ తప్పదు.

తన వాళ్ళు కొందరు చదువులను, వ్యాపా రాలను బతుకు మార్గాలుగా ఎంచుకు న్నారు. వాటినే రియల్ ఎస్టేట్లుగా భావిం చారు. కొంత మంది పైకొస్తున్నారు. ఆర్థి కంగా, సామాజికంగా ఓ స్థితికెదుగుతు న్నారు. కానీ చాలా మంది వృత్తులు కోల్పోయి సంక్షోభంలో కొట్టుమిట్టాడుతు న్నారు. అంటే తాను కులవృత్తులను సమ ర్థిస్తున్నాడా? గ్రామాలు అదే ఫ్యూడల్ భావాలతో సంస్కృతితో ఉండాలని కోరు కుంటున్నాడా? వృత్తులుండడం అంటే ఫ్యూడల్ సంస్కృతిని సమర్థించినట్టేనా? అంతా గందరగోళం. ఏదీ నిర్ణయించుకో లేని స్థితి. ద్వైదీభావం నిరంతర సంఘర్ష ణతో మెదడు నిండా ఆలోచనలు.

ఎదగాలి తాను ఎదగాలి తన వాళ్ళను ఎదిగించాలి. తన వాళ్ళకు అండదండగా నిలవాలి. అయినంత వరకు, తన నుంచి అయినంతవరకు తన వాళ్ళకు తోడుగా ఉండాలి. తాను తన తల్లిదండ్రులను బాగానే చూసుకున్నాడు. కాని కాని తన తల్లి అతిచిన్న కోర్కెను తీర్చలేకపోయాడు. తన తల్లి ఇంతలోనే ఈ లోకాన్ని వదిలిపో తుందని తానూహించలేకపోయాడు. తన తల్లి కోర్కెనయినా తీర్చని తాను తన వాళ్ళకు మాత్రమేం చేస్తాడు? సమాజా నికేం చేస్తాడు? ఇలా అనుకోవడం సరైందేనా?

తన వాళ్ళు శ్రమజీవులు బట్టలు తయా రుచేసే పనితోపాటు ఇతర విధాలుగా కూడా బతుకుతున్నారు జగిత్యాల నుంచి నిజామాబాద్ వరకు గల ప్రాంతంలో తన వాళ్ళు చాలా మంది బీడీ పరిశ్రమ వృత్తిగా బతుకుతున్నారు. ఇందులో స్త్రీలే ఎక్కువగా పనిచేస్తున్నారు. ఇంటి పనులు చేసు కుంటూ వీళ్లు ఈ పనులూ చేస్తారు. ఈ స్త్రీల ఆదాయం ఇంటి ఖర్చులకు వేన్నీళ్లకు చన్నీళ్లలా ఉపయోగపడుతుంది. ఇంట్లో బీడీలు చేస్తూ ఈ స్త్రీలు తమ పిల్లలను చది వించుకున్నారు. ఎదిగించుకున్నారు. కరీంన గర్, కొత్తపల్లి ప్రాంతంలోని బీడీ పరిశ్ర

✤ జీవితం స్వల్పమైనది అడ్డంకులు అసంఖ్యాకమైనవి. కనుక ఏది మంచిదో అది చేయాలి. – పంచతంత్రం

మలో తన వాళ్లు చాలా మంది పని చేస్తున్నారు. ఇంట్లో బీడీలు చేస్తూ కుటుంబ ఆదాయం పెంచడానికి కృషి చేస్తున్నారు. ఇందులోనూ స్త్రీలే ప్రధాన పాత్రధారులు. తన తల్లి అలాంటి స్త్రీయే. భర్తతో సమానంగా పనిచేసింది. కష్టాల్లో సుఖాల్లో తన తండ్రికి తోడుగా నిలిచింది. తనను కడుపులో పెట్టుకొని పోషించింది. చదివించాలని పట్టుబట్టి చదివించింది. కాని తాను? ఒక్క చీర కొనివ్వలేకపోయాడు. తన తల్లిలాంటి వాళ్లు అనేక మంది స్త్రీలు బీడీలు తయారుచేస్తూ పొగాకు ఘాటుకు, పొగాకు పొడిలోంచి వచ్చే దుమ్ము ఘాటుకు రోగగ్రస్థులయ్యారు. దవాఖానాల పాలయ్యారు- కొందరు మరణించారు కూడా. అయినా తమ కుటుంబాల కోసం, ఆదాయం పెంపు కోసం నిరంతరం శ్రమించే తన తల్లి లాంటి వాళ్ళెంతో మందున్నారు. బీడీ కార్మికులపై కంట్రాక్టర్ల దోపిడీ బాగానే ఉంటుంది. అందుకోసం జగిత్యాల ప్రాంతంలో పోరాటాలూ జరుగుతున్నాయి. బీడీ కార్మికులు చేస్తున్న జీవన్మరణ సంగ్రామాలను 'బతుకుపోరు' నవలగా రాశాడు జగిత్యాల ప్రాంతానికి చెందిన ఓ రచయిత. ఆ పుస్తకం తాను చదివాడు.



## మర్యాద

హెల్త్ మినిస్టర్‌గా కొత్తగా వచ్చిన ఒకాయన ఓ పెద్ద గవర్నమెంట్ ఆస్పత్రి తనిఖీకి వచ్చాడు. సూపరింటెండెంట్ ఆయనకు అన్ని విభాగాలూ చూపిస్తూ లేబర్‌వార్డ్ వద్దకు తీసుకు వచ్చాడు.

'సర్.. ఇదే లేబర్ వార్డు..'

'అయితే మనకు సంబంధంలేదు.. అదంతా మన లేబర్ మినిస్టర్ చూసుకుంటాడు.. అతని అధికార పరిధిలోని దాన్ని నేనెలా తనిఖీచేస్తాను.. పద్ధతి-పాడూ తెలిసినవాడిని' అంటూ గిర్రున వెనుతిరిగాడు మంత్రి.

తన నాన్న మాత్రం ఎంత జీవన పోరాటం చేశాడు? ఎన్ని కష్టాలు పడ్డాడు? తన చిన్నతనంలో ఏ రోజూ ఒంటి మీద అంగీ ధరించగా చూడలేదు. వేలాది తానుల బట్టలు నేచిన తన నాన్న ఎప్పుడూ చిరిగిన బనీను తొడుక్కొనే ఉండే వాడు. ఎంత పనిమంతుడైనా అతడేపాటి సుఖాలననుభవించాడు? తాము బుద్దెరిగిన తర్వాత తండ్రితో ఆపారం అంగీ తొడిగించ గలిగారు. కష్టజీవియైన తన నాన్న బతుకు చివరివరకూ అలాగే కొనసాగాలా?

ఎదగాలి శ్రమజీవులైన తన వాళ్ళు నెదిగించాలి. అందుకోసం ఓ వైతాళికుడు కావాలి. తమ వాళ్ళను వెలుగులోకి నడిపించే వ్యక్తి కావాలి. కమ్మవారికి త్రిపురనేని రామస్వామి చౌదరిలా, బ్రాహ్మణులకు శంకరాచార్యలా పనిమంతుల కులాల వారిని ప్రభావితం చేసే నాయకుడు రావాలి. అలాంటి నాయకత్వం కొరత తీరాలి. మరా కొరతను తీర్చేదెవరు? తాత్వికులుగా, ప్రభావితం చేసే వ్యక్తులుగా ఎవరు ఎదిగితే వాళ్లే వైతాళికులవుతారు. తన చరిత్ర తనే పఠించి ఫక్కున నవ్వింది ధరణి. తన గాథను తనె స్మరించి భోరున ఏడ్చింది ధరణి అన్నాడో కవి. అవును.

ధరణి ఏడుస్తుంది. నవ్వుతుంది. ఇప్పుడు ఎవరి చరిత్రను వాళ్లే రాసుకునే క్రమం మొదలవుతుంది. స్వాతంత్ర్యానంతరం పుట్టి చదువులతో ఇతరత్రా జీవితాలను గెలుచుకున్న పనిమంతుల కులాల వాళ్ళున్నారు. వాళ్ళు తమ చరిత్రను తామే రాసుకుంటారు. తమ గాథలను తామే స్మరించుకుంటారు. ఆ క్రమం మొదలవుతుంది.

గ్రామాల్లో ఇప్పుడు తన చిన్నతనంలో ఉన్నంత ఫాసిస్టు సంస్కృతి లేదు. ప్రజల్లో వివిధ కులాల వారిలో అప్పుడున్న అవినాభావ సంబంధాలు, ప్రేమలు, అనురాగాలు, ఆప్యాయతలు మానవ సంబంధాలు తగ్గుతున్నట్లనిపిస్తుంది. ఈ క్రమం ఈ విషయంలో ఇలాగే కొనసాగుతుందా? అయితే తమలాంటి కుటుంబాల్లో బలహీనవర్గాల్లో చదువుకునే అవకాశాలు స్వాతంత్ర్యానికి ముందు కంటె కొంత మెరుగైన మాట వాస్తవమే. మరీ అవకాశాన్ని ఎంతమంది ఉపయోగించుకుంటున్నారు?

తన తల్లిదండ్రులు తనను కష్టపడి చదివించారు. తాను పనిచేస్తూ చదువుకున్నాడు. చదువుకుంటూ పనిచేశాడు. శ్రమ. శ్రమ శ్రమ. నిర్విరామ శ్రమ. పని చదువు పరస్పర సంబంధం కలిగివుండేవి. శ్రామిక కుటుంబాల్లోంచి వచ్చిన తనలాంటి వాళ్లు వచ్చిన అవకాశాలను వినియోగించుకుని కష్టపడి చదువుకున్నారు. పని చేసుకుంటూనే కష్టపడి చదువుకున్నారు. దొరలని చెప్పబడే వాళ్ల పిల్లలు దొరల ఫోజుల్లో పడి కొట్టుకుంటుంటే తాము సిన్సియర్‌గా చదువుకున్నారు. తరగతిలో తానెప్పుడూ ఫస్టే. వ్యాస రచన, వక్తృత్వ పోటీల్లోనూ ఫస్టే. డిబేట్‌లో అందరినీ ఓడించేవాడు. ఆటల్లో మాత్రం అంతంత మాత్రమే. ఆ తరంలో చదువుకున్నవాళ్లు కొందరు బాగానే ఎదిగారు. కొందరు మధ్యతరగతికి ఎదిగారు. తమ చరిత్రను తామే రాసుకోవడం మొదలుపెట్టారు. నాయకులుగా, మేధావులుగా, రచయితలుగా, సామాజిక కార్యకర్తలుగానూ ఎదుగుతున్నారు. పూర్వకాలంలోనూ బలహీన వర్గాల్లోంచి కొందరు తత్వవేత్తలు తేలారు. అనేక సమస్యలకు పరిష్కారం చూపారు. ప్రేమ గురించి చెప్పారు. దుఃఖ హేతువు గూర్చి చెప్పారు.

మరమగ్గాలుంటే తనవాళ్లకు ఇప్పుడు అత్యున్నత గౌరవం వస్తుందా? క్రమక్రమంగా చేతివృత్తులు మూలకు బడుతున్నాయా?

తన తరంలోని వాళ్లు పేదరికంలోంచి వచ్చిన వాళ్లే. అయినా చాలామంది దొరల కంటే బాగా చదువుకున్నారు. వివిధ రంగాల్లో పైకొచ్చారు. ఇంకా పైకొస్తున్నారు. కాని ఇదెంత శాతం? చాలా తక్కువ. సర్వసంపదలకు సృష్టికర్తలైన వీళ్లు తమపై జరుగుతున్న దోపిడీని గమనిస్తున్నారు. ప్రశ్నిస్తున్నారు.

వృత్తి, కులాలు, పరస్పర సంబంధాలు మన దేశానికిది శాపమా? వరమా? కుల వ్యత్యాసాలు, అంతరాలు ఇప్పటికీ దేశంలో ఉన్నాయి. తమ ప్రభావాన్ని చూపుతూనే ఉన్నాయి. బీహార్, ఉత్తరప్రదేశ్ లాంటి రాష్ట్రాల్లో కుల వ్యవస్థ మూలాలు, ప్రభావం మరింత లోతుగా ఉన్నాయి.

మన దేశంలోంచి కులాలు పోతాయా? కొందరు చెబుతున్నట్టు మన దేశంలో కుల నిర్మూలన సాధ్యమేనా? వృత్తులను బట్టి కులాలు ఏర్పడ్డాయనుకుందాం. ఏ పనయినా తక్కువదా? సామాజిక అవసరాలు తీరడానికి అన్ని వృత్తులూ అవసరమే కాదా! మరి ఇది పెద్దకులం, ఇది చిన్నకులం అన్న భావాలెందుకు? ఉత్పత్తి కులాలు తక్కువగా చూడబడటం ఎందుకు? ఉత్పత్తి శక్తులకు, ఉత్పత్తి కులాలకు గౌరవం, విలువ ఉంటే కుల వ్యత్యాసాలు తొలగి పోతాయికదా! ఇతర దేశాల్లో ఉన్నట్టయినా పనికి విలువుంటే క్రమక్రమంగా కులభేదాలు నిర్మూలన అవుతాయి కదా! ఉత్పత్తి శక్తులతో సంబంధంలేని వృత్తు

లకు పెద్దపీట, సంపదల సృష్టికర్తల కులాలపై చిన్నచూపు ఉండటం వల్లనే కదా కుల వ్యవస్థపై వ్యతిరేకత. ఈ భేదాలు పోవాలంటే పని సంస్కృతి కావాలి. పని సంస్కృతికి గౌరవం పెరగాలి.

అంతా గందరగోళం. ఏదేంటో తెలియని అయోమయం. తనకు భావాల్లో స్పష్టత వచ్చిందా? ఇంతకంటే స్పష్టతుంటుందా? అయినా తానింకా అధ్యయనం చేయాలి. సమాజాన్ని చదవాలి. సమాజానికి తన వారికి ఏమేరకైనా ఉపయోగపడాలి.

తనవాళ్ల కోసం ఇటీవలి కాలంలో కృషి చేసిన వాళ్లూ ఉన్నారు. సోమయ్యగారు చేనేత సహకార ఉద్యమానికి బలాన్నిచ్చారు. కొండా లక్ష్మన్‌బాపూజీ రాజకీయాల్లో ఉంటూ ఎంతో కొంత కృషిచేశారు. వీటితో తమ కులంలో కొంతమందైనా పైకొచ్చారు. అయితే ఆ సంఘాలను దుర్వినియోగం చేసినవాళ్లూ ఉన్నారు. కో ఆపరేటివ్ సొసైటీల పేరుమీద కొందరు చేసిన మోసాలవల్ల తమ కులం వాళ్లను తామే నమ్మని పరిస్థితులొచ్చాయి. ఇవన్నీ తాను క్షుణంగా అధ్యయనం చేస్తున్నాడు. తన వాళ్ళు కొందరు ఆర్థికంగా, చదువుల్లో బాగానే ఎదిగినా, ఎదుగుతున్నా, రాజకీయంగా మాత్రం అంతగా ఎదుగలేదు.

పనిమంతుల పనుల్లో, వృత్తుల్లో ఎంత బలముంది? ఈ సృష్టికర్తల్లో స్వర్ణకారులు, సాలెలు చాలా నైపుణ్యంగల పనివాళ్లు. గౌడలు, సాలెలు రాష్ట్ర చరిత్రనే మారుస్తారని ఎక్కడో చదివినట్టు గుర్తు. అగ్గిపెట్టెలో పట్టేంత నాణ్యమైన బట్టలు నేసే నేర్పరులైన పనివాళ్ల చేతులు నరికించారంటారు ఇంగ్లీషు వాళ్లు. అయినా గతమెంత ఘనం అని చెప్పుకుంటే ఒరిగేదేంలేదు. ఇప్పటి స్థితి ముఖ్యం. నగలు, కిరీటాలు, వస్త్రాలు దేవతలకు, రాజులకు, చక్రవర్తులకు అందించిన స్వర్ణకారులు, సాలెలు అత్యున్నత శిల్పులే. పని నుంచి జ్ఞానం పెరిగే క్రమం ఇందులో ఉంది. తాము వేరుపడే సమయంలో తాను వ్యష్టి కుటుంబాలను సమర్థించాడు. వృత్తుల పతనంతో, పారిశ్రామికీకరణతో ఉమ్మడి కుటుంబాలు వ్యష్టి కుటుంబాలుగా మారే దుర్మార్గాన్ని తాను సమర్థించాడా?

తన వాళ్లు పోచంపల్లి, గద్వాల, వనపర్తి లాంటి ప్రదేశాల్లో అద్భుతమైన పట్టుచీరలు నేసేవారు. మెట్‌పల్లి ఖాదీ భాండార్, వావిలాల ఖాదీభండార్ ఎంతో ప్రసిద్ధి చెందాయి. ఇందులో సామాజిక విశ్లేషణ, మానవ సంబంధాలు కలగలిసి పోయాయి. స్వర్ణకారులు, విశ్వబ్రాహ్మణులుగా బ్రాహ్మణీకరణం చెందడానికి ప్రయత్నిస్తుంటే సాలెలు పద్మబ్రాహ్మణులుగా బ్రాహ్మణీకరణం చెందే ప్రయత్నం చేస్తున్నారు. తన వాళ్లకు చాలావరకు మరాఠీలతో సంబంధాలున్నాయి. కొంత కొంత మరాఠీ సంస్కృతి వాసనలూ కనబడుతాయి. తాను షిర్డీ లాంటి ప్రదేశాలకు వెళ్లివచ్చాడు. కరీంనగర్‌లో ప్రారంభమై నిజామాబాద్ మీదుగా నాందేడ్ ఔరంగాబాద్‌ల మీదుగా పయనించాడు. ఈ ప్రదేశాల్లో చాలామంది తన ప్రాంతం వాళ్లు, తమ వృత్తి వాళ్లు కనబడతారు. అక్కడి ప్రజలతో తమ వాళ్లకు అవినాభావ సంబంధముంది. వాళ్ళెప్పుడూ వీళ్లను పరాయివాళ్లుగా భావించరు. ఈ ప్రాంతాల్లో వ్యవసాయం, మిగతా విషయాలన్నీ తమ ప్రాంత సంస్కృతీ సాంప్రదాయాలకు దగ్గరగా ఉన్నట్టనిపిస్తుంది.

ఎంతో నైపుణ్యం గల వాళ్లయినా తన వాళ్లు ఎన్నో పనులు చేస్తూ బతికే పనిమంతులు గ్రామాల్లో తాగుడుకు బానిసలైన వాళ్లున్నారు. దాన్నో అలవాటుగా స్వీకరించకుంటే బాగుండేది. నిజంగా వృత్తిపనుల్లో ఎంత తాదాత్మ్యం ఉంది? కులవృత్తుల్లో, మానవ సంబంధాలు మిళితమై ఉంటే అంతకంటే కావాల్సిందేముంది? మరి ఆ మానవ సంబంధాలేమయ్యాయి. దళారీల పాలయ్యాయా? కులపీడన లేకుండా ఒకరితో ఒకరు కలిసి వివిధ వృత్తుల మధ్య

సమన్వయంతో ఊళ్లలో ఓ హార్మోనీని సాధించే దిశగా వృత్తులు సాగితే ఎంత బాగుండేది?

తన అధ్యయనంలో భాగంగా అనేక పుస్త కాలు చదువుతున్నాడు. అనేక విషయా లను క్రోడీకరించుతున్నాడు. తనవాళ్లు చేనేత పరిశ్రమతోపాటు కొన్నిచోట్ల బీడీల పరిశ్రమనూ స్వంతం చేసుకున్నారు. ముంబై పూనాలకు పోయారు. అక్కడ బీడీలు చేస్తూ బతికారు. సమ్మెలు చేశారు. 1950-60 ప్రాంతాల్లో తెలంగాణలో అది కుటీర పరిశ్రమగానే ఉండేది. ట్రేడ్ యూని యన్ల వైఫల్యంవల్ల అది స్త్రీల పరిశ్రమగా మారింది. క్రమక్రమంగా అది కోరుట్ల నుండి జగిత్యాలకు మారింది.

తమ వాళ్లలో ఎన్ని ఆచారాలు? ఎంత సాంప్రదాయం? ఎన్ని పట్టింపులు? ఎంత బంధుప్రీతి? ప్రేమలు?

ఇంటికి చుట్టమొస్తే శనార్థిచెప్పి కాళ్లకు నీళ్లి చ్చేవారు. బావి దగ్గరికెళ్లి కాళ్లు కడుక్కొని వచ్చేవారు. చుట్టం నడిచి రావడంవల్ల కాళ్లకు పట్టిన దుమ్ము ధూళి పోవడానికి, అలసట తీరడానికి ఈ చర్య ఉపయోగపడేది. మంచంలో కూర్చున్న తరువాత మోతుకాకు ఇచ్చేవారు. దాన్ని చుట్టగా మలుచుకునే వాడ తను. ఓ పొగాకు రెమ్మ తెచ్చిచ్చేవారు. దాన్ని ముక్కలుగా చించి చుట్టలో పెట్టుకునేవాడు. ఈలోగా పెంకమీద అగ్గి తెచ్చిచ్చేవారు. దాంతో చుట్టంటుపెట్టుకునేవాడు అతిథి. చుట్ట తాగుతూ కబుర్లలో పడేవారు. ఇంటికొ చ్చిన వాళ్లను భోజనం చేయనిదే వెళ్లనిచ్చే వాళ్లు కాదు. కల్లుతో విందు తప్పనిసరి. మోతుకాకులోనే కల్లు వంచేవారు. అతడు చాలని అడ్డంగా తల ఊపేవరకూ కల్లు పోసేవారు.

తమ వాళ్లు శుక్రవారం పూజలు చేసుకునే వారు. అందులో మాంసం వండుకునే వారు. పూర్తిగా యాటను కోయడమే. కులం వాళ్లను, బంధువులను, దగ్గరి స్నేహి తులను పిలుచుకొని భోజనం పెట్టేవారు. శుక్రవారం పూజలు దండుగంటే నాన్న ఒప్పుకునేవాడు కాదు. విషయాలు తెలుసు కున్న తర్వాత తనకూ అలాగే అనిపిం చింది. ఈ పూజలు శ్రామిక కులాల్లోనే ఎక్కువ. వీళ్లు ఆర్థిక భద్రత లేనివాళ్లు. తర చుగా మాంసాహారం తినడం వీళ్లకు సాధ్యం కాదు. ఇలా పండుగలు చేసుకొని కల్లు మాంసాహారం తింటూ వీళ్లు సంతోష మనుభవిస్తారు. కల్లు వంచుతుంటే ముచ్చట్లు చెప్పుకుంటూ మాంసం ముక్కలు తింటూ ఇలాంటి సమయాల్లో ఆనందం పొందేవాళ్లు. తను చిన్నతనంలో ఇలాంటి వెన్నో చూశాడు. అందులో పాల్గొన్నాడు. పారిశ్రామికీకరణ పేరుమీద నాగరికత పెరి గిపోతున్న తర్వాత ఇలాంటి వాటికి ఆదరణ తగ్గింది. అయినా తమ వాళ్లు ఇలాంటివి తక్కువగానైనా ఇప్పటికీ చేసుకుంటున్నారు.

ఆర్.ఎస్.ఎస్. భావజాలాన్ని మహారాష్ట్ర నుంచి తెలంగాణ ప్రాంతానికి మోసుకొ చ్చింది ముఖ్యంగా సాలెలే. తమవాళ్లే.

ఆ తర్వాతది రాష్ట్రమంతటా వ్యాపిం చింది. తమ ఇండ్లలో ఎన్నో తీర్ల పనిము ట్లుండేవి. దారాలుండేవి. నూలు, లడీలు, కండెలు, రాట్నం లాంటి ఎన్నో వస్తువులుం డేవి... ఇపుడీ సాంప్రదాయపరమైన వృత్తి సంబంధమైనవన్నీ మటుమాయమైపోతు న్నాయి. సప్తరుషుల్లో ఒకరు మార్కండే యుడు అలాంటి మార్కండేయ మహర్షి తమకు కులదైవం. మార్కండేయ పురాణం, పద్మపురాణం లాంటివన్నీ తమ కిష్టమైన పురాణాలు. తన తాత తనను తొడమీద కూర్చోబెట్టుకునేవాడు. కరువు కాటకాల గూర్చి చెప్పేవాడు. తమవాళ్ళ కష్టాలగూర్చి చెప్పేవాడు. 1920-30 ప్రాంతంలో ఉడిదిప డ్డదని చెప్పాడు. దాంతో ప్లేగు వ్యాధి సోకింది. వందలాది మంది ఆ ఉడిదిలో మరణించారు అప్పుడు సూతుకం ఉండటం కూడా కష్టమైందన్నాడు. తమవాళ్ళు పాలి



వాళ్ళు చనిపోతే సూతకం ముట్టుడుం టారు. ఆ సూతకం పదకొండు లేదా పన్నెండు రోజులుంటుంది. ఆసమయంలో ఏ ముఖ్యమైన పనులూ చేయకూడదు. తమ కులంలో వ్యాపారమనస్తత్వం పెరిగిన తర్వాత ఇందులో కొంత మార్పు వచ్చింది. అన్ని రోజులు పనిచేయకుండా నష్టపోవడం దండుగనుకున్నారు. సూతకం ముట్టుడు నాలుగైదు రోజులకు తగ్గించారు. కర్మ చేయడం కూడా నాలుగైదు రోజుల్లోనే చేస్తున్నారు కొందరు.

నూలులో కూడా రకరకాలవి ఉంటాయని తాను తెలుసుకున్నాడు. రాట్నంతో వడి కింది ఖాదీ నూలు. అంటే చేత్తో వడికేది ఖాదీ మిల్లుమీద నూలుతో నేచేది చేనేత వస్తువులు స్వాతంత్ర్యానికి పూర్వం నిజాం కాలంలోనే చేనేత సహకార సంఘాలు వచ్చాయి. నైజాం దగ్గర వైద్యుడిగా ఓ పద్మ శాలుండటంవల్ల అప్పుడే ఇవి వచ్చేశాయి. అయితే స్వాతంత్ర్యానంతరం ఇవి విస్తృతంగా ప్రచారంలోకి వచ్చాయి. ఉపయోగం లోకి వచ్చాయి. దీనికి ఆద్యులు గుంటుక నరసయ్య కొండా లక్ష్మణ్‌బాపూజీ ఆయన శిష్యుడు. ఈ ఉద్యమాన్ని ముందుకు తీసుకువెళ్ళాడు.

తాము ఆచారవంతులమని పట్టుదలతో ఉండేవారు తమవాళ్ళు పట్టుదలలకు పోయేవారు పట్టింపులుండేవి. పెండ్లి సమయంలో ఎన్నో ఆచారాలుండేవి. బాసింగాలు ధరించే వారు. తానూ అవే ధరించాడు. అవి కండ్లకు అడ్డంగా వచ్చేవి. దొణుగుమీద కూర్చోబెట్టి పెళ్ళి చేసేవారు. కొన్నిచోట్ల తమ కులపువాళ్ళే మంత్రాలు చదివేవాళ్ళు. పెళ్ళిళ్ళు చేసేవారు తనకూ అలాగే జరిగింది. తమ కులంలో చదువు లవీ పెరిగి మధ్యతరగతికి ఎదిగిన వాళ్ళు చాలామంది వచ్చింతర్వాత బ్రాహ్మణులను పిలిపించుకొని పెళ్ళిళ్ళు చేసుకుంటున్నారు. తమలోనూ మధ్య తరగతి విలువలు ప్రవేశిస్తున్నాయి. తన కొడుకులకు మీటింగు పెళ్ళి చేయాలన్నా, బ్రాహ్మణ పూజారి లేకుండా పెళ్ళి చేయాలన్నా తానెన్నో ఎదుర్కోవాల్సి రావచ్చు.

ఈ రాష్ట్రంలో మొదట్లో విప్లవాలను నడిపింది కల్లూరి నారాయణలాంటి పద్మశాలులే. విప్లవ పోరాటంలో మొట్టమొదట చంపబడ్డవాడతను సాలీలు వ్యాపారాల్లోకి దిగారు. ఇప్పుడు తెలంగాణలో జరుగుతున్న ఉద్యమాల్లో మాత్రం సాలీలు తక్కువే.

రాజులకు, దేవుళ్ళకు బట్టలు నేసిచ్చిన నైపుణ్యం ఉన్న పద్మశాలీలు మక్కగడుక, అంబలి, చింతపండు తొక్కు, గంజన్నం, జొన్నరొట్టె, మొక్కజొన్న రొట్టె, తొక్కుకారం తింటూనే ఎందుకు బతికారు? తన తల్లీ అలాగే బతికింది. తమ అభివృద్ధిని చూడకుండానే కళ్ళుమూసింది. చిన్న కోర్కెనైనా తీర్చుకోకుండానే తనువు చాలించింది.

తానెంత పొరపాటు చేశాడు? ఎంత పొరపాటు చేశాడు? గొణుక్కుంటున్నాడు శంకరయ్య.

తల్లి జ్ఞాపకాలతో గతమంతా చుట్టివచ్చిన శంకరయ్య కళ్ళవెంట నీళ్ళు కారుతున్నాయి మరికొద్ది సేపట్లోనే వెక్కివెక్కి పడి ఏడుస్తున్నాడు.

ఇంట్లో కడుగు పెట్టిన చిప్పమల్లయ్య కొడుకును చూసి నిర్విణ్ణుడయ్యాడు.

"ఏంది బిడ్డా, ఏంది? ఏడుస్తున్నవేంది?" అన్నాడు మీద చెయ్యేస్తూ,

లేచి కూర్చున్నాడు శంకరయ్య.

"ఏం లేదు నాన్నా! అవ్వ యాదికొచ్చింది." అన్నాడు కళ్ళు తుడుచుకుంటూ.

"ముసల్ది యాదికచ్చిందా? ముందుగాల నేంబోయినా బాగుండు"

"నాయినా! అలా అనుకోవద్దు. ఇకనుంచి నేన్నీకు తండ్రిని. నిన్ను నా కొడుకుల కంటె మంచిగ చూసుకుంటాను. నువ్వేం పనిచేయాల్సిన పన్లేదు. అవ్వకోర్కెను నిర్లక్ష్యం చేసినందుకు పరిష్కారమిదే అన్నాడు శంకరయ్య.

★ ★ ★

"వద్దు బిడ్డా వద్దు. వద్దని ఎన్నిసార్లు జెప్పినా వింటలేకపోతివి. ఎందుకు బిడ్డా నువ్వు దుబాయ్‌కి పోవుడు. అరే ఊళ్ళె మనం బతుకుతలేమా? ఏం బాముకుంటనని దుబాయ్‌కి పోతనంటన్నవో చెప్పు. బతికిన కాడికి మాసాలుగని దుబాయ్ కద్దే మద్దు" కొడుకును దగ్గరకు తీసుకొని అంది లక్ష్మి.



"ఇంట్లున్న సుఖం ఏడికిపోయినా దొరకది... కలోగంజో అంబలో గడుకో అందరొక్క కాడుండి తింటె అది వేరుసంగతి. మంచో చెడో సుఖమో దుఃఖమో అందరం ఒక్కకాడ బతికిందినయ్యం కాదా. బతికిన కాడికాయెపటు. తిన్నకాడికాయె. పరుగెత్తి పాలుదాగిందానికంటె నిల్చుండి నీల్లు దాగింది మంచిది. గీ ఉరుకులాటలెందుకు? సంపాదన మీద మోజులెందుకు! ఊరు, దేశం విడిచిపెట్టి పోవుడెందుకు?" అన్నాడు కన్నీళ్ళతో వీరయ్య.

"వద్దురా రాజేశం! మీ అమ్మ, నాన్న వద్దు వద్దని మొత్తుకుంటున్నా ఎందుకు పోవాలని పట్టుబడుతున్నావు? అక్కడికి పోయి బాముకునేదేముందోచెప్పు! కష్టపడితే కాలం కలిసొస్తే ఎక్కడున్నా పైకి రావచ్చు. మా కాలం వాళ్ళనే చూడు. ఇక్కడున్న వాళ్ళు మాత్రం పైకిరాలేదా? చదువును, వ్యాపారా

లను స్వంతం చేసుకొని మనకు తెలిసిన వాళ్ళెందరో పైకి వచ్చారు.. ఎక్కడికి పోయినా ఏముంది? పైకి రావడానికి ఊర్ను వదిలిపెట్టకుండా ఉండమని చెప్పడం నా ఉద్దేశ్యంకాదు. కాని, ఇంత మంది వద్దంటుండగా నువ్వు పోతానని పట్టుబట్టడం నాకైతే మంచి గనిపించడం లేదు" అన్నాడు శంకరయ్య.

విద్యావంతుడు, ఎన్నోరకాల సామాజిక అవగాహన ఉన్నవాడయిన తన చిన్నాన్న కూడా అలా మాట్లాడటం రాజేశంకు అసలే నచ్చలేదు. తన తండ్రికాలంలోనే చదువుకు న్నవాడు, తన పిల్లలనందరినీ చదివిస్తున్న వాడు, రచయిత ఐన శంకరయ్య కూడా తన తండ్రి లాగే మాట్లాడటం రాజేశంకు బాధగా ఉంది.

"చిన్నాన్నా! మీరు గూడ ఇట్లా మాట్లాడ టమేం బాగుందో చెప్పుండ్రి. మీరు ముగ్గు రన్నదమ్ములు. పెద్దనాయన్న భీవండికి బతుకుటానికి పోయిండు. మీరు చదువు కొని ఉద్యోగం చేస్తున్నారు. మానాన్న ఒక్కడే వృత్తిని బట్టుకొని ఉన్నాడు. ఆ కాలంలోనే మీరు ముగ్గురు మూడుతీర్ల పనులను చేపట్టిండ్రు. మరి గిప్పుడు నేను బయటకు పోతనంటె వద్దన వడ్తిరి. మీ కాలంల మనోల్లు భీవండికి, షోలాపూర్‌కు పోతె ఇప్పుడు దుబాయ్‌కి, మస్కట్‌కు పోతండ్రు. పెద్ద పెద్ద వ్యాపారాలు చేసెటో ల్లకే ఊళ్ళె దిక్కులేకుంటయిపెయిందంటె ఇగ మనలనెవ్వలడిగిండ్రు? మిల్లుబట్టలచ్చి మనసొంటివాళ్ళ వృత్తులను దెబ్బగొట్టె. మరి నేనేం జేసిబతుకన్నో చెప్పుండ్రి! అది లాబాదు దిక్కు పోయన్న బతుకుదామంటె అక్కడ మునుపటితీరుగ బ్యారాలు నడుత్త లేకపాయె. నాకేమొ చదువబ్బక పాయె. నాయన మా చదువుల మీద శ్రద్ధజెయ్యక పాయె. ఆస్తులు లేకపాయె. పనులు అంతంతమాత్రమేనాయె. మరి నేనిక్కడేం జెయ్యాలె? చేసిన పనే చేసుకుంట బతుకు డయితదా? రోజురోజుకు వృత్తిని నమ్ముకొ న్నోల్ల బతుకులు అధ్వాన్నమవుడు మీరు సూత్తలేరా చినబాపు మీకు తెలువందే ముంది? అన్నీ తెలిసిన మీరే గిట్లంటె ట్లన్న?" అన్నాడు రాజేశం

"అవును రాజేశం చెప్పిందీ నిజమే."

"ఏం నిజంరా శంకరన్న! పెద్దమనిషి పేరంటం బిలిత్తె గిద్దెడు పసుపు రాసుకున్న దన్నట్టు చెప్పవడితివి. పొల్లగాన్ని పోకుంట జెయ్యమంటె వాడన్నది గూడ నిజమేననవ డ్తివి."

వీరయ్య మాటలకు నవ్వాడు శంకరయ్య.

"అన్నా! మన రాజేశం చిన్నపిల్లవాడా న్నా యువకుడయ్యాడు. మంచీచెడు తెలియదని మనం చెబుదామనా? పోతే వాళ్ళది ఈతరం మనల్ని ఓతరం వెనక్కినెట్టి వచ్చి నవాళ్ళు ఈ తరం వాళ్ళు."

"శంకరన్నా! ఇప్పుడు గా పెద్దపెద్ద మాట లెందుకురా? రాజేశంకు సముదాయించి చెప్పు." అన్నాడు చిప్పమల్లయ్య.

"రాజేశం వాళ్ళు పోయిండ్రు. వీళ్ళు పోయిండ్రని ఏవేవో చెప్పవడ్తివి. పెద్దనా యన భీవండికి పోయి ఏం సాధించిండో చెప్పు. మమ్ములనందరిని దుఃఖంల ముంచిపాయె. గా సాంచల మీద పనిజేసి నోల్లు చాలామందికి ఆరోగ్యం పాడాయె భీవండికి పోయినోల్లు చాలామందికి ఆరోగ్యం పాడాయె. భీవండికి పోయినోల్లు ఏం బాముకున్నరని గంత దూరం పోతన నవడ్తివి. మీ నాయిన్నవ్వ అన్నపోయినంక మనిషయిందా? తాత మనిషయిండా? వద్దు బిడ్డా మనకు బైటికి పోవుడు అచ్చి రాదు" అన్నాడు వీరయ్య.

"వద్దు కొడుకా...! ఈ ఇంటికి పెద్దకొ డుకు, నాకు తలకొరివి పెట్టవలసినోడు నడుమంత్రపు సావుజచ్చె. వానికి నేను తల కొరివి పెట్టవలసచ్చె. గివ్వన్ని తెలిసిగూడ బైటికి పోతననవడ్తివి."

వృద్ధుడైన చిప్ప మల్లయ్య కండ్లముందు

రాజమల్లు రూపం కదిలి వలవలా ఏడుస్తు న్నాడు. ఆ ఏడ్పుకు రాజేశం హృదయమూ కరిగిపోతోంది. కాని ఎన్ని చెప్పినా ఎవరేం చేసినా తన నిర్ణయాన్ని మార్చుకోదలచుకో లేదు రాజేశం.

"నాన్నా! గిప్పుడెందుకు అన్నను యాది చేసుకున్నవే. ఊకో ఊకో రాజేశంకు సర్దిచె ప్పుదాం" అన్నాడు వీరయ్య.

తండ్రిని ఓదార్చే ప్రయత్నం చేస్తున్నాడు. అయినా మల్లయ్య ఏడుస్తూనే ఉన్నాడు. కొడుకు జ్ఞాపకం వచ్చేసరికి దుఃఖం కట్టలు తెంచుకొని బయటకొస్తుంది. దాన్ని ఆపడం ఎవరితరమూ కావడంలేదు. కొద్దిసేపేడ్చి ఉపశమనం పొందాడు మల్లయ్య.

"గా మరాటదేశంల ఏమైందో ఎరికేనా కొడుక! మీ పెద్దనాయన బతుకవోయిన ఆర్నెల్లకే లొల్లులు మొదలైనాయి. ఏం లొల్లులో ఏమో! గా లొల్లులు మొదలైనంక రైల్లల్ల వడి ఎటోల్లటు ఊళ్ళకు వెళ్ళారట. మీ పెద్దనాయనగూడ గా దేశమిడిసి ఎల్లిపోదా మని రైలు టేషన్‌కు ఉరికత్తుండట. ఒగలను వట్టకుంట ఒగలువచ్చుడాయె అట్ల ఊరికచ్చి నోల్లల్ల ఊల్లు చేరుకున్నోల్లు తక్కువే. రాజ మల్లు తొవ్వలనే వాళ్ళకు దొరికిండట. కత్తి పోట్లకు గురయిండు. అది మన దేశంలున్న స్థలమేకదు! ఇక్కన్నే గిట్లయిందంటే నువ్వు దేశమే విడిచి పోతననవడ్తివి." అన్నాడు.

అక్కడే ఉన్న లచ్చవ్వకు ఇది జ్ఞాపకం వచ్చి కంటనీరు తీసుకుంది.

"నిజమేరా రాజేశం! అప్పుడు ఘోరమైన కొట్లాటలయినయి. కత్తిపోట్లయినయి. రేడియో వార్తల్లో, వార్తా పత్రికల్లో అక్కడి సంగతులు తెలుసుకొని ఆందోళనపడ్డాం. అన్నయ్య ఎప్పుడొస్తాడోనని ఎదిరిచూడ టమే చూడటం. తర్వాత వార్తలు విని ఎవ్వరం మనుషులం కాలేదు.

ఎంతయినా దేశంకాని దేశంలో రాజ్యం కాని రాజ్యంలో బతకడం కొంత కష్టమే. అందుకే జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ అన్నారు. అక్కడ పనిచేసేవా ళ్ళతో ఏమైనా పొందడానికేకదా వేరే దేశస్థులకు ఉద్యోగాలిచ్చేది ఉన్నచోట కొంత తక్కువైనా మంచిదే."

"నేను మాత్రం ఎప్పటికి అక్కన్నే ఉంట నంటున్నానె చిన్న బాపు? ఉన్నన్ని రోజు లుంట. నాలుగు పైసలు సంపాయించుకొని తిరిగత్త అక్కన్నే ఎందుకుంట చెప్పు? ఇక్కడ పరిస్థితులెట్లున్నయో మీకు తెలువ నియా? పెద్దపెద్ద సదువులు సదివినోల్లే రోడ్ల పొంటి తిరుగుతుండ్రంటె నా అసోం టాన్ని ఎవ్వలడిగిండ్రు చెప్పు? నాకిక్కడ సరిగ్గ పని దొరకదనే కద పోతననుడు ఇక్కడ పని సేతినిండున్నంక నేనెందుకు పోత చెప్పు" అన్నాడు రాజేశం.

"అక్కడికి పోయి నువ్వు చేసే పనేంది? కూలి పనేకద! గా పని గిక్కడ చేసుకో రాదా? "

"ఇక్కడ కూలెంతిస్తరు? ఇక్కడి కూలి తోని ఆరు రెట్లెక్కువ అక్కడిత్తరు కొంత ఖర్చులకు, ఇండ్లకు పోయినా ఇంకొంతన యితే మిగుల్తదిగద! దుబాయికిపోయి పైసలు పంపిస్తుంటె చిలుక రాజయ్య పొలాలు కొంటున్నాడా లేదా? మన్నె పోల్లండ్ల చాలామంది అటుపోయింండ్రు గద... ఎవ్వలు పోనట్టు నేనే మొదటోన్న యినట్టు మాట్లాడవడ్తిరేంది? ఊర్నే పట్టు కోనుండాలె కదులద్దంటేమన్నట్టు? ఊర్నే పట్టుకోనుండటానికి మనకేమన్న భూములా? ఆస్తులా? లేకుంటే సర్కారు నౌకరుందా? రెక్కల కష్టంతోని బతికెటో నికి ఊరైనా ఏ పట్నమైనా ఏం ఫరకు పడుతది? ఇంతవరకు రాష్ట్రాలు వదిలి పెట్టిపోయెటోల్లు గిప్పుడేమొ దేశాలే వదిలి పెట్టి పోతున్నరు. బతుకుటానికి ఊరిడిసి

✤ కార్యసాధకుడు దూషణ, భూషణ తిరస్కారములకు అతీతుడు కావాలి.

– భాగవతమ్

పోతె తప్పేముందట? ఏమైతదట పోతె అందరు కలిసి నాకెందుకు పిరికిమందు పోత్తరు" అన్నాడు రాజేశం.

"పిరికిమందు కాదు బిడ్డా! మా బాధ మాది- మా కడుపుకోతమాది. గా ఎడార్ల, ఇసుకల దేశంగాని దేశంల తురుక రాజ్జెంల బతుకుతననవడ్తివి ఎందుకు చెప్పు? గక్కడ చచ్చినచావెరుగరు బతికిన బతుకెరుగరు అక్కడుంటె పట్టించుకున్నాల్లెవ్వలు? " అంది లక్ష్మి.

"అవ్వా! గట్టనుకుంటెట్లనే? అది దేశం గాదా? అక్కడ మనుషుల్లేరా? ఏదేదో ఊహించుకొని భయపడితెట్ల? ధైర్యం చేయకుంటె ఎట్ల బతుకుతామో చెప్పు? ఇప్పుడు మునుపటితీరుగ వృత్తిపనితోనే బతుకన్నంటె అయితదా? ఇక్కడ చేతినిండ పనున్నంక, ఆదాయ మున్నంక నేనెందుకు పోతనంట చెప్పు? అందర్ని విడిచిపెట్టి మనదిగాని దేశంలో ఉండాలని నాకేమన్న షోకా? బతుకుదెరువు కోసమే కదా? " అన్నాడు రాజేశం.

"తాతా! చిన్న బాపూ! నాయనా! అవ్వా! అన్న ఏం తప్పు చేస్తలేడు. అవునుమరి అందరం ఇక్కడ మన పనితోని బతకడం కష్టం అక్కడికో రెండు మూడేండ్లు పోయొస్తె ఆర్థికంగా కొంత బలపడవచ్చు అన్నను పోనియ్యిండ్రి అడ్డుపుల్ల లేయకండ్రి." ఆ మాటలకు గఁయ్‌మని లేచాడు వీరయ్య.

"నీకేం తెలుసని మాట్లాడ్తున్నవురా లక్ష్మి రాజం! అన్న బహద్దూర్ పని సేత్తున్నడని చెప్పవడ్తివి. పైసలు సంపాయించుకు రావడానికే కద పోవుడు. అందర్ని విడిచిపెట్టి పోయి నానా పుల్లెందలు వడుకుంట పైసలు సంపాయించకుంటె మానాయె మా నాయిన పనిజేసుకొని నేను బతుకుతున్ననా? నా పనితోని మీరు బతుకుండ్రి." అన్నాడు.

"అనంటె అయిపోతదాయె నాయిన మీ తీరుగ బతికే కాలమున్నదా ఇప్పుడు కాలాన్నిబట్టి మారకుండా అదే తీరుగ బతుకుతనంటె ఎట్ల నడుత్తది? ఆ పనితోని కడుపు నిండకున్నా బతుకుతమా చెప్పు? ఆదిలాబాదు దిక్కు పోదామన్నా అటుదిక్కు బేరాలు మునుపటితీరుగ లెవ్వు. నువ్వు, తమ్ముడు చేసుటానికైన మన పనిల చోటుందా? అన్నీ తెలిసిగూడ ఎందుకు మాట్లాడుతరు? "

"మాట్లాడటానికేముంది? ఇంత పొడుగు మా మాట్లాడవచ్చు ఇంతకాలం బతుకలేదా మేం? ఏదో సంపాయించుతమని ఊరుకులాడ వడ్తివి. అందరిని వదిలిపెట్టి పోతననవడ్తివి. ఇదంత పైసమీద భ్రమతోని కాదా? ఇగో, ఒకల ననేదేముంది? రోజు రోజుకు మనిషికి పైసమీద భ్రమలు పెరుగుతున్నాయి. అందుకోసం ఊర్ని, కన్నోల్లను అందర్ని విడిచిపెట్టి పోవుటానికి గూడ వెనుకకత్తలేరు. నీకు మేమేమద్దు పెయిలే కావాలంటె పో" అన్నాడు కన్నీళ్లతో మల్లయ్య.

"తాతా! దయచేసి నన్నర్థం చేసుకోండి. నేనేదో సుఖపడుటానికో, బాధ్యతల నుండి తప్పించుకునుటానికో పోతనంటలేను. కుటుంబ భవిష్యత్తు కోసమే పోతనంటున్నాను. పెదనాన్న కొడుకు శ్రీరాం బాగా చదువుకుంటున్నాడు. రేపోమాపో అయితే అన్న ఇంజినీరైతడు. చిన్నాన్న కొడుకులను ఎంతంటంత చదివిస్తడు. వాళ్ళూ మన స్థితిని దాటిపోతరు. ఇక మన కుటుంబంలో మిగిలిందెవరు? మేమేకదా! నాన్న మమ్మల్ని బడికి తోలినా మాకెందుకో చదువబ్బలేదు. ఏదైనా చేసి కొంతయినా సంపాదించుకోకపోతే బతకడం కష్టం. ఇప్పుడు చేస్తున్న పనిలో అది సాధ్యంకాదు. ఇక్కడ కూలినాలి చేసినా కడుపునిండుడు కష్టం. అక్కడైతే ఏ పనిచేసినా చూసేవాళ్ళుండరు. ఆదాయమూ కొంత నయమే కదా! ఇన్ని ఆలోచించి నేను పోతానంటే మీరేమో నిష్ఠూరాలు మాట్లాడవడ్తిరి."

రాజేశం వాదంలో వాస్తవాలున్నట్టు

వాళ్ళందరికీ అర్థమవుతుంది. కాని అవునన డానికి ఎవరికీ మనసొప్పడం లేదు.

"నువ్వెన్ని చెప్పినా డబ్బుకోసం జన్మభూమిని వదిలిపెట్టి పోవడమే అవుతుంది కదా రాజేశం ఇది" అన్నాడు శంకరయ్య.

"చిన్నాన్నా! బతకడం కోసం వేరే దేశానికి కొంతకాలం కోసం పోయినంత మాత్రాన దేశంమీద ప్రేమ లేనట్టా? దేశభక్తి లేనట్టా? చిన్నాన్నా! ఇంక కొన్నేండ్లకు సురేష్నో, రమేష్నో అమెరికాకు పంపవలసి వచ్చిందనుకోండ్రి పంపరా మీరు? దేశమని ఇక్కన్నే ఉంచుతరా? "

రాజేశం మాటలు సూటిగా తగిలాయి శంకరయ్యకు. అవును! అలాంటి పరిస్థితి వస్తే తానేం చేస్తాడు? కొడుకును అమెరికాకు పంపకుండా ఉంటాడా? అభివృద్ధి కోసం, జీవితాలను గెలుచుకోవడం కోసం దేశాన్ని వదలడం తప్పుకాదని వాదించే తాను రాజేశం విషయంలో ఎందుకలా అన్నాడు? తండ్రిని, అన్నయ్యను బాధించ కూడదని అన్నాడా? తనే కొడుకయితే ఓ పద్ధతి అన్న కొడుకైతే మరోటా? తనలో ఈ ద్వైధీ భావమేంటి?

తనను తానే ప్రశ్నించుకుంటున్నాడు శంకరయ్య.

"రాజేశం! నీ తర్కంలో ఎన్నో వాస్తవాలు న్నాయి. ఈ పరిస్థితుల్లో నువ్వు పోతానన డమూ సరైందే కాని అన్నయ్య, నాన్న తమకు జన్మతః వచ్చిన ప్రేమానురాగాలను వదులుకోలేదు వాళ్ళ పల్లె మనస్తత్వాన్నీ వదులుకోలేదు అందుకే ఈ ఆందోళన" అన్నాడు.

"అక్కడ విపరీతంగా వేడి ఉంటుందట. కూరగాయలు దొరుకుడు కష్టమట. రోజూ మాంసమట. ఇవన్ని నీకు పడతయా? "

"అక్కడి వాతావరణాన్నిబట్టి, అక్కడ దొరికే వస్తువులనుబట్టి తిండయినా బట్టలయినా ఉంటాయి మహారాష్ట్రల రొట్టెలు తింటరు. మనోల్లు రొట్టెలు తినుడు తక్కువగద! ఈన్నుంచి పెయినోల్లు అలువాట యింద్రా కాలేదా? ఎక్కడికిపోతే అక్కడ తిండ్లు అలువాటయితయి. బతుకటానికి పోయినపుడు అక్కడ వాటితోని సర్దుకపోవాలె గద."

"అది కాదు బిడ్డా! ఏండ్ల కేండ్లు చూడకుండ ఉండుడెందుకు? " 'అవ్వా! పోయేవేటకే.. దూర ప్రదేశమన్నట్టు కని బతుకుటానికేకద నౌకర్లు చేసెటోల్లున్నరు ఎక్కడెక్కన్నో చదువుకునెటోల్లున్నారు. వాళ్ల ఇంటికి దూరంగ ఉన్నట్టే కదా? మునుపటి తీరుగరోజులకు రోజులు ప్రయాణమేముండదిగద! ఇగ దూరమేడిది? దగ్గరేడిది? బొంబయిల విమానంల కూసుంటే అక్కడ దిగుడేనాయె."

రాజేశం అన్నిటికీ సిద్ధమయి పోవడానికి ప్రయత్నిస్తున్నాడని వాళ్ళకర్థమవుతూనే ఉంది.

"చిన్నాన్నా! తాతా! ఊళ్ళె బతుకుదెరువు లేదు మొదటున్నుంచి మనకు అవమానాలు తప్పుత లెవ్వు. అయినాగని ఊరు మీద గంతనమ్మక మెందుకు? గా కుర్మమల్లయ్యను అందరు దొంగ మల్లిగాడని పిల్చెటోల్లు. మస్కట్‌కు పోయి కొంత సంపాయించుకుతెచ్చిండు. ఇంతంత భూమి కొన్నడు ఇప్పుడు మస్కట్ మల్లయ్యంటండ్రు. గౌరవం పొందుతాడు. ఓ తీరుగుంటే మల్లిగాడే మల్లయ్య అయిండు గదా! నేను పోవుడు మనకోసమే"

కొడుకు మాటల్లో సబబున్నా లక్ష్మికి మనసొప్పడం లేదు. "ఆగో గట్లుంటవేంది బిడ్డ! ఊరంటె కన్నతల్లసొంటిది. ఎలుకలున్నయని ఇల్లు కాలవెట్టుకుంటామా చెప్పు. ఎప్పుడో ఏదో అవమానాలు జరిగినయని ఊర్నే విడిచిపెట్టి పోతమా? "అంది మొత్తుకుంటున్నట్టుగా.

"ఏందే అవ్వ మల్లగట్లనే అంటవు. మన కేముంది చెప్పు ఊళ్ళె ఆస్తులా? అధికారాలా? అవమానాలు తప్ప ఏమున్నయి?

కులంపేరు మీద తాత ఎన్ని అవమానాలు పొందాడు? నాన్న, చిన్నాన్నలు మాత్తరం పొందలేదా? ఏమిచ్చింది మనకూరు? ఊరూరనుకుంట ఉంటె ఎట్ట బతుకుతం? ఎక్కడ బతుకుదెరువుంటె గదే మనూరు. ఊరో ఉరని పట్టుకేడిత్తె చిప్పలే మిగుల్తయి ఎన్నిసార్ల మొత్తుకున్నా మల్లగదే మాటంట రెందుకు ఊరూర. తండ్లాడుతరెందుకు? మనకూల్లె ఏం మిగిలిందో సెప్పుండ్రి? " అన్నాడు రాజేశం.

ఆ మాటలు ఆలోచనాత్మకంగా, లోతుగా కనబడ్డాయి శంకరయ్యకు. అవసరాలు పరిస్థితులు తన అన్న కొడుకుతో అంత లోతుగా మాట్లాడి స్తున్నాయన్న విషయం ఆతడర్థం చేసుకున్నాడు. కాని, రాజేశం వాదనలో ఏదో ఎక్కడో లోపమున్నట్టు కన బడుతుంది. అదే వివరించి చెప్పాలనుకు న్నాడు. ఆతడు ఊరు విడిచిపోతాననడం చిత్రమేంలేకున్నా మంచి బతుకు పేరుమీద ఊళ్ళను అవలీలగా వదలడం సరైందేనా అన్న ప్రశ్న శంకరయ్యను వేధిస్తుంది. రేపు తన కొడుకులూ మంచి జీవితమని దేశాన్నే వదిలిపోతే తండ్రిగా తాను భరించగలడా? ఊళ్ళో కదలకుండా ఉంటే అభివృద్ధి చెంది నట్టు కాదని వాదించాడు తాను కాని ఊరొ దిలితేనే అభివృద్ధి అవుతుందా? శంకర యలో అనేక ప్రశ్నలు.

"రాజేశం! ప్రపంచ వ్యాప్తంగా జరిగినట్టే మనదేశంలోనూ జరిగింది. పారిశ్రామిక విప్లవం జరిగిన తర్వాత యంత్రాల ఉప యోగం పెరిగింది. పదిమంది మనుషులు చేసే పనిని ఒక యంత్రం చేయడం మొద లైంది. ఇలా తొమ్మిదిమంది నిరాశ్రయులై నట్టే కదా! ఇలా అన్ని సాంప్రదాయ వృత్తులు నశించిపోయే ప్రమాదం ఏర్ప డింది. అయితే జన సాంద్రత తక్కువగా ఉన్న చలిదేశాల్లో యంత్రాలు వాడినా అర్థ ముంది. దాంతో సత్ఫలితాలే వచ్చాయి. జనం తక్కువ కాబట్టి యంత్రాల వాడ కంతో మనదేశంలోలా సమస్యలు రాలేదు. ఎక్కువ జనసాంద్రత, కూలీలను బట్టి వృత్తులున్న ప్రత్యేక పరిస్థితులున్న మనదే శంలో పారిశ్రామికీకరణ, యంత్రాల ఉప యోగం లాంటివి పెద్ద సంక్షోభాన్నే లేపాయి. క్రమక్రమంగా సాంప్రదాయ వృత్తులున్నా నశిస్తున్నాయి. చెప్పు ఉంగటం, గూటం అంటేందో తెలియని వా డు చెప్పుల దుకాణాల యజమాని అవుతు న్నాడు. హాయిగా కౌంటర్ మీద కూర్చుం టున్నాడు. కండె, నాడి, షం అంటే తెలియ కున్నా బట్టల మిల్లులకు, దుకాణాలకు యాజమానవుతున్నాడు. తరతరాలుగా ఆయా వృత్తుల్లో బతికే వాళ్లు కులవృత్తు లను కోల్పోతున్నారు. ప్లాస్టిక్ వాడకం పెరి గిన తర్వాత కుమ్మరిసారె మూలకు పడ్డట్టే చాలా వృత్తుల విషయల్లో జరుగుతుంది. అందులో భాగమే మన చేనేత. నేత పరిశ్ర మలు కుంటుబడటం' వలసల పేర్లమీద ఊళ్ళొదిలి పోవడం' యంత్రంపై నేచే బట్ట ల్లోని నిగనిగలు మన బట్టల్లో ఉండవు కదా! అలాగే ఇతర వృత్తుల ఉత్పత్తులు! అందుకే ఈ సంక్షోభం. అయితే ఈ దుర్మా ర్గంలో ప్రకృతి సిద్ధంగా వచ్చేవాటిని వినా శనం చేయడముంది. ఇదెక్కడికి దారితీ స్తుందో తెలియదు" అన్నాడు శంకరయ్య. అతనివైపు విస్ఫారిత నేత్రాలతో చూస్తున్నా రందరూ.

మనకు తెలియదు కాని మనదేశంలో లేదా ప్రాంతంలో వృత్తులు నశించిన వాళ్ళలో చాలామంది వ్యవసాయ కూలీ లుగా మారారు. ప్రతికులం లేదా వృత్తి వారు ముఖ్యంగా గ్రామాల్లో చిన్న వ్యవసా యదారుడుగానో, వ్యవసాయ కూలీగానో మారడంవల్ల జరిగిన నష్టమూ అధికమే! ఊళ్ళలో అదొక్కటే వృత్తన్నట్టు మొదల యింది. దాంతో ఆ వృత్తికే గ్రహణం పట్టి నట్టవుతుంది. పోతే ప్రభుత్వాలు పారిశ్రామి కీకరణ పేరుమీద హడావుడి చేయడం

తప్ప వ్యవసాయాన్ని ప్రోత్సహించింది తక్కువ. కొనబోతే కొరివి అమ్మబోతే అడవి లాంటి పరిస్థితుల వల్ల వ్యవసాయాలూ దెబ్బతింటున్నాయి. ఇందులోకే యంత్రాలు రావడం వల్ల ఈ పనిని చేపట్టిన కోట్లాది మంది వృత్తులను కోల్పోతున్నారు. దాంతో వ్యవసాయపనులు చేసేవాళ్ళు కూడా బావి పనులకు, ఇతరత్రా వలసలు పోక తప్పడం లేదు. వ్యవసాయంలో ఇతర సాంప్రదాయ వృత్తులలో మంచి ఆదాయముంటే, కూడబెట్టగలిగే వసతుంటే చదువుకున్న వాళ్ళయినా పొట్టలు చేతబట్టుకొని ఊళ్ళొదిలి ఎందుకు పోతారు? వందల్లో లభించే అటెండర్ ఉద్యోగానికి కూడా భూములు వదలిపెట్టి పోతున్నారు ఐదెకరాల భూమున్న రైతుకు కూడా ఓ చిరుద్యోగికి వచ్చే ఆదాయం రావడం లేదు. చిన్న ఉద్యోగం కోసం వందలాది మైళ్ళు దాటిపోతున్నారు.

ఏదేమైనా విలువిద్యలెన్ని నేర్చిన కులవిద్యకు సాటిరాదు అనే పరిస్థితులిప్పుడేం లేవు. అందుకే ఈ సంక్షోభం. అయితే భవిష్యత్తులో ఇప్పుడున్న ఈ ఊళ్ళొదిలే ఊపు తగ్గవచ్చు. వెనుకకకు చూసుకోవాల్సిన పరిస్థితులు రావచ్చు. గ్రామాలకు తరలాల్సి రావచ్చు. అట్లని ఇప్పుడు ఎప్పుడూ కులవృత్తులు చేసుకుంటూ అభివృద్ధి నిరోధకంగా బతుకమని నేను చెప్పడం లేదు. కాని ఊరంటే ఏముందన్నావు చూడు రాజేశం! ఊరంటే మన చిరునామా! చిప్పవాళ్ళ వంశం ఫలానా ఊళ్లో ఉందని చెప్పుకుంటారు. ఫలానా వాళ్ళూ పైకొచ్చారని చెప్పుకుంటారు. పట్టణాల్లో ఏముంది చెప్పు? అందుకే నేనీ ఊళ్లో ఉండే ఉద్యోగం చేస్తున్నాను ఊరు చుట్టున్న ఊళ్ళలో పెనవేసుకునే అవకాశముంది కాబట్టి నాకిదో మంచి అవకాశమైంది. రాజేశం! ఏదేమైనా ఊళ్ళకూ, భూములకూ, వ్యవసాయలకూ ఆ తర్వాత వృత్తి పనులకూ భవిష్యత్తులో విలువవచ్చే అవకాశాలు ఉన్నాయి.

శంకరయ్య చెప్పిన మాటల్లో ఎన్నో విషయాలున్నట్టు గమనించారు వాళ్ళు. తన కొడుకు పుస్తకాలతో పాటు లోకాన్ని చదవడం చిప్పమల్లయ్య కెంతో ఆనందంగా ఉంది. ఇరువర్గాల్లో ఎవరినీ సమర్థించకుండా లోకం పోకడల గూర్చి సవివరంగా చెప్పిన శంకరయ్యను ప్రశంసా పూర్వకంగా చూస్తున్నారు వాళ్ళంతా. లక్ష్మీరాజం, రాజేశమైతే అతన్ని ఆరాధనా పూర్వకంగా చూస్తున్నారు.

"చిన్నాన్నా! ఇన్ని తెలిసిన మీరు నన్ను వద్దంటారెందుకు? నేను పోతానంటున్నది కుటుంబం కోసమే కదా! బతుకుదెరువు కోసమే కదా! ఇది కూడా ఉద్యోగాల కోసం చదువుకున్నోళ్లు దూరప్రదేశాలను పోవుడసొంటిది అనుకుంటయిపోతదిగద? " అన్నాడు రాజేశం.

"అదీ ఇది ఒక్కటెట్లయితది బిడ్డా! అది గౌరవంగ ఉద్యోగానికి పోవడమె ఇదేమో కూలిపనికి పోవుడాయె నువ్వు నౌకరికి పోతలేవు కూలికిపోతున్నవు. దీంట్ల పనిభారమెక్కువ. పైసలు తక్కువ. ఆరోగ్యాలు పాడయితయి. ఎంతమందిని చూస్తలేం" అన్నాడు వీరయ్య.

"మనకు దొరికేదంతేమరి! అంత దూరం పిలిచి కూచుండబెట్టి జీతమిత్తడా వాడు? పనెట్లయినుంటది? ఐదు రూపాయల పని తీసుకొని రెండు రూపాయలిత్తడు. ఇదున్నదేనాయె ఇందులో కొత్తవిషయమేముంది? నాకింతకంటె మంచి పనేం దొరుకుతది? సరే పనిజేసినా నాలుగు పైసలైతే మిగుల్తయిగద!" అన్నాడు రాజేశం.

"అన్నిటికి సమాధానాలు చెప్పటానికి తయారు చేసుకోనున్నవని మా ఎరికే! అటు దిక్కు ఆడొల్ల దిక్కు సూత్తెనే నరుకుతరట కద. సినిమాలు గూడ ఉండయట. మన తిండి గాకపాయె. మన నీల్లుగాకపాయె. గక్కడికి పోకుంటేంది? "

"తాతా! నాయినా మీరేం బాధపడకుండ్రి ఏవేవో అనుమానాలు పెట్టుకోకుండ్రి మనం విన్నయన్ని నిజాలు కావు కొంత కష్ట ముంటె ఉండచ్చు కాని దాన్ని పెద్దగ ఊహిం చుకునుడు వద్దు. గంత భయకరంగ ఉంటె అక్కడికి ఎందుకుపోతారో చెప్పు. మరాడికి పోయినోల్లు మనుషులు గారా? వాళ్ళంత బతుకుతలేరా? పైసలు సంపాయించుకత్త లేరా? ఎంతమంది పోయింర్రు? గా పైస లతో భూములు కొనిరి. అంతకుముందు పాలేర్లుండి బతికెటోల్లు ఇప్పుడు స్వంత ఎవు సాలు చేసుకొని బతుకుతాంర్రు.

ఇదివరకటి రైతులు, దొరలు కొందరు భూములమ్ముకుంటుంటే దుబాయికి పోయి నట్లు, సింగరేణి బాయిల్లకు పోయినట్లు భూములు కొంటున్నారు. భీవండికి పోయి నట్లు సంపాయించిందేం లేదు కాని వీళ్ళ యితే మా సంపాయించింర్రు. అవ్వా! అన వసరంగా ఏడ్వకు నువ్వు! నేను మన మంచి కోసమే పోతనంటున్న" అన్నాడు రాజేశం.

"వాళ్ళదేముంది? మోటుకష్టం చేసి నోల్లు. పాలేర్లుగ, వ్యవసాయ కూలీలుగ పనిజేసినోల్లు. వాళ్ళకు దుబాయ్‌లనయినా, ఇక్కన్నయినా ఆ పనులో లెక్కకు రావు నువ్వట్ల కాదుగద! బరువు పనులు చేసి నవా మరి! గాల్లతోని పోల్చుకోవద్దివి."

"అయితేంది నాయనా! ఏదో పనిల కష్ట పడి బతికినప్పుడు ఇంకో పనిల కష్టపడితేం గాదు. మనమేమన్న కూసుండి తిని బతికి నోల్లమా? పూటపూటకు కష్టపడుకుంట బతుకుడు కంటె తిండిదొరికే ఇంకొంచెం కష్టమైన పనిజేత్తేం బోతంది? "

"పోనియ్ గాసిరిసిల్ల దిక్కుపోయినా సాంచెలల్ల పనిజేత్తేంబోతంది? దగ్గరున్న ట్టుంటుదిగద.!"

"అక్కడికి పోతె మా బతుకచ్చుకాని ఇన్నన్ని పైసలు సంపాయించుడయితె కష్టమే మరి! కులం జెడ్డా సుఖం దక్కాల న్నట్టు ఎట్లయిన ఊరిడిసి పోయినప్పుడు ఇన్నన్ని సంపాయించుకునే ఉపాయం జూసుకుంటె మంచిదిగాదా? "

"మరి నీ లగ్గమో బిడ్డ"

"రొండేండ్లయినంక ఇన్నన్ని పైసలు వట్టు కోనత్త- అప్పద్దాక లగ్నం లేదు మొగ్గం లేదు."

"ఏందో బిడ్డ మీరేమన్న చెప్పుతె వినెటు ట్టున్నరా? "

"నాన్నా! రాజేశం అన్ని విధాలుగా ఆలో చించే ఈ నిర్ణయం తీసుకున్నాడు వాన్ని ఆపకుండ్రి. సిరిసిల్ల ఒకప్పుడు నేత పరిశ్ర మకు ప్రసిద్ధి. ఇప్పుడు మరమగ్గాల పరిశ్ర మకు ప్రసిద్ధి. దేశవాళీ పరిశ్రమలన్నీ, వృత్తులన్నీ తీవ్ర సంక్షోభంలోకి నెట్టబడుతు న్నాయి. అలాంటప్పుడు మనలో చలనం లేకుంటే బతకడమే కష్టమవుతుంది. ఇదే చేస్తానని కూచుంటే మనుగడే కష్టమవు తుంది. రాజేశం విదేశాలకెళ్ళి డబ్బు సంపా దించుకొస్తానంటున్నాడు. పోనియింర్రి కొంత డబ్బు సంపాదించుకొని తిరిగొస్తాడు ఆ తర్వాత చూద్దాం." అన్నాడు శంక రయ్య.

"నాన్నా ఓ నాన్నా!" పిలిచాడు లక్ష్మి రాజం.

"ఏంది బిడ్డా! ఏదో చెప్పటానికి ఎనుకా ముందయితున్నవు ఏందో చెప్పలేవు నా దగ్గర దాసుడెందుకు? " అన్నాడు వీరయ్య.

"నాన్నా! తాత పూర్తిగ ముసలోడ యిండు. పెద్దమ్మ దగ్గెరుంటున్నడు శ్రీరా మన్నయ్య ఇంజనీరయిండు. నౌకరి దొరి కింది. అన్న దుబాయ్‌కి పోయి పైసలు సంపాయించుకుంటున్నడు. నువ్వు తాత వారసత్వాన్ని ముందుకు తీసుకపోతున్నవు. చేనేత బట్టలు కాకుంటే నవారు నేసుకుంట బతుకుతున్నవు. ఇగ అందరు ఏదో తీరుగ కుదురుకున్నట్టే. చిన్నాయిన్న కొడుకుల కేంది పెద్దపెద్ద చదువులు చదువుతుంర్రు.. మిగిలిందెవ్వలు? నేనొక్కన్నేకద! తాత

కాలం, నీ కాలం ఎట్లనో గడిచిపోయింది.. పోతండి ఈ పనితోనే నన్ను బతుకుమంటె అదయితె సాధ్యంగాదు. నీ వారసత్వాన్ని నేను మోస్త కాదంటలేను. కాని ఇదే పని చేసుకుంట బతుకుమంటె మాత్రం బతుక. ఈ పనితోని తాతేం బామూకున్నడు? నువ్వేం బామూకున్నవు? నన్నూ అదే పనిని పట్టుకొని వేలాడమంటె మాత్రం నానుంచి గాదు. నాకూ ఆలోచించే వయసొచ్చింది. ఏం చేయాలో నిర్ణయం చేసుకున్న"

లక్ష్మిరాజం మాటలను శ్రద్ధగానే విన్నాడు వీరయ్య. "ఏంది బిడ్డా! గట్లంటవు మరి? మన పనితోని మేం బతుకలేదా? బతుకతలేమా? పెద్దగా సంపాదించకపో వచ్చు కాని బట్ట పొట్టకయితే ఢోకా లేకుండా బతుకుతున్నామా? ఒకర్ని దేహీ అనయితే అడగలేదు గద. ఎప్పుడూ ఏదో అని ఉరుకులాడేకన్న వారసత్వంగా వచ్చిన పనిని చేసుకుంటూ బతకడంలో ఎంత హాయుంది! నీకు పెద్దగా చదువబ్బలేదు. ఈ పనిగాక మరేం చేస్తననుకుంటున్నవో చెప్పు" అన్నాడు.

"ఇప్పుడు మనం చేస్తున్న పని పాత చింతకాయ పచ్చడసోంటిది. బట్టల ఉప యోగంల, నాగరికతల చాలా మార్పులచ్చి నయి. ఇంకా పాతపనే చేసుకుంట ఉంట నంటె నడుత్తదా? ఆ పనితోని మనబతు కులు గొర్రెతోక బెత్తెడన్నట్టే ఉంటయి."

"బెత్తెడో జానెడో ఏదో విధంగ వెళ్ళుతు న్నప్పుడు దాన్నెందుకు విడచిపెట్టాలె. బతు కుదెరువున్న పనులను, పొట్టనేదో మేరకు నింపే పనులను కాదని నువ్వు చేసేదేం టట? చిన్నగ దుకాణం పెట్టుకొని బతుకు దామన్నా మన దగ్గర పెట్టుబళ్ళు లేవు మిల్లుబట్టలు కావాలంటె పెద్ద పెద్ద దుకాండ్లు కరీంనగర్ల ఉన్నయిగదా! మన దగ్గెరెవ్వలు కొంటరో చెప్పు!"

"దుకాణాలు పెట్టె దమ్ము మనకేడుంది నాన్నా! మనం ఈ పనితోని జోరుదారుగ బతికినమంటున్నవు గద! ఏపాటి బతి కినం? నాయినమ్మ కొనియ్యమన్న ఒక్క చీర గూడ కొనియ్యలేకపోయింద్రట మీరు గసోంటి బతుకు మనది."

"అయితె నువ్వేం జేత్తనంటున్నవు? "

"మిల్లు బట్టల్నే మనూల్లె తయారుజెయ్య చ్చంటున్న కాలంతో పాటు నడువచ్చునం టున్న ఊళ్ళె ఉండుకుంటనే ఆ పని చెయ్యచ్చు"

"ఏంది బిడ్డా నువ్వనేది నాకర్థమయిత లేదు."

"మనోల్లు బొంబాయికి, భీవండికి, షోలా పూరుకు పొయ్యి చేస్తున్నదేంటి? సాంచల మీద పనిజేసుడేకద! ఒక్కొక్కలు నాలుగైదు సాంచలమీద పనిజెయ్యచ్చు. అన్నిట్ని చూసుకుంటుండుడేనాయె. దాంతోని కూలి గూడ ఎక్కువ పడుతది. లాభాలు గూడ ఎక్కువత్తయి."

"కూలి పడుడేందో లాభాలు వచ్చుడేందో కని గండ్లెంత కష్టముందో తెలువదార లక్ష్మిరాజం! నాలుగైదు సాంచాలను చూసుడు తెగిపోయిన పోగులనతికేసుడు అండ్లనుంచి వచ్చే దుమ్మును పేల్చుడు ఇవన్ని సేత్తె ఎంత భారం పడుతది? బతి కినకాడికి సాలదా ఏంది? సంపాయించు కుంటున్నది మాసాలు తియ్యి."

"అది కాదు నాన్నా! ఊరందరిది ఒక వాడయితె ఉలిపికట్టెది ఒక దారన్నట్టు మెదిలితేమన్నట్టు. అందరు యంత్రాల వెంట బడుతంటె మనం ఇంకా ఆ మొగ్గం గుంటనో, నమారునో నమ్ముకుంటె బతుకు డెట్ల? మనూరికి బస్సులు లేనప్పుడు కాలి నడకనో, ఎడ్లబండిమీదనో పోయినం బస్సులు వచ్చినంక గూడ గట్లనే పోతమా? పోతె ఎప్పుడు చేరుకుంటం? ఇవ్వన్ని ఆలోచించకుంటెట్లనే నాయిన"

"అయితె నువ్వేం జేత్తనంటవ్వన్న"

"లోకంతో పాటు నడుత్తనంటున్న కాలం తోని నడువాలనుకుంటున్న"

"సరిగ్గజెప్పక గట్ల మరుగునవెట్టి చెప్పవ డితివేంది? నా అనుభవంతోని చెప్పుతన్న నాయిన్న వారసత్వాన్ని తీసుకున్నందుకు నేనేం బాధపడ్తలేను బతికినకాడికి చాలని తృప్తిపడితె సుఖముంటుంది. ఏదో విధంగ కూడుబెడ్తున్న పనిని కాదనుడెందుకు? సరె గని నువ్వేంజేత్తననుకుంటున్నవో సెప్పు? "

"నేనేం వృత్తిని విడిచిపెడ్తనంటలేనే నాయినా! అండ్ల కొంతమార్పు చేస్తనం టున్న. అది కొంచెం లాభసాటి అయ్యేటట్టు చూస్తనంటున్న. అందుకోసం నేను సాంచాలు కొంటనంటున్న"

లక్ష్మిరాజం మాటలతో వీరయ్యకు గుండె గుభేలుమన్నట్టయింది "ఏంది బిడ్డా! ఏమం టున్నవు నువ్వు? సాంచెలు కొనుడంటె ఏందనుకుంటున్నవు? వేలకొద్ది రూపాయలు గావాలె.. అవ్వి నడిపిచ్చుటానికి పెట్టుబ డులు గావాలె అవ్వన్ని ఏన్నుంచి తెత్తవు? "

"మగ్గం నేసుటానికి ఐతలేవా పెట్టుబ డులు? "

"మొగ్గం ఇంట్లున్నదేనాయె. నూలుకు, మాలుకు స్వల్పంగ అవసరమయితయి గివ్వి పెద్ద లెక్కకు రావు.. ఎక్కన్నోకాడ తెచ్చుకో వచ్చు. దీంతోని బాగ లాభాలు రాకపోతె రాకపోవచ్చుకాని ఏదో మేరకు బతుకచ్చు. పెట్టుబడులు కూడ తక్కోనే కద! డబ్బుతో వచ్చే సుఖాలుండకున్నా అప్పులతో వచ్చే దుఃఖాలయితె ఉండయిగదా!"

"ఏం బతుకుడోనే నాయిన! చావకుంట లేవకుంట బతుకుడో బతుకుడా! అగో చిన్నా యిన వత్తుండు చిన్నాయిన నడుగుదాం నేను చేసే పని మంచిదో కాదో..? "

విద్యావంతుడు, సమాజాన్ని చదివిన వాడయిన శంకరయ్యంటే వీరయ్యకు ప్రేమతో పాటు గౌరవమూ ఉంది.

శంకరయ్య వచ్చి అన్న ప్రక్కన కూర్చు న్నాడు. "ఏందిరా లక్ష్మిరాజం ఏమో వాదిం చుకుంటున్నరు? "

"లక్ష్మిరాజం సాంచలు తెస్తనంటున్నడు మీ అన్నేమొ ఎందుకని భయపడ్తున్నడు.. ఇదే వాదం" అంది లక్ష్మి నవ్వుతూ

"అంతేనాయె అన్న!"

"ఉన్నోడు ఉన్నకాడుండక వీడేదో అంటు న్నడు. సాంచెలు పెడుతడట.. ఇంకేదో పెడుతడట. పెట్టుబడులు లేకున్నా అన్ని సేత్తడట"

ఆ మాటలకు నిష్కల్మషంగా నవ్వాడు శంకరయ్య.

"ఎందుకే అన్నావారి మాటలకు నువ్వింత ఆందోళన పడుతన్నవు. వాడేమంటున్నా డని? కాలంతోపాటు నడిచి జీవితాన్ని గెలుచుకుంటానంటున్నాడు. ఉన్నచోటనే ఉండటం వానికిష్టంలేదు వాడు మనకంటె ఓ తరం ముందున్నవాడు నాన్నలా మన తరంలా కదులలేని స్థితిలోనో, గతమే గొప్ప నుకునే స్థితిలోనే ఉండదలుచుకోలేదు వాడు. నాన్న తరంది ఓ స్థితి. మనతరం ఆ తరం ఈ తరానికి వారిధి లాంటిది. మన పిల్లల తరం వేగం తరం. వాళ్ళను ఆపడం ఎందుకు? సమాజంలో ఎన్నో మార్పులొస్తున్నాయి. ఎవరికివారు పైకి రావడానికి కృషిచేస్తున్నారు. పాత ఫ్యూడల్ భావాల సంస్కృతి కొట్టుకుపోతుంది.

ఒకప్పుడు మనలాంటి వాళ్ళకు చదువు కునే అవకాశాలు లభించడమే అపురూపం నన్ను చదివించడానికి నాన్న, మీరంతా ఎంత శ్రమపడ్డారో నాకు తెలుసు. నేను చదువుకున్నాను కాబట్టే నా పిల్లలను ఉన్నత చదువులు చదివించగలుగుతు న్నాను. ఎంతోమంది మనలాంటి వాళ్ళు నిరంతర పోరాటంతో, శ్రమతో జీవితాలను గెలుచుకుంటున్నారు. లక్ష్మిరాజం తనకున్న స్థితికంటె కొంతముందుకుపోయి జీవితాన్ని గెలుచుకొని తన పిల్లల తరానికైనా అన్ని అవకాశాలు కల్పించాలనుకుంటున్నాడు. మరిప్పుడు కూడా అదే పద్ధతిలో ఆ మగ్గాల మీదే బతుకుతామంటే ఎలా?

స్వాతంత్ర్యానంతర కాలపు తరం ఉన్న

అవకాశాలనుపయోగించుకొని వివిధ రంగాల్లో ఎదుగుతున్నారు. ఉద్యోగాలు, సహకార సంఘాలు, మరమగ్గాలు లాంటి వాటిని పట్టుకున్న వాళ్ళు కొంతయినా ఎదిగారు మగ్గం గుంటలకే అంకితమయినవాళ్ళు అలాగే ఉన్నారు నేను వృత్తిని తక్కువ చేయడంలేదు. ఉన్న వాస్తవాలు చెబుతున్నాను. మీరన్నట్టు అలాగే బతుకొచ్చు కాని ఎదుగూ బొదుగూ లేకుండా అలాగే బతకడం లక్ష్మిరాజంకు ఇష్టంలేదు. వాడేం తప్పు చేస్తాననడం లేదు. ముందుకు పోతానంటున్నాడు. కాలానుగుణంగా నడుస్తానంటున్నాడు. ఇది తప్పని నేననుకోను."

అనేక విషయాలు వివరించి చెప్పాడు శంకరయ్య. వాళ్ళంతా ఆ మాటలను శ్రద్ధగా విన్నారు. వాకిట్లో కూర్చొనున్న చిప్పమల్లయ్య వచ్చి మనమని ప్రక్కన కూర్చున్నాడు.

"అది కాదు తమ్మీ! ఉన్నది విడిచిపెట్టుకొని లేని తంటాలు పెట్టుకునుడెందుకు?"

"మళ్ళీ అదేమాటంటా వెందుకన్నయ్యా! ఏపని విషయంలో నైనా కొంత ధైర్యం చేయంది పైకి రావడం కష్టం. కొంత రిస్కు తీసుకోంది ముందుకు పోలేం. మనలాంటి వాళ్ళకు కులం, కుల విద్య ఇచ్చిందేంటి? రకరకాల పేర్లతో మనలను అవమానాలకు, ఆవేదనకు గురిచేశారు కదా! వృత్తిపనులు కడుపునింపకున్నా, వేరే అవకాశాలు వచ్చినా వాటినే పట్టుకొని వేలాడటం మంచిదా?" అన్నాడు శంకరయ్య.

ఇక మాట్లాడక తప్పలేదు చిప్పమల్లయ్యకు.

"శంకరయ్యా నువ్వు గిట్ల మాట్లాడవద్దేందిరా? రైతున్నడు కదా! నాకిండ్లేం వస్తదని వ్యవసాయం చేయలేదనుకో అప్పుడు ప్రజలందరు తినుటానికవుసరమయ్యే ఆహారధాన్యాలు ఏన్నుంచి వస్తయి? అట్లనే మనం నేసే బట్టలు కూడ! ఇవన్నీ సమాజానికి అక్కరకచ్చే పనులు ఇవి చేసుడు బాధ్యతనుకోవాలెగని లాభాలు నష్టాలనుకుంట లెక్కబెడితెట్ల?" అన్నాడు.

తండ్రి దిక్కు విస్మయంగా చూశాడు శంకరయ్య ఎంత గొప్ప విషయాన్ని చెప్పాడు నాన్న! పారిశ్రామికీకరణంతో లాభాలవేటలో పడి తన సామాజిక బాధ్యతను విస్మరిస్తున్నారా సృష్టికర్తలు! ఆ మాయలో పడి కష్టాలను కొనితెచ్చుకుంటున్నారా? తానీ కోణంలోంచి ఆలోచించలేదు ఇక ముందు ఆలోచించాలనుకున్నాడు శంకరయ్య.

"నాన్నా! వాళ్ళు చేయకుంటే మిషిన్లు చేస్తాయి పారిశ్రామికీకరణ వల్ల మనలాంటి వాళ్ళకు లాభమే కాని నష్టంలేదు అని వాదించేవాళ్ళూ ఉన్నారు. పారిశ్రామికీకరణతో కులంతో వచ్చే ఆ సంకుచిత వృత్తి విభజన నుంచి దూరం కావచ్చు ఏముందని అదే పట్టుకొని వేళ్ళాడుతానంటున్నావు. అయినా వ్యవసాయ వృత్తుల సంగతి వేరు. మనది అలాంటిది కాదు. మన వృత్తిలోనే వ్యాపారముంది. వ్యవసాయంలో యంత్రాలు రావడానికి ఇంకొంతకాలం పట్టవచ్చు ఇలాంటికాలంలో మనం ఎటూగాకుండా కూర్చొనుంటే ఉన్నకాడే ఉంటాం" అన్నాడు.

"సిరిసిల్లలో చాలాకాలం క్రిందనే సాంచాలు వచ్చినయి తాతా! వందలకొద్ది మరమగ్గాలచ్చినయి. ఇందులో ఒక్క మనిషి నాలుగైదు సాంచాలు తీసుకోవచ్చు శరీరశ్రమ తక్కువే లాభాలెక్కువ.

సిరిసిల్లల దీంతోని చాలామంది పైకచ్చిండ్రు. అవి బాగ నడుస్తున్నయి. మనమింకా ముహూర్తాలు చూసుకుంట కూర్చుంటె లాభంలేదు."

"ఇప్పుడు బాగ నడుస్తున్నయి కాబట్టి అట్లనిపిస్తుంది కాని ఎప్పటికి గిట్లనే ఉంటదని ఏం నమ్మకం? మరి మనకు పెట్టుబడులు గిట్ట ఎట్లత్తయి? ఏం బట్టి తెస్తరు

✤ మన కనుబొమలపైన ముడతలు ఏర్పడవచ్చు. కానీ అవి మన హృదయంపై మాత్రం ఏర్పడరాదు. స్ఫూర్తికి వృద్ధాప్యం రాకూడదు. – హెర్బర్ట్‌ఎస్. కాన్సన్

మిషిన్లు? ”

“వేల పెట్టుబడులు మన దగ్గర లేనిమాట నిజమేనాన్నా! కొంతమందిమి కలిసి కో ఆప రేటివ్ సొసైటీగా ఏర్పడుతం. కొంచెమంత పెట్టుబడి పెడితె చాలు గవర్నమెంటోల్లే సాంచాలిస్తరు. నూలిస్తరు. వాటిమీద చాల తక్కువ వడ్డీ ఉంటది. మనం తయారు చేసి న బట్టలను అమ్ముటానికి గవర్నమెంట్లో దుకాణాలుంటయి ఇక మనకేం తక్కువ!”

“అన్నీ తెలుసుకొనే ఉన్నవన్నట్టు కదా లక్ష్మిరాజం! అవన్నీ నిజమే కావచ్చు కానీ మీదికి కనబడేటియే మొత్తం గావు. ఇం డ్లేదో ఉన్నట్టనిపిస్తుంది నాకు దుఃఖం. లేనోడు బర్రెను కొన్నట్టయితదేమో కొంచె మంత ఆలోచించుండ్రి.” అన్నాడు చిప్పమ ల్లయ్య.

“అదీ నిజమే నాన్నా! అలా మీకు కనబ డటంలో వింతేం లేదు. కొత్తది ఏది వచ్చినా కొన్ని ఇబ్బందులు కనబడవచ్చు ఉంటాయి కూడా! దాన్నిచూసి భయపడవలసిన పనేం లేదు ఈ పని చేసేవాళ్లకు ప్రభుత్వం నుంచి మంచి రాయితీలున్నాయి. నూలుపై, కరెం టుపై, రుణాలపై సబ్సిడీలున్నాయి. ఇవన్ని టినీ మనమెందుకు ఉపయోగించుకోకూ డదు? ఉన్న అవకాశాలను ఉపయోగించు కొని తెలివిగా పైకి రావాలి లేకుంటే ఎక్కడే సిన గొంగళి అక్కడున్న చందంగానే ఉంటుంది అన్నయ్యా! మీరు భయపడద్దు నాన్నా! లక్ష్మిరాజంను ముందుకు పోని య్యుండ్రి.”

శంకరయ్య చెప్పేసరికి కొంత సానుకూ లత ఏర్పడింది “అంతేనంటావా తమ్మీ!”

“ఇండ్లేం లేదంటావా శంకరయ్యా.” అంది లక్ష్మి.

“సమాజంలో మార్పులనేవి సహజం మార్పును ఆహ్వానించకుంటే ఎలా? ఈ మార్పులే లేకుంటే మనలాంటి వాళ్ళకు చదువు లెక్కడివి? సమాజంలో స్థానమెక్క డిది? ఈ సినిమాలు, బస్సులు, ఈ పారి శ్రామిక సుఖాలెక్కడివి? సమాజం పరి ణామ శీలమైంది గాంధీగారు విదేశాలకు పోయి చదువుకుంటానంటే వాళ్ళ తల్లిదం డ్రులు ఒప్పుకోలేదు. సముద్రం మీద ప్రయాణం చేయడం కూడా పాపమని భావించారు అప్పటి సమాజమలా ఉండేది ఆయన వాళ్ళను ఒప్పించాడు. ఆయన అలాగే ఒకచోటే ఉండి ఉండే మహాత్ముడ య్యుండేవాడా? ఇదీ అలాంటిదే నేను చదు వుకొని ఉద్యోగస్తుడిని అయినందువల్ల నా పిల్లల్ని చదివించగలగుతున్నాను. రేపు వా ళ్ళు దేశమే విడిచిపోతానంటారేమో ఎవరికి తెలుసు? లక్ష్మిరాజం చేస్తున్నాననేది దేశం విడిచి పోవడం కూడా కాదు కదా నాన్నా! ఇది దుఃఖం లేనివాడు బర్రెను కొనుక్కు న్నట్టు కానే కాదు మార్పును ఆహ్వానించడం అభివృద్ధి చెందడం.”

శంకరయ్య దిక్కు ప్రశంసాపూర్వకంగా చూశాడు లక్ష్మిరాజం “అయితే కానియ్యండ్రి నేను వద్దంటె మాత్రం ఊర్కునెటట్టున్నరా? అభివృద్ధి చెందుతనంటె ఎందుకు వద్ద నాలె? ” అన్నాడు వీరయ్య.

“అన్నయ్యా! కొన్ని ఎస్సీ కుటుంబాలను తీసుకొని పరిశీలిస్తే మనకెన్నో విషయాలర్థ మవుతాయి దొంత భూమయ్యున్నాడు చదు వుకున్నాడు ఉద్యోగి అయ్యాడు అతన్ని అందరూ భూమయ్య సారంటారు. దగ్గర కూచోబెట్టుకుంటారు చిన్నతనంలో ఆయన బర్రెలు కాసేవాడు ఆతని హోదా ఇపుడు మారినట్టేకదా! ఆతని తండ్రిపై మాత్రం వివక్ష చూపుతారు ఈ వివక్ష దారుణమైందే కాదనడంలేదు కాని భూమయ్య చదువుకోవ డంవల్ల ఆతనిస్థితి మారడంవల్ల గౌరవమూ పెరిగింది ఒక్క ఆర్థికంగానే కాకుండా ఇత రత్రా కొంత అభివృద్ధి చెందినా వివక్షలో కొంత మార్పు వస్తుంది అలాగే ఇది కూడా! సాంప్రదాయ వృత్తులను పట్టుకొని ఉన్న మనవాళ్ళ మీద వివక్ష చూపినవాళ్ళు చేనేత, ఉన్ని పారిశ్రామిక సంఘాలతో పైకొచ్చిన

వాళ్ళమీద చూపలేదు సాంప్రదాయ వృత్తులను వదులుకొమ్మని చెప్పడం నా ఉద్దేశం కాదుగాని అందులో వచ్చిన మార్పులను ఆహ్వానించమనే" అన్నాడు శంకరయ్య.

"అయితే కానియండ్రి నన్నేం చెయ్యుమంటరు?" అన్నాడు వీరయ్య ఇంతలోనే వృద్ధుడు చిప్పమల్లయ్య అందుకున్నాడు

"అభివృద్ధి అభివృద్ధని ఏదేదో అంటరు అదంటేందో నాకైతె తోస్తలేదు ఎక్కడెక్కడికో బతుకుదామని పోయినోల్లు అభివృద్ధి చెందినట్టా? వాళ్ళు సాధించిందేంది? భార్యాపిల్లలను విడ్చిపెట్టి పోతె కుటుంబ జీవితం పోయినట్టే కద! ఏందో సాధించినట్టు చెప్పనడ్త వేంది రా శంకరయ్యా?" అన్నాడు.

"అదీ ఇది వేరు నాన్నా! ఉన్న చోటే ఉండాలనుకోవడం పొరపాటు స్తబ్ధతను ఛేదించిన వాళ్ళే పైకొస్తారు గౌండ్ల వాళ్ళున్నారనుకుందాం. వాళ్ళు కల్లుగీయడం, బంకుల్లో అమ్మడం మాత్రమే చేస్తే ఇలా పైకొచ్చే వారు కారు. సారా వచ్చింది బ్రాందీ వచ్చింది ఆ వ్యాపారాలనూ స్వంతం చేసుకున్నారు. కేవలం కల్లుగీత మీదనే ఆధారపడకుండా చదువులు, రాజకీయాలనూ ఆశ్రయించారు కంట్రాక్టులనూ స్వంతం చేసుకున్నారు. ఓ శక్తిగా ఎదిగారు."

"అవును తాతా! చిన్నాన్న చెప్పింది నిజం- గౌండ్లు ఇప్పుడు అన్ని రంగాలలో మస్తు ఎదుగుతండ్రు రాజకీయంగా గూడ. ఒకప్పుడు వాళ్ళు గూడ దొరా దొరా అనుకుంట బతికినోల్లే కద! నీ బాంచెన్ కాల్మొక్తా అనుకుంట బతికినోల్లే కద ఇవన్నీ నువ్వే చెప్పినవు"

అన్నాడు నవ్వుతూ లక్ష్మీరాజం

"మీరన్నది నిజమైతె కావచ్చు కల్లు వృత్తిగ ఉన్నంతవరకు గౌండ్ల వాళ్ళ చేతులల్లనే ఉంది ఉంటది గూడ. అది వ్యాపారమయినంక దుకాండ్ల కెక్కినంక ఎవరిదైన కావచ్చు తాటిచెట్టు ఈతచెట్టుతో ఏమాత్రం సంబంధం లేనోల్లు కూడా కల్లు వ్యాపారంల దిగుతున్నరు దిగిండ్రు. సారా కంట్రాక్టర్లయితండ్రు. బ్రాంది దుకాణాలు పెడతండ్రు. ఇదువరకటి దొరలు, రెడ్లు గూడ ఈ షాపులు పెడతండ్రుగద!" అన్నాడు చిప్పమల్లయ్య.

"నాయినా! నువ్వు ఆతరం వాడవయినా మాకంటెక్కో గమనించావు... పారిశ్రామికీకరణ మాయల ఇదంత మామూలే అనిపిస్తది కండెలతో, మగ్గం గుంటలతో ఏమాత్రం సంబంధం లేని వాళ్ళు గూడ బట్టల దుకాణాలు పెట్టడం లేదా? ఇదీ అంతే."

"మరి దీనితోని ఒరిగేదేంటి? జరుగుతున్నదేంటి? యంత్రాలు బాగా వస్తె వృత్తులు చేసెటోల్ల చేతుల్ల నుంచి పోతయన్నట్టే కద? పోతున్నయి గద అందుకే మనోల్లు గూడ ఇతర పనులకు, సింగరేణి బొగ్గుబాయిలల్ల తట్ట మోసుటానికి పోతున్నరు గద సైకిల్ మీద బట్టల ముల్లెలు పెట్టుకొని తిరిగినోల్లు గూడ కొందరు పోవట్టిరి. ఇదంత ఏందిరా తమ్మీ, అంత గజిబిజిగుంది."

చదువు లేకున్నా జీవితానుభవాల్లోంచి వచ్చిన వీరయ్య మాటల్లోని లోతును గమనిస్తున్నాడు శంకరయ్య.

"ఇది సహజమే అన్నయ్యా! ఇవన్నీ జరుగుతున్న క్రమంలో పారిశ్రామికీకరణ ప్రవాహంలో ఏ వృత్తి ఎవరు చేస్తున్నారో తెలియని స్థితి వస్తుంది. అంతా గందరగోళంగా ఉన్నట్టే అనిపిస్తుంది. ఎవరి వృత్తిపనులు వాళ్ళే చేసుకోవాలి అనడం సంకుచితమే అవుతుంది. అట్లంటే మన వాళ్ళు చేస్తున్నది మాత్రమేంటి? నేత కార్మికుల నుంచి వ్యాపారాలు చేసే వారుగా మారుతున్నారు గదా! సరే వ్యాపారం మన వృత్తే అనుకుందాం. మరి మన వాళ్ళలో కొంత మంది డాక్టర్ల దగ్గర పనిచేసి ఆర్.ఎం.పి., పి.యం.పి.లుగా సర్టిఫికెట్లు సంపాదిం

చారు ఊళ్లలో వీళ్ళే వైద్యులుగా చలామణి అవుతున్నారు. డాక్టర్లలో చాలా మంది మనవాళ్ళే! ఊళ్ళలో వైద్య సదుపాయం లేకుంటే వీళ్ళే దిక్కవుతున్నారు ఇది చాలా కాలం నడువకపోవచ్చు. డాక్టర్ల సంఖ్య పెరిగితే వీళ్ళ ఆదాయానికి గండి పడవచ్చు. పడుతుంది కూడా. ఒకటి రెండు తరాలయితే వీళ్ళు గౌరవంగా హాయిగా బతుకుతారు కదా! సంపాదించుకుంటారు కదా! వృత్తిని అసలే వదలమని భీష్మించుకొని కూర్చుంటే ఇది సంభవమయ్యేదా? అలాగే ఇతర కులాల వాళ్ళు కూడా వివిధ పనులు చేపడుతున్నారు ఇదీ పారిశ్రామికీకరణ ప్రభావమే."

"శంకరన్నా! నువ్వు చెప్పేటియి బాగానే ఉన్నయి కాని ఇండ్ల ఏదో లోపమున్నట్టే కన బడుతంది నాకు బాగా పంటలు పండన్నని విపరీతంగ మందులేసి భూములను పనికి రాకుండా చేసుడు ఇప్పుడు బాగా సంపా యించన్నని అన్నొట్ని ఒక్కసారే తోడుకున్నట్టు చేసుడు ఇవన్నెందుకు బిడ్డా తురితి లేకనే కదా! బాగా సుబ్రాలు కావాలనే కదా! పైస మీద భ్రమతోనే కదా! కాని, అందరుకు తంటె మీరు గూడ ఉరుకకుంటె ఏం జేత్తరు? ఆపుడు నా అసోంటోల్ల తరమా? కొత్త కొత్త వాటిని అందుకోండ్రి దునుకుండ్రి కాని పైలం బిడ్డా! గిండ్లనయితె నాకు చెప్ప రానిదేదో ఉన్నట్టు భయం భయమైతంది." అని అక్కన్నుంచి లేచి వెళ్లి మంచంలో పడుకున్నాడు చిప్పమల్లయ్య.

ఆ మాటలకు శంకరయ్య కొంత భయపడిన మాట నిజమే కాని తాను చెప్పినట్టు కాక ఏం చేయాలో తెలియని స్థితి.

మరికొంత సేపు తర్జనభర్జనలయ్యాయి.

వీరయ్య, లక్ష్మిలకు ఒప్పుకోక తప్పలేదు.

లక్ష్మిరాజం ఆనందానికంతు లేదు...

త్వరలోనే ఊళ్ళోకి ఇరవై మరమగ్గాలొచ్చాయి.

లక్ష్మిరాజం మూడు మగ్గాలను తీసుకున్నాడు ఆ మగ్గాలతోపాటు అప్పులూ వచ్చాయి.

చిప్ప మల్లయ్యకెంతో ఆనందంగా ఉంది ఎగిరే వయసు కాకున్నా ఎగిరి గంతేయాలనిపిస్తుంది చెప్పలేనంత సంబరంగా ఉంది. వేముల వెంకటనర్సు మనుమరాలిని తన మనుమనికిస్తనన్నారన్న వార్త ఆతన్ని నిలువనీయడంలేదు.

వేముల వెంకటనర్సు భూమి గలవాడు. ఒకటి రెండెకరాలు కాదు ముప్పై నలభై ఎకరాల భూమున్నవాడు. అతని తమ్ముడు వేముల పోచాలు ఆ కాలంలోనే చదువుకున్నవాడు. నైజాం నవాబు కాలంలో పోతాసు పటేలు వతన్ చేసినవాడు. తనకున్న తెలివితేటలతో ఆస్తులు సంపాదించినవాడు. ఆ అన్నదమ్ములిద్దరికీ ఆస్తులు సమానంగా ఉన్నట్టే పిల్లలూ సమానంగానే పుట్టారు. ఇద్దరికీ చెరి నలుగురు కొడుకులు... ముగ్గురు బిడ్డలు. వెంకటనర్సు నలుగురు కొడుకులనూ చదివించాడు . ఆ నలుగురూ మంచి మంచి ఉద్యోగాల్లో చేరారు. పోచాలు కొడుకుల్లో ముగ్గురు మంచి ఉద్యోగులే. ఆ ఇంటి ఆరుగురు ఆడపిల్లలనూ ఉద్యోగాలు చేస్తున్న, మంచి ఆస్తిపాస్తులున్న కుటుంబాల్లోకే ఇచ్చారు. వేములవాళ్ళ కుటుంబానికి సమాజంలో మంచి స్థానముంది. ఊళ్ళో పేరుంది. ఆస్తి అంతస్థులూ ఉన్నాయి.

తమది పేద కుటుంబం మగ్గం గుంటనే నమ్ముకొని బతుకుతున్న కుటుంబం. ఒకప్పుడు తాము వాళ్ళింట్లోకి అడుగుపెట్టడానికే భయం భయంగా ఉండేది. గుబులు గుబులుగా ఉండేది. ఒకవిధంగా భూస్వాముల్లాంటి కుటుంబమే వాళ్ళది. అలాంటి కుటుంబంలోంచి ఓ అమ్మాయి తమ కుటుంబంలో పడటమా? ఈ విషయాన్ని నమ్మలేకపోతున్నాడు మల్లయ్య.

తన మనుమడు శ్రీరాం ఇంజినీర్. మంచి ఉద్యోగంలో ఉన్నాడు. వెంకట

నర్సు కొడుకు రామలింగం కూతుర్ను తన మనుమడికిస్తానంటున్నారు. ఇదెంత గొప్ప విషయం? తన మనుమడు ఇంజినీరే కావచ్చుకాని వేములవాళ్ళ కుటుంబంలోంచి అమ్మాయి తన ఇంట్లో పడబోవడం అపురూప విషయం. తానూహించని విషయం తన ఆలోచనకే అందని విషయం.

ఇది జరుగడం సాధ్యమూ అనుకుంటే ఈ రోజు వాళ్ళు రానే వస్తున్నారన్న వార్త చిప్ప మల్లయ్యకు పరమానందంగా ఉంది అతనికి కాలు ఒక చోట నిలువడంలేదు. చేతగాకున్నా లేనిబలం తెచ్చుకొని వాకిట్లో అటూఇటూ తిరుగుతున్నాడు.

శ్రీరాం తల్లి లచ్చవ్వకూడా ఈ విషయాన్ని జీర్ణించుకోలేకపోతోంది. ఆమెకూ చెప్పలేనంత సంతోషంగా ఉంది. ఉద్వేగంగానూ ఉంది. వేములవాళ్ళ కుటుంబంలోని రామలింగయ్య కూతురును తన కొడుక్కిస్తాననడం ఆమె కూడా పెద్ద విషయంగానే భావిస్తుంది. తన కొడుకు బాగా చదివాడు నిజమే ఆ అమ్మాయికూడా బాగా చదివిందే! వాళ్ళిద్దరు ఒకరినొకరు ఇష్టపడ్డారు. చిన్నతనంలో ఒకే బళ్ళో చదివారు. అప్పట్నుంచీ ఏర్పడిన ఇష్టం ఇపుడు పెళ్ళిదాకా వచ్చింది. ఎంత ఇష్టపడ్డా ఆ కుటుంబంలోని అమ్మాయి తన కోడలుగా రావడం తనూహించని విషయం. తన ఆలోచనకే అందని విషయం.

★ ★ ★

చిప్పమల్లయ్య చనిపోయాడు. అదేమంత గొప్ప విషయంకాదు. ఎందుకంటె అతడు ఏ రాజకీయనాయకుడో కాదు ప్రముఖుడూ కాడు. గొప్పవాడు అంతకంటే కాదు. తొంభై ఏళ్ళకు పైగా జీవించినా రెక్కలు ముక్కలు చేసుకునే బతికాడు మనుమలు, మనుమరాండ్ల నందరినీ చూసుకున్నా అతనిది కష్టపు పుటకే. విశ్రాంతి అనేది ఆతని నిఘంటువులో లేదు. చివరి దశలో మాత్రం మంచంలో ఉండి కోడండ్లతో స్వల్పంగా ఉపచర్యలు చేయించుకున్నాడు.

పెద్దవాళ్ళు మరణిస్తే పరమపదించాడు స్వర్గస్థుడయ్యాడు మరణించాడు ఇహలోక యాత్ర చాలించాడు లాంటి పదాలను వాడుతారు మరణించాడు, చనిపోయాడు, చచ్చిపోయాడు అనే పదాలను వివిధస్థాయిల్లో ఉపయోగిస్తారు. చిప్పమల్లయ్య పెద్దవాడు, ప్రముఖుడేం కాదు అందుకే అతన్ని చచ్చిపోయాడనే అన్నారు. మహా అయితే చనిపోయాడంటున్నారు. అతడు పెద్దవాడు కాకపోవచ్చుకాని పెద్దవయసు వచ్చేవరకు బతికినవాడు. రెక్కల కష్టంతో కుటుంబాన్ని పోషించుకున్నాడు కొడుకును చదివించుకున్నవాడు. ఒక విధంగా ఆ కుటుంబంలో జీవితాలను గెలుచుకునే క్రమం అతనితోనే ప్రారంభమైంది. ఆతని కొడుకులు, మనుమలు జీవితాలను గెలుచుకునే క్రమాన్ని మరింత విస్తృతం చేస్తున్నారు. చిప్పమల్లయ్య మంచోడే. ఎవరిజోలికీ పోనివాడు.

మూడు నాలుగు తరాలను చూసిన చిప్ప మల్లయ్య చనిపోయాడు. దొరలతరాన్ని చూశాడు. ఫ్యూడల్ దొరల ఆధిపత్యాన్ని అనుభవించాడు నైజాం కాలాన్ని చూసాడు స్వాతంత్రం వచ్చింతర్వాత ఊరి చిల్లరదేవుళ్ళ పాలననూ చూసాడు. కొంచెం కొంచెంగా తిరుగుబాటు తత్వాన్ని అలవర్చుకున్న కొడుకుల తరాన్నీ చూశాడు. పారిశ్రామికీకరణ పేరుమీద వృత్తులు పతనమై రోడ్లమీద నిల్చున్న తరాన్నీ చూశాడు వలసల తరాన్నీ చూశాడు. నేత మగ్గాల తరాన్ని, మరమగ్గాలనూ చూశాడు. తాను, తన కొడుకు నేతమగ్గాలను వదిలిపెట్టకున్నా మరమగ్గాలను, యంత్రాలను బట్టలను చూశాడు. ఇంకా అనేకం చూశాడు. పారిశ్రామిక మాయతోపాటు గ్లోబల్ మాయను పూర్తిగా చూడకముందే మరణించాడు. దాన్ని చూడడం తనవల్ల కాదనుకొనుంటాడు. అందుకే ఈ లోకం విడిచి వెళ్ళాడు.

ఎవరిజోలికీ పోకుండా తనపని తాను



చేసుకుంటూ తొంభై ఏళ్ళకుపైగా బతికిన చిప్పమల్లయ్య ఇక లేడు. చిప్పమల్లయ్య చనిపోయిండు చిప్పయినె చచ్చిపెయిండు మల్లయ్య పోయిండు. చిప్పోడు చచ్చిపోయిండు చిప్పముసలోడు చనిపోయిండు. తొంభై ఏండ్ల కంటెక్కునే బతికిండు. చిప్ప ముసలోడు 'మంచోడుండె ముసలోడు కాని పోయిండు'

ఎన్నేండ్లున్నా చావు దప్పదని అన్నారు గదా! బహుగ బతికిండు ముసలోడు ఏం బతికిండు అన్నీ కష్టాలేనాయె.

కష్టాలో సుఖాలో బతుకనయితె బతికిండు - బాగా సంపాయించుతనే సుఖపడ్డట్టా ఏంది? అందర్ని చూసుకున్నాడు మరి... సాలదా ఏంది?

పిల్లాపాప మనుమలు మునిమనుమలను చూసిండు. ఇంకేందంట? ఇగో ఎంత బతికినా తృప్తి అనేదుండాలె.

ఇంకొన్ని రోజులు బతుకుదామనుండె చిప్పోనికి. ఎన్నేండ్లు బతికినా బతుకుతీపి పోదుగదా మరి!

బతుకు తీపి అందరికుంటుంది.

పాయె పాపం ముసలోడు చచ్చిపాయె పోయినోల్లు వత్తరా పటు ఉన్నన్ని రోజులు మంచిగ చూసుకోవాలె.

చిప్పమల్లయ్య చావు గూర్చి మాట్లాడుకుంటున్నారు జనాలు. ఊరంతా అవే మాటలు. అందరి నోళ్ళలోనూ చిప్ప మల్లయ్యే. అతడేం ప్రముఖుడు కాకున్నా ఊరివాళ్ళందరికీ తెలిసినవాడు. అందరితో కలిసున్నవాడు. ఆ ఊళ్ళోని ప్రతి కుటుంబానికీ ఎప్పుడో ఒకప్పుడు తన చేత్తో నేసిన బట్టలనిచ్చినవాడు. ఎవ్వరితో కలహం పెట్టుకున్నవాడు కాడు. బట్టలు నేసివ్వడంలో అందరికీ తలలో నాలుకలాంటివాడే చిప్పమల్లయ్య. నేతపనినే నమ్ముకొని బతికిన చిప్పమల్లయ్య యంత్రాలొచ్చినా వాటి జోలికి పోని చిప్పమల్లయ్య ఊరందరికీ బట్టలందించిన చిప్పమల్లయ్య తన వృత్తితోనే కుటుంబాన్ని పోషించుకున్న చిప్ప మల్లయ్య చనిపోయాడు.

ఆతని చావుకు అందరూ సానుభూతి చూపినవారే కాని చస్తే చావనీయ్ అని

మాత్రం ఎవరూ అన్లేదు. దొరలను దొరతనాన్ని దొరల దాష్టీకాన్ని అనుభవించినా నోరుమెదపని చిప్పమల్లయ్య భూస్వామ్య వ్యవస్థ పతనాన్ని, అనేక మార్పులను మౌనంగా చూశాడు. నోట్లో నాలుకలేని వాడయిన చిప్పమల్లయ్య చిన్నతనంలో, యౌవనంలో వంగివంగి దండాలు పెట్టుకుంటూ, నీ బాంచెన్ దొరా అనుకుంటూనే బతికాడు కాని దొరలను ఒక్క పల్లెత్తు మాట కూడా అన్లేదు. అలాంటి చిప్పమల్లయ్య అన్ని మార్పులకూ సాక్షీభూతంగా నిలిచాడు. చిప్పమల్లయ్య నోట్లో నాలుక లేనివాడే కాని అతని చిన్న కొడుకు నోట్లో నాలుకలేనివాడు కాదు. చదువుకున్నవాడు అవసరమయితే దొరల నెదిరించినవాడు సమాజంలో స్థానమున్నవాడు. తాను చైతన్యవంతుడు కావడం మాత్రమే కాదు ఇతరులనూ చైతన్యవంతులను చేస్తున్నవాడు. తాను జీవితాన్ని గెలుచుకోవడమేకాకుండా తనవాళ్ళు జీవితాలను గెలుచుకోవడానికి కృషిచేస్తున్నవాడు. కొంతకాలం వరకు తన కుటుంబానికే పరిమితమయినా ఆ తర్వాత తనవాళ్ళ ఎదుగుదల కోసం తనవంతు ప్రయత్నం చేస్తున్నాడు.

సామాజిక సాహిత్య రంగాల్లో ఎదిగి ఓ స్థానం సంపాదించుకున్న చిప్పమల్లయ్య చిన్నకొడుకు శంకరయ్యకు తండ్రంటే విపరీతమైన అభిమానం. ప్రేమ. తండ్రి మరణం అతనికి గొప్ప దుఃఖాన్నే కలిగించింది. వలవలా వలపోసేట్టు జేసింది. తనస్థితిని, బేషజాలను మరిచి భోరుభోరున దుఃఖించాడు. ల్యాకబద్ధతో కొట్టి చదివించిన తండ్రి, ఇంటి కోసం ఎంతో తపించిన తండ్రి, తాను ఉపవాసముండి చదివించిన తండ్రి జీవితమంతా కష్టజీవిగానే బతికిన తండ్రి మరణం అతనికి తీరని దుఃఖాన్నే కలిగించింది. తండ్రిని వృద్ధాప్యంలో తాను కూడా చూసుకోవాలనుకున్నాడు. తనకు సాధ్యమైనంత వరకు బాగానే చూసుకుంటున్నాడు కాని తన సపర్యలను ఎక్కువకాలం అనుభవించకుండానే తండ్రి మరణించడం శంకరయ్యకు భరించరానిదిగా ఉంది. తానూ పేదరికం అనుభవించాడు. తనకున్న చిన్నపాటి ఉద్యోగంతో నానాతంటాలు పడ్డాడు. క్రమక్రమంగా ఎదిగాడు. పేదరికం నుండి దిగువ మధ్యతరగతికి ఎదిగాడు. తన కొడుకులందరూ ఇంజనీరింగ్ చదువుతున్నారు. పెద్దవాడిదయిపోయింది. ఉద్యోగం చేస్తున్నాడు. తన కుటుంబం మధ్యతరగతికి ఎదుగుతుంది. తన పిల్లలు అమెరికాకెళితే మరింత ఎదుగుతారు.

తాను అనుభవించినంతయినా తన తండ్రి సుఖపడలేదు. ఇది తరాల మధ్య అంతరంవల్ల వచ్చిందేనా? తాను తన తండ్రిని కూచొని తినేటట్టు చేస్తానన్నాడు. చదువుకునే సమయంలో అనేక ఆదర్శాలు వల్లించాడు. కాని చేయగలిగాడా? ఉద్యోగం దొరికినా అదే మొదట్లో జీవన పోరాటం చేయాల్సి వచ్చింది. తనకు అవగాహన కలిగి ఓ స్థితి కెదిగి తల్లిదండ్రులను సుఖపెడుదామనుకునే సమయానికే తల్లిపోయింది. తల్లి కోరుకున్న ఒక్క పట్టుచీర కూడా తాను కొనివ్వలేకపోయాడు. తల్లి పోయింతర్వాత తాను తండ్రిపట్ల మరికొంత ప్రత్యేకశ్రద్ధ తీసుకోవడం మొదలుపెట్టాడు. తండ్రి కోర్కెలను తీర్చాలనుకున్నాడు. కాని తన తండ్రికి కోర్కెలే లేవు ఏం కోరుకున్నదీ లేదు. చిన్నతనంలో మక్కగడుక తినేవాడు. తామెరిగిన తర్వాత మాత్రం వరన్నం తింటున్నాడు. అంతే తేడా. ఇది తన ఒక్క కుటుంబంలోనే వచ్చిందా? దాదాపు అందరి కుటుంబాల్లో వచ్చిన మార్పిది.

తాను దుర్భర పేదరికాన్ని అనుభవించాడు. తన వాళ్ళు చాలామంది ఇంకా అనుభవిస్తూనే ఉన్నారు. ఎంత పేదరికమున్నా తండ్రి తనను చదివించాడు. తన తల్లిదండ్రులిచ్చిన చదువువల్ల, సమాజంతో వచ్చిన అవగాహనవల్ల తాను జీవితాన్ని

గెలుచుకుంటున్నాడు. తాననుభవించిన పేదరికమే తనకు వరమయింది ఎంతో అవగాహన కలిగించింది. ఎన్నో మార్పులను తీసుకొచ్చింది. తన వాళ్ళకోసం తాను ఏదైనా చేయాల్సిన అవసరాన్ని చెప్పింది. తన తండ్రికి చదువు రాకున్నా ఎంతో అవగాహన ఉండేది. జీవితానుభవాలను కాచి వడబోసినవాడు. కష్టాల ద్వారా ఎన్నో అనుభవాలను పొందినవాడు. నిజంగా కష్ట సహిష్ణత ఎన్నెన్ని జీవితపాఠాలను నేర్పుతుంది? ద్వేషం పునాదులపై నడుస్తున్న సమాజాన్ని ప్రేమించడం నేర్పుతుంది. పేదరికంలో ఉన్న ప్రేమ, అనురాగం అపరిమితమైన డబ్బు కలిగి ఉండటంలో ఉండదు. అట్లు తాను తనవాళ్ళంతా పేదలుగా ఉండాలని కోరుకుంటున్నాడా? కానే కాదు. మరి తన వాళ్ళు ప్రేమానురాగాలకు దూరం కావాలని కోరుకుంటున్నాడా? అసలే కాదు. తనవాళ్ళు కనీసం మధ్యతరగతికైనా ఎదగాలని కోరుకుంటున్నాడు. ఒక విధంగా పేదరికం దుర్భరమైందే. జీవితమంతా పేదరికంలో, దుర్భర వేదనలో మగ్గడం నిజంగా ఎంత బాధాకరమైంది? చాలా వరకు అలాంటి జీవితమే గడిపాడు తన తండ్రి.

అలాంటి తన తండ్రి చిప్ప మల్లయ్య మరణం విషయంలో ఓ సభను ఏర్పాటు చేసాడు శంకరయ్య. ఆ గ్రామంలో అలాంటి సభలు పూర్తిగా కొత్త మనిషి చనిపోతే కర్మ చేయడం తినడం తాగడం దానికి భిన్నంగా సంస్మరణ సభను ఏర్పాటుచేసాడు శంకరయ్య సంస్మరించకోవడానికి చిప్ప మల్లయ్య గొప్పవాడు కాకున్నా శంకరయ్యకు తండ్రి. అతనికి జన్మనిచ్చినవాడు, చదువునిచ్చినవాడు. జీవితాన్ని గెలుచుకుంటానికి సహకరించినవాడు శంకరయ్య ఈ సభను ఎవరికివారు అంచనా వేసుకోవడానికి ఏర్పాటుచేసాడు. ప్రేమంటే ఏమిటో తెలియజేయడానికి చేసాడు. అతనికి చచ్చిన తర్వాత చేసే తతంగం మీద నమ్మకం లేదు. చిత్రాతిచిత్రంగా చదువు రాని చిప్పమల్లయ్యకూ చచ్చినాక చేసే కర్మపై పెద్దగా నమ్మకంలేదు. తను చివరి రోజుల్లో ఎన్నో విషయాలు చెప్పాడు చిప్ప మల్లయ్య. తన కర్మరోజున అన్నదమ్ములు, బంధువులందరూ కలుసుకోవాలన్నారు. ముఖ్యంగా తోడబుట్టిన వాళ్ళు తాను భరించిన పేదరికానికి విరుగుడుగా ఆరోజు కొంతమంది పేదలకు భోజనం, పెట్టాలన్నాడు శంకరయ్య." అందుకే సభనేర్పాటు చేశాడు.

తండ్రి జ్ఞాపకార్థంగా సంస్మరణ సభను ఏర్పాటుచేశాడు శంకరయ్య.

ఊళ్లోని తిండికిలేని పేదలందరినీ పిలిచి భోజనం ఏర్పాట్లు చేశాడు. వారితోపాటు శంకరయ్య మిత్రులు, కొందరు రచయితలు, మేధావులు, కులంవాళ్ళు, బంధువులు ఆ మారుమూల పల్లెటూరికి వస్తున్నారు. ఆ ఊరివాళ్ళకది కొత్త విషయమే. పట్టణాల్లో ప్రముఖుల విషయంలో మాత్రమే జరిగేది తమ గ్రామంలో జరగడం వాళ్ళకు వింతగానే ఉంది. ప్రేమంటే ఏమిటి? జీవితం అంటే ఏమిటి? పేదవర్గాల్లో ప్రేమ అనురాగ సంబంధాలు ఎలా ఉంటాయి అనే అనేక విషయాలను గురించి విందామని వచ్చారు కొందరు.

ఇంటినిండా జనం. వాకిలినిండా జనం బజార్లోనూ జనం. చిప్పమల్లయ్య చనిపోయి ఆ రోజుకు పదకొండు. ఇంకా ఇంటి ఆవరణలో శ్మశానవైరాగ్యమున్నా జనంతో కిటకిటలాడుతుండటంవల్ల కొంత మరుపుగానూ ఉంది. కుటుంబం, బంధువులు, కులం వారి పట్టుదల ప్రకారం చేయాల్సిన కర్మతతంగం చేయక తప్పలేదు శంకరయ్యకు.

ఆ తర్వాత సంస్మరణ సభ చిప్పమ

ల్లయ్య సంస్మరణ సభ ఆ గ్రామీణులకు మాత్రం కొత్త.

మైకు లేకున్నా అందరికీ వినబడేంత దూరమే ఉంది. వాళ్ళ మధ్య సభానంతరం చేయబోయే భోజనం కోసం మాంసం ఉడుకుతోంది. కొందరి దృష్టి అటువైపే ఉన్నా మైకుకు ఎదురుగా చాలా మందే ఉన్నారు.

సభ మొదలైంది. ఈ సభకు కారకుడైన శంకరయ్య మాట్లాడుతున్నాడు.

ఈ సభకు వచ్చిన నా మిత్రులకు, బంధువులకు, ఆత్మీయులకు, గ్రామస్తులకు, కులం వారికందరికీ నా వందనాలు. ఈ సభ యొక్క ఉద్దేశ్యమేంటో మీకిదివరకే అర్థమయ్యుంటుంది. కష్టజీవియైన మా నాన్నను స్మరించుకోవడం మన గ్రామంలో ఇలాంటివి కొత్తే. ఇదే ప్రథమమేమో! ఈ సభకు వచ్చిన సామాన్యులు, అసామాన్యులు, రచయితలు, మేధావులు, పుర ప్రముఖులు, కులబంధువులు ఎందరో మహానుభావులు అందరికీ వందనాలు.

మా నాన్న జీవితమంతా కష్టాలతోనే గడిపాడు. పేదరికం దుర్భరమైంది. కాని నిరంతరం శ్రమచేస్తున్నా అన్నివిధాల పనులు చేస్తున్నా నాన్నలాంటి వాళ్ళకు ఎందుకు పేదరికముందో అర్థంకాని విషయం. వీళ్ళకెందుకు ఆస్తులుండవో తెలియని విషయం. ఈ సమాజంలో ఎంత వైరుధ్యముందో ఈ విషయాలను బట్టే అర్థమవుతుంది. మన అమ్మ, నాన్నలు, పూర్వీకులు మన వాళ్ళంతా నిరంతరం శ్రమిస్తూనే ఉన్నారు. మగ్గంగుంటలకే అంకితమై బతుకుతున్నారు. షరి చేస్తూ ఈనిలు గుచ్చుకు పోతున్నా ఎంత కష్టమైనా పనినే దైవంగా భావించారు. అలాగే నాగలిదున్నుతూ, మోటగొడుతూ, నీళ్ళ కడుతూ, ఒడ్లు చెక్కుతూ, చెప్పులు చేస్తూ, కుండలు చేస్తూ సమస్తమైన వృత్తి పనులు చేస్తూ బతికే వాళ్ళున్నారు. వీళ్ళకు కడుపులు నిండటం మాటెలా ఉన్నా పేదరికమెందుకుంటుంది? ఇన్ని పనులు చేస్తూ మట్టిలో మట్టయి బతుకుతున్నా వీళ్ళ చేతుల్లో ఆస్తులెందుకులేమని ఇవన్నీ మాట్లాడుకుంటానికి ఇది సమయం కాకపోవచ్చు కాని ఇలాంటి పనులు చేస్తూ బతికిన మానాన్నను జ్ఞాపకం చేసుకుంటానికి వీటిని ప్రస్తావించాల్సి వచ్చింది. ఆ సందర్భాన్ని గుర్తుచేసుకోవాల్సి వచ్చింది.

మనలాంటి కుటుంబాల్లో కర్మల పేరు మీద జరుగుతున్నదేంటి? కల్లు తేవడం తాగడం. ఆస్తుల పంపకంపై కొట్లాటలు. అన్నాదమ్ముల మధ్య తగాదాలు. తల్లిమీది సొమ్ముల గూర్చి పంచాయతీలు ఇవన్నీ జరుగడానికి వీల్లేదు- మనం అవగాహన పెంచుకొని వీటికి దూరంగా ఉండాలి. అందుకే కల్లు తేవద్దని చెప్పాను. ఈ రోజుల్లో కల్లు తాగొద్దని చెప్పాను. నా మాటలు కొందరికి బాధకలిగించినా అవి ఏ మేరకు ప్రభావాన్ని చూపినా అంతేచాలు. ఓ దిక్కు ఇంట్లో మనిషిపోయి దుఃఖంలో ఉంటే కల్లుతెచ్చి తాగించడం, తాగడం నాకు నచ్చని పనులు మరివి ఏ ఉద్దేశ్యంతో పెట్టబడ్డాయో ఆ సంగతి గూర్చి ఆలోచిస్తే కొన్ని సంగతులు తెలిశాయి. దుఃఖంలో ఉన్న ఇంటివాళ్ళకు కొంత ఉపశమనం కలిగించడానికి, భోజనం సరిగ్గా చేయరు కాబట్టి దుఃఖం మరిపింపజేయడానికి కల్లు తాగించడం చేస్తుంటారు. వాళ్ళు కష్టాల్లో ఉంటారు కాబట్టి పదో పరకో ఇవ్వడమూ చేస్తుంటారు. అవి ఆ సమయంలో ఉపయోగపడవచ్చు. ఒకవిధంగా చూస్తే ఇందులో తప్పేం ఉన్నట్టు కనబడదు కాని చనిపోయినింట్లో తాగడం, లాంటివి ఎందుకోకాని నాకు బాగనిపించవు. అవి నాకు నచ్చవు కాబట్టే బందు చేశాను.

వ్యక్తి చనిపోయాడు. పలుకరించడానికి ఎక్కడెక్కడినుంచో వస్తారు. ఊర్నుంచే కాకుండా దూరప్రదేశాల నుండి వచ్చిన బంధువులు, ఇతరులూ ఉంటారు. మరి

వాళ్ళేం తినాలి? ఎక్కడ తినాలి? అందుకే కర్మరోజున తిండి పెట్టడం సరయిందే. పెద్దలను స్మరించు కుంటూ భోజనం చేయడం ఓ పద్ధతి. అందుకే అది మాత్రం యధా విధిగా ఉంది. ఈ సమయంలో మరో విషయాన్ని స్మరించుకోవాలి. లేదా మాట్లాడుకోవాలి. ఇది ముఖ్యంగా మధ్యతరగతి, దిగువ మధ్యతరగతి కుటుంబాల్లో జరిగే విషయం. పేద కుటుంబాల వారు న్నారనుకుందాం. ఏమీ ఆస్తిపాస్తులు, కూడ బెట్టిన ధనమూ ఉండవు కాబట్టి అనడానికేముండదు! తినడా నికే సరిగ్గా లేకుంటే అనడానికేముం టుంది? దానికేముంటుంది? అందరూ కష్టపడటమే. పనిచేసు కుంటూ తినడమే పిల్లలయినా అంతే! వృద్ధులయినా పూర్తిగా చేతగానంత వరకు, అంటే కుల్లిలో పడేంతవరకు పనిచేయడమే! బాగా డబ్బున్న వారికి డబ్బు కొరతుండదు కాబట్టి ఇలాంటి సమస్యలు తక్కువ. అయితే వీళ్ళలో వృద్ధులపట్ల నిరాదరణుంటుంది. కేశ వరావు దొర సంగతే తీసుకోండి. బాగా ఆస్తులున్నమాట నిజమే. కాని కొడుకు లంతా పట్టణాల్లో పెద్ద పెద్ద హోదాల్లో ఉన్నారు. కేశవరావును చూసుకోవడానికి ఓ మనిషిని పెట్టారు. డబ్బుకేం కొరతలేదు కాని ఆ వృద్ధునికి తన కొడుకులు కోడం డ్లతో కలిసి ఉండాలని, తినాలనుండేది. మనుమలు, మనుమరాండ్రతో ఆడుకోవాల నుండేది. తన వాళ్ళందరితో ప్రేమగా మాట్లాడాలనుండేది. కాని ఆ కోర్కెలు తీరే వికాదు. వాళ్ళు ఎప్పుడోసారి వచ్చేవారు. ఉన్నంతసేపూ హడావిడే. కొంత డబ్బిచ్చి వెళ్ళిపోయేవారు. ఈయన ఆక్కడికి పోయుంటే చూసుకోవడం కష్టం. ఎవరి హడావిడి వారిది. డబ్బు ఇస్తున్నాం కదా ఇంకేంటి అనేవారు. ఆయన కళ్లనీళ్ళు



## ఫోన్‌కాల్

బాంబేలోని పటేల్ పటేల్ పటేల్ అండ్ పటేల్ కంపెనీకి ఓ ఫోన్ వచ్చింది.

'పటేల్‌తో మాట్లాడాలి'

'ఆయన సీట్లో లేరు'

'పోనీ ఇంకో పటేల్‌తో మాట్లాడవచ్చా?'

'ఆయన ఊళ్లోలేరు'

'పోనీ మూడో పటేల్‌కు ఇవ్వండి'

'సారీ.. ఆయన ఇప్పుడే లంచ్‌కి వెళ్లారు.'

'సరే చివరి పటేలైనా ఉన్నారా?'

'మాట్లాడుతున్నా.. ఏమిటి చెప్పండి?'

కుక్కుకుంటూ ఉండేవాడు తన సంతానంతో హాయిగా కలివిడిగా ఉండాలన్న ఆయన కోర్కె తీరకుండానే మరణించాడు. ఆయన కర్మమాత్రం ఘనంగా చేసారు కొడుకులు. ఎవరూ చేయనంత గొప్పగా చేసారు. మాంసం గుట్టలకొద్దీ వండారు. మద్యం వరదలై పారింది. ఖర్చు విపరీతంగానే చేశారు. కాని ఆ వృద్ధుడు కోరుకున్నదేంటి? చనిపోయిన తర్వాత చేసే ఈ వైభవోపేత మైన తతంగంకాదు కాస్తంత ప్రేమను ఎంత డబ్బున్నా ఆయన తనవాళ్ళ నుంచి తననుకున్నది పొందలేకపోయాడు.

ఇక మధ్యతరగతి త్రిశంకు వర్గం వాళ్ళు వీళ్ళు పైకి పోలేని వాళ్ళు. కిందికి రాలేని

వాళ్ళు. కొంచెం ఎక్కువ ఖర్చులయితే భరిం చడం కష్టంగా భావించేవాళ్ళు. వీళ్ళలో విలువలూ ఎక్కువే. మూఢనమ్మకాలూ ఎక్కువే. సమస్యలూ ఎక్కువే వీళ్ళలో చాలామంది కిందివర్గం నుంచి ఎదిగి మధ్యతరగతికి వచ్చినవాళ్ళు. కొందరు పైనుంచి దిగజారి కిందికి చేరుకున్న వాళ్ళు.. ఈ వర్గంలో వృద్ధులను నిర్లక్ష్యా నికి గురిచేయడం కనబడుతుంది. తరాల మధ్య అంతరాలు ఈ కుటుంబాల్లో ఓ రక మైన ఖాళీని ఏర్పరుస్తాయి. చదువుకున్న కొడుకులు చదువురాని తల్లిదండ్రులు. ధోతీ నుంచి పాంటుకొచ్చిన తరం. నేలమీది చాపతిండ్ల నుంచి డైనింగ్ టేబుళ్ళకొచ్చిన వాళ్ళు. ఇలాంటి వాళ్ళ మధ్య ఏర్పడిన ఖాళీ చిన్న చిన్న విభేదాలను సృష్టిస్తుంది. తగాదాలను కలిగిస్తుంది. కొంత నిస్సహా యతవల్ల, మరికొంత అవకాశాలు లేకపోవ డంవల్ల, ఇంకొంత తెలిసీ వీళ్ళు వృద్ధులను నిర్లక్ష్యానికి గురిచేయడం జరుగుతుంది. అయితే వాళ్ళు చనిపోయిన తర్వాత మాత్రం అప్పు చేసైనా సరే కర్మ ఘనంగానే చేస్తారు. అందువల్ల ఆ వృద్ధుల కొరిగేదేంటి? చచ్చింతర్వాత తలకొ రివి పెట్టడానికి మాత్రమే అయితే కొడుకెం దుకు? ఆ కొరివి ఎవరైనా పెట్టొచ్చు. బతి కున్నప్పుడు ముఖ్యంగా వృద్ధాప్యంలో చేత కాని సమయంలో తల్లిదండ్రులను ఆదుకు న్నవాడే కొడుకు.

పుత్రోత్సాహము తండ్రికి పుత్రుడు పుట్ట గానే లభిస్తుంది. ఆ పుత్రుడు ప్రయోజకుడై అందరూ పొగిడేవిధంగా ఎదిగినప్పుడే అది సార్థకమవుతుంది. నిలుస్తుంది ఇది నిజమే కావచ్చు. కాని నాకయితే ఇది పాక్షిక సత్యమే అనిపిస్తుంది. నా ఉద్దేశ్యం ప్రకార మయితే తల్లిదండ్రులను చేతగాని సమ యంలో తన పిల్లల్లా చూసుకున్నప్పుడే నిజ మైన పుత్రోత్సాహం కలుగుతుంది. ఇన్ని

చెబుతున్నారు మరి మీరలా చూసుకు న్నారా అని మీరడుగవచ్చు. నా పరిమితు లకు లోబడి నేను అనుకున్నంతగా కాకున్నా బాగానే చూసుకున్నాను. ఇంకా బాగా చూసుకుందామన్న సమయానికి ఆయన పోయాడు- నాలో ఏమైనా లోపాలున్నా అవి మాత్రమే ఉదాహరణలు కాకూడదు. ఎవరి నుంచయినా ఏమాత్రం మంచున్నా గ్రహిం చాలి. చెడుంటే వదిలిపెట్టాలి. తల్లిదండ్రు లను బాగా చూసుకోలేనివారికి పుట్టగతు లుండవు. నాన్నా! అమ్మా! నాకు ఉద్యోగమ యిన తర్వాత మీ కష్టాలకు చరమగీతం పాడుతానని ఎన్నో సార్లన్నాను. హృదయ పూర్వకంగానే అన్నాను. కాని ఎదుగుతున్న క్రమంలో మధ్యతరగతి విలువలు నన్నూ చుట్టుముట్టాయి. కొన్ని పరిమితులకు లోబ డేట్టు చేసాయి. అందువల్ల అనుకున్నది చేయలేకపోయాను. మనం చేద్దామన్నా నాన్న లాంటివాళ్ళు ఏ కొంచెం చేతనయినా ఖాళీగా ఉండరు. అయినా చేయగలిగినంత వరకు చేయడం మన ధర్మం.

పీడిత వర్గంలోంచి వచ్చి ఎదుగుతున్న వాడు శంకరయ్య రచయితగా, సామాజిక అవగాహనాపరుడుగానూ ఎదిగినవాడు. తనకున్న అవగాహనతో పీడిత పక్షపా తంతో బతుకుతున్నవాడు. తన వాళ్లను ఎదిగించడానికి కృషిచేస్తున్నాడు. జీవితా నికో లక్ష్యంతో స్పష్టమైన అవగాహనతో బతుకుతున్నాడు. తన రచనల్లో ఎన్నో ఆద ర్శాలూ, ఆశయాలనూ వల్లించినవాడు. అలాంటి శంకరయ్యకు ఇప్పుడో సమస్య వచ్చిపడింది. ఆ సమస్య అతని కొడుకు రూపంలో ఉంది. తనదాకా వస్తేకానీ తెలి యదన్నట్టుగా ఉందాతని పరిస్థితి.

రమేష్ కంప్యూటర్ ఇంజనీర్. ఇరవై వేలకు పైగా జీతంతో బెంగుళూరులో పని చేస్తున్నాడు. త్వరలో అమెరికాకు వెళ్త న్నాడు. అలాంటి రమేష్ ఓ అమ్మాయితో ప్రేమలో పడ్డాడు. ఆమె పేరు మల్లీశ్వరి. మంచి అందగత్తె. ఉన్నత కుటుంబంలోంచి

వచ్చింది. ఆమె గూడా ఇంజనీరే. అలాట మ్మయి రమేష్‌ను పెళ్లి చేసుకుంటాననటూం దంటే శంకరయ్యకు నమ్మబుద్ధి కావడం లేదు. అందులో మర్మమేంటో తెలుసుకోవా లనే ఉంది. కొడుకుతో అన్ని విషయాలు చర్చించిన తర్వాతే నిర్ణయం తీసుకోవాలను కుంటున్నాడు.

ఆ ప్రసక్తి తానే తెచ్చాడు రమేష్.

"నాన్న! ఏమాలోచించారా విషయం గూర్చి..? " అన్నాడు.

"నలుగురికి చెప్పే మీరు, రాతల్లో ఆద ర్శాలు చేసే మీరు, రమేష్ పెళ్లి విషయంలో మాత్రం అందరిలాగే ఆలోచిస్తున్నారు. పెద్దకులపు అమ్మాయి చదువుకున్న అమ్మాయి రమేష్‌ను చేసుకుంటానంటె మీరెందుకు వద్దంటున్నారో నాకైతే తెలుస్త లేదు" అంది శారద.

"నీ కంతే తెలుసు శారదా! కాని దీని వెనుక ఇంకెన్నో కారణాలుంటాయి. మన కంటె పెద్ద కులపు అమ్మాయి కాబట్టి ఫర్వా లేదనడంలో మన ఆత్మన్యూనత భావం లేదా చెప్పు? ఇంతకీ ఆమె రమేష్‌ను ఎందు కిష్టపడుతుందో వాళ్లెందుకంత ఆసక్తి చూపుతున్నారో ఒక్కసారి ఆలోచించు."

"నాన్నా! లోకాన్ని గూర్చి ఎన్నో చెప్పే మీరు కులాంతర వివాహాలను వ్యతిరేకిస్తు న్నారా? "

"కులాంతర వివాహం తప్పని నేనడం లేదు. కాని ఈ విషయంలో నాకు కొన్ని స్పష్టమైన అభిప్రాయాలున్నాయి."

"ఏంటండీ ఆ స్పష్టమైన అభిప్రాయాలు తప్పించుకోవడం కాకుంటే"

"శారదా! కులం పరిధి దాటి బయటకు పోని నువ్వు కూడా ఈ విషయం గూర్చి ఇంత శ్రద్ధ కనబరుస్తున్నావంటే అందుక్కా రణం ఆమెది మనకంటె పెద్ద కులం కావడం... అదే మనం మహాభాగ్యంగా భావించడమే కదా! అదే నేను వద్దనేది మనలాంటి పీడిత కులాల నుంచి చదువు కొని ఉన్నతస్థితిలోకి వచ్చిన వస్తున్న వాళ్లను కొందరు తన్నుకు పోతున్నారు. తన వాళ్లకి కాకుండా పోతున్నారు. వీళ్లను వాళ్ళు తమలో కలుపుకొని పరాయీకరణం చెందిస్తున్నారు. ఇందువల్ల నష్టపోయేదె వ్వరు? నూటికో కోటికో ఒకరుగా పైకొచ్చిన పీడిత కులాల కుటుంబాల వాళ్లేకదా!

తండ్రి మాటలు ఆలోచింపదగ్గవిగానే కనబడ్డాయి రమేష్‌కు. "నాన్నా! మీరనే దేంటి? " అన్నాడు.

"మల్లీశ్వరి నిన్ను ఎందుకు పెండ్లి చేసు కోవాలనుకుంటుంది? నువ్వు కంప్యూటర్ ఇంజనీర్‌వి అయ్యుండకపోతే, త్వరలోనే అమెరికాకు పోయే అవకాశం లేకుంటే నిన్ను చేసుకునేదా? "

"ఎందుకు చేసుకుంటుంది? ఎవరైనా సుఖం కావాలనుకుంటారు కదా! అమెరి కాకు పోయి సుఖపడవచ్చనుకుంటుంది"

"అమెరికాకు పోవడం సుఖమైతే మరా సుఖం మనలాగా కష్టపడి పైకొచ్చిన మన కులంలోని అమ్మాయికి దక్కితే మంచిది కదా!"

"నాన్నా! మీ మాటలు నాకు సరిగ్గా అర్థం కావడంలేదు"

"మా తరంలోనయితే మన కులాల్లో, కుటుంబాల్లో చదువుకునే అవకాశాలే తక్కువ. మీ తరంలో నయినా ఇతర కొన్ని కులాల వాళ్లకున్నట్టు అవకాశాలు లేవు. వాతావరణమూ లేదు. అయితే ఇలాంటి కుటుంబాల్లో పిల్లల చదువుకోసం నానా కష్టాలు పడతారు. తల్లిదండ్రులు ఒకరో ఇద్దరో బాగా చదువుకొని పేరు తెచ్చుకుంటే ఆనందపడతారు. సగర్వంగా చెప్పుకుం టారు. అలా వచ్చిన వాళ్ళు తమ వాళ్లకోసం తనలాంటి వాళ్లను ఎదిగించడం కోసం కొంతైనా కృషి చేయాలి కదా! అయితే చదు వులతో ఉన్నత స్థితికి ఎదిగిన వాళ్లను కొందరు ఇదివరకే అన్ని అవకాశాలుండి ఎదిగిన ఉన్నత కులాల వారు తన్నుకు

పోతున్నారు. వీళ్లను తమలో కలిపేసుకుంటున్నారు. వీళ్లు తమ మూలాలను మరచిపోతున్నారు. తమ తల్లిదండ్రులనూ, బంధువులనూ అందర్నీ మరచిపోతున్నారు. పరాయీకరణకు గురవుతున్నారు. ఇలా అరుదుగా పైకొచ్చిన వాళ్ళు తమ వాళ్లలోని ఓ అమ్మాయిని చేసుకుంటే ఆ కుటుంబమూ పైకొచ్చినట్టవుతుంది కదా! ఇలా పరాయీకరణకు గురి కావద్దనే నేననేది."

తండ్రిలో నిజమైన సామాజిక విశ్లేషకుడిని చూస్తున్నాడు రమేష్... తండ్రన్నట్టు మల్లీశ్వరి తనకు అమెరికాకు వెళ్లే అవకాశం లేకుంటే పెళ్ళి చేసుకుంటాననేదా? తనను తానే ప్రశ్నించుకున్నాడు. తండ్రి మాటల్లోని తర్కం సబబుగానే కనబడిందతనికి

"మరయితే ఆమెను మన కులం కాదు కాబట్టి దూరంగా ఉంచాలంటారా? "

"ఆమెది నిజమైన ప్రేమే అయితే అందులో ఏ స్వార్థమూ లేకుంటే కులం కానంత మాత్రాన దూరం చేయాల్సిన అవసరం లేదు."

"మరా విషయం తెలుసుకోవడం ఎలా? "

"ముందు ఈ విషయాన్ని స్పష్టంగా తెలుసుకో. ఆమె నిన్ను మాత్రమే ప్రేమిస్తుందా? నీ వాళ్లను, నీ సంస్కృతినంతా ఇష్టపడుతుందా? "

"అంటే ఏంటండీ ఒకప్పటి మన కండెల సంస్కృతిని, కూలినాలి బతుకులను ఆమెందుకు ఇష్టపడుతుంది? " అంది శారద

"చిన్న బాపూ! బ్రాహ్మండ్ల అమ్మాయి తమ్ముణ్ని పెండ్లి చేసుకుంటానంటే ఎందుకు వద్దంటున్నవు? " అన్నాడు లక్ష్మారావు

"అందులోనే ఉంది బిడ్డా కిటుకంతా! నేను వద్దనడం లేదు అది నిజమైన ప్రేమైతే నేనే ఆ పెళ్లి జరిపిస్తాను."

"మరి కొంచెం అర్థమయ్యేలా చెప్పండి నాన్నా!"

"నేను ప్రత్యక్షంగా చూసిన సంఘటనలు ఇలాంటివి ఉన్నాయి. నా మిత్రుడు సాంబయ్యని ఒకాయనుండేవాడు. వాళ్ళు దళితులు. ఆయన చదువుకున్నవాడు. తండ్రి నారటికాడు సాంబయ్య ఉపాధ్యాయుడయ్యాడు. సాంబయ్యను గౌరవంగా పిలిచేవారు. దగ్గరకు రానిచ్చేవారు. సాంబయ్యకిచ్చిన గౌరవం ఆయన తండ్రికిచ్చేవారు కాదు"

"ఆ విషయానికీ, దీనికీ సంబంధమేమిటి నాన్నా?

"చాలా సంబంధముంది. పెళ్ళంటే అటు ఏడు ఇటు ఏడు తరాలను గూర్చి చూసే క్రమం నుంచి ఆదాయం, కట్నం, బతుకుదెరువు చూసే స్థితిలోకి వచ్చాయి కదా! అది మరీ వ్యాపారం కావద్దనే నేను కోరుకునేది."

"మరి నన్నేం చేయమంటారో చెప్పండి? "

"ఆమె నిన్ను మాత్రమే కోరుకున్నదనుకో సాంబయ్య కుటుంబానికి వచ్చినటువంటి సమస్యలు రావచ్చు చాలా కుటుంబాల్లో ముఖ్యంగా పేద జాతుల్నుంచి పైకొచ్చిన తరంలో అమ్మాయి భర్తను మాత్రం స్వీకరిస్తుంది. ఆ కుటుంబ నేపథ్యం, పేదరికం ఆమె కవసరం ఉండవు."

"మరి కొంచెం వివరంగా చెప్పండి నాన్నా"

"ఇలాంటి సమస్యే నాకు తెలిసిన ఓ దళిత కుటుంబంలో వచ్చింది. అప్పుడు ఆ అబ్బాయి నాన్న ఏమన్నాడో తెలుసా? ఆ అమ్మాయి డప్పుకొట్టే మా అయ్యను, చుట్ట దాగే మా అవ్వను, జొబ్బర జొబ్బర ఈగలు మూగే మా ఇంటిని, మురికిమురికిగా ఉండే మా వాళ్లను తనవాళ్ళను స్వీకరిస్తుందేమో అడుగు "అలా అయితే ఆమె నిన్ను నిజంగా ఇష్టపడుతున్నట్టు. "

తండ్రి మాటల గూర్చి ఆలోచిస్తున్నాడు రమేష్.

"మీరు కూడా అట్లనే అంటున్నానని చెప్ప లేరు." అంది శారద

"అవును! రమేష్! పెళ్ళనేది పరస్పరం అర్థం చేసుకునేది కావాలి. అవగాహన



కలది కావాలి. ఒకరికోసం ఒకరు ఒకరి కొరకొకరన్నట్టుగా ఉండాలి. డబ్బుతో, హోదాలతో ముడివడున్నదయితే ఆ పెళ్లికి అర్థమే లేదు. ఆమె అమెరికా వెళ్ళే ఇంజనీరువైన నిన్ను మనస్ఫూర్తిగా స్వీకరిస్తుందనడంలో సందేహం లేదు. బడిపంతులును, రచయితనూ అయిన నన్నూ మామగా స్వీకరించవచ్చు కాని నాకు కావల్సింది అది కాదు... మగ్గం గుంటకే అంకితమై నిరుపేద బతుకు బతికిన మా అమ్మానాన్నలను, అలాంటి వాళ్లను తన వాళ్ళుగా స్వీకరిస్తుందేమో. అడుగు అలాంటి బతుకుల్లో కలిసి పోతుందేమో అడుగు ఆ తర్వాత పెళ్ళి గూర్చి ఆలోచించుదాం."

తండ్రి మాటల్లో ఎంతో లోతున్నట్టు గమనించాడు రమేష్.

భర్త మాటలు పూర్తిగా అర్థం కాకున్నా అందులో సబబున్నట్టే తోస్తుంది. శారదకు కుటుంబాల్లోకి కోడల్లు ప్రవేశించిన తర్వాత జరిగే సంక్షోభం ఆమెకు తెలుసు.

"అలాగే చేద్దాం నాన్నా! ఓ వారం రోజులు తర్వాత నిర్ణయం తీసుకుందాం" అన్నాడు రమేష్.

తర్జన భర్జన పడ్డాడు. మల్లీశ్వరితో విషయం ఎలా చెప్పాలో బాగా ఆలోచించాడు. విషయాలను పదే పదే మననం చేసుకున్నాడు.

ఎలా చెప్పాలో నిర్ణయించుకున్నాడు.

ఆమె దగ్గరికెళ్లాడు.

"మల్లీశ్వరీ! నీలాగా నా బతుకు వడ్డించిన విస్తరి కాదు. మేం కష్టపడి పైకొచ్చిన వాళ్ళం. స్వయంకృషితో జీవితాలను గెలుచుకుంటున్నవాళ్ళం. నేను అమెరికాకు వెళితే మా కుటుంబం ఆర్థిక స్థితిగతులు కొంతైనా బాగుపడతాయి. కానీ, అందర్నీ వదిలి కేవలం సంపాదన కోసం అక్కడికి వెళ్లడం నాకెందుకో ఇష్టం అనిపించడంలేదు. ఇక్కడ కూడా మంచి జీతమే ఉంది కదా! మనిద్దరం కలిసి కుటుంబాన్నాదుకుంటే ఉన్నతస్థితికొస్తాం ఒక్క నాతోనే కాకుండా మా వాళ్లందరితో కలిసి మన కుటుంబం ఎదగడానికి సహకరిస్తావా? " అన్నాడు.

ఇంకా

మల్లీశ్వరి ముఖం వాడిపోయింది.

"రమేష్ ఈ డొంక తిరుగుళ్ళన్నీ ఎందుకు? నేను చాలా సూటిగానే చెబుతున్నాను. కుటుంబం ఆదర్శాలంటూ ఏవేవో పట్టుకొని వేలాడటం నాకిష్టం లేదు. ఇద్దరం అమెరికా కెళితే హాయిగా ఉండొచ్చు. మన కోసం సంపాదించుకోవచ్చు. ఆదర్శాల పేరు మీద జీవితాలను నరకప్రాయం చేసుకోవడం నాకిష్టంలేదు. ఇక్కడ ఉడిగం చేసుకుంటూ మీ కుటుంబంలో పడి ఉండటం నా వల్ల కాని పని. అమెరికాకు వెళ్లేది ఎవరినో ఉద్ధరించటానికి కాదు. మనం సుఖంగా బ్రతకడానికి! నీ నిర్ణయం అదే అయితే మనకు కుదరదు. ఈ పెళ్లితో నేను మీలో కలవడం అసలే కుదరదు. కలిస్తే గిలిస్తే నువ్వే మాలో కలవాలి. అలా అయితేనే నేనీ పెళ్ళి చేసుకుంటాను." అంది నిర్మొహమాటంగా.

ఇప్పుడు రమేష్ ముఖం వాడిపోయింది.

"అంటే నేను నీ కోసం లేదా మన సుఖం కోసం దేశాన్ని, కుటుంబాన్ని, నా వాళ్లందరినీ వదులుకోవాలంటావు." అన్నాడు.

"దాదాపంతే! కావాలంటే నెలకు కొంతో, ఏడాదికో ఆర్నెల్లకో కొంత ఆర్థిక సాయం చేస్తాం. అలా అయితే మీరన్నట్టు కుటుంబ ఆర్థిక స్థితీ కొంత మెరుగుపడుతుంది."

తనవాళ్లకు బిచ్చంగా పదో పరకో వేయాలంటున్న మల్లీశ్వరిని ఆశ్చర్యంగా చూస్తున్నాడు రమేష్.

"అలా అయితే మన పెళ్ళవడం సాధ్యంకాకపోవచ్చు"

'దానికి చేసేదేముంది? అలాగే కానివ్వండి" అని మరోమాట మాట్లాడటానికి కూడా అవకాశమివ్వకుండా వెళ్ళిపోయింది మల్లీశ్వరి.

మల్లీశ్వరి ప్రవర్తన షాక్‌గానే ఉంది రమేష్‌కు. తండ్రి తనకీ సలహా ఇచ్చుండకుంటే తానామె మోజులో పడి కుటుంబానికి దూరమయ్యేవాడినన్న ఆలోచన భరించలేకపోతున్నాడు. అతని కళ్లవెంట నీళ్లు కారుతున్నాయి. తన తాత, తన బంధువులు, నేత పనితో బతుకుతున్న పెదనాన్నా, తన కుటుంబాల వాళ్ళంతా కళ్లముందు కదులుతున్నారు. మల్లీశ్వరితో మాట్లాడిన తర్వాత కొన్ని రోజుల వరకు మనిషే కాలేదు రమేష్. తండ్రికి తన ముఖం కనబడనీయకుండా ఉండడానికి ఊరెళ్లాడు. కొద్ది రోజుల తర్వాత ఇంటికొచ్చాడు.

"నాన్నా! జీవితాన్ని కాచి వడబోసిన వారు మీరు. సామాజిక అవగాహన ఉన్నవారు. ఎంతో మందికి మార్గనిర్దేశనం చేస్తున్నవారు. మల్లీశ్వరి విషయంలో మీరన్నట్టే జరిగింది. ఆమెతో పెళ్ళి తప్పిపోయినందుకు నాకు సంతోషంగానే ఉంది తప్ప బాధేం లేదు. అమ్మా, మీరూ కలిసి అమ్మాయిని నిర్ణయించండి. మీరు చెప్పిన వాళ్ళ మెడలో తాళి కడతాను" అన్నాడు రమేష్.

పైకి చెప్పకున్నా, ముఖంలో కనబడకుండా ప్రయత్నిస్తున్నా రమేష్ బాధపడ్తున్నాడన్న విషయం శంకరయ్యకు తెలుసు.

"అట్లంటవేంది బిడ్డా అసలేమయింది?" అంది శారద.

"ఈ తరం మొత్తం అలాగే ఉంటారని నేను చెప్పడంలేదు కాని సమాజం మేము నుండి నేనులోకి పయనిస్తున్నట్టనిపిస్తుంది. అందులో భాగమే మల్లీశ్వరి కూడా. చాలామంది అలాగే ఉంటున్నప్పుడు నువ్వామె అన్నట్టు చేసినా మేం బాధపడం. నిజమే. ఆదర్శం కోసమో, కుటుంబం కోసమో నీ సుఖాన్ని వదులుకోవడం ఎందుకు? నేను నీకా మాటలు చెప్పింది మీ ఆకర్షణలోని గుట్టు తెలుసుకోవడానికే" అన్నాడు శంకరయ్య.

"నాన్నా! దయచేసి ఆ విషయం వదిలిపెట్టండి. నన్ను మరీ స్వార్థపరుడివి కమ్మని ఆదేశించకండి. ఇపుడామె నా షరతులన్నిటికీ ఒప్పుకుంటానన్నా ఆమెను పెళ్ళిచేసుకోను" అన్నాడు రమేష్.

"నాక్కావాల్సింది ఇలాంటి వ్యక్తే. ఇలాంటి మాటలే అంకుల్. నేను రమేష్‌నే పెళ్ళి చేసుకుంటాను. నాకు ఇలాంటి వ్యక్తిత్వ మున్న భర్తే కావాలి" అంది ఇంట్లోకి అడుగుపెడుతూ మల్లీశ్వరి.

అందరూ ఆశ్చర్యచకితులై చూస్తున్నారు.

"అవును. నేనే మల్లీశ్వరిని. ఈ ఇంటికి కాబోయే కోడలిని. నేను వచ్చి చాలాసేపే అయింది. మీ మాటలు వింటూ బయట నిల్చున్నాను. రమేష్ నుండి ఈ మాటలు వినడానికే ఎదురుచూస్తున్నాను. తన మూలాలు మరిచిపోకుండా తన వాళ్ల కోసం ఎంతో కొంత చేద్దామనుకుంటున్న రమేష్ అంటే నాకిష్టం. మీ కుటుంబ నేపథ్యమూ నాకు తెలుసు. మీలో కలిసిపోయి జీవించాలనే నేను రమేష్‌ను ఇష్టపడ్డాను. రమేష్ అమెరికాకు పోకున్నా, పోయినా ఆతనితోనే జీవితం పంచుకుంటాను" అంది మల్లీశ్వరి.

వాళ్ళు ఆశ్చర్యం నుండి తేరుకోవడానికి మరికొంత సమయం పట్టింది.

"మరి నువ్వు నాతో అన్న మాటలు" అన్నాడు రమేష్ కొద్దిసేపాగి.

"ఆ మాటలతో నీలో అంతర్మథనం చెలరేగింది. నువ్వేంటో నువ్వు తెలుసుకోగలిగావు. చూచాయగా ఉన్న నీ అభిప్రాయాలు స్థిరపడ్డాయి" అంది మల్లీశ్వరి.

శారద ఆమెను పక్కన కూచోబెట్టుకుంది. కాబోయే కోడలిని ప్రశంసాపూర్వకంగా చూస్తున్నాడు శంకరయ్య.

"అంటే మీరు నిజంగానే కలిసిపోతారన్న మాట" అన్నాడు నవ్వుతూ.

"అన్న మాటేంది? ఉన్నమాటే మామయ్యా! విదేశీ మోజులో, డబ్బు మాయలో వెంపర్లాడుతున్న యువతరంలో మూలాలను కొంతైనా పట్టించుకోవాలనుకునే రమేష్‌లాంటి వాళ్ళుండటం అరుదు. అందుకే నాకు రమేషంటే ఇష్టం. మరి మా పెళ్ళెప్పుడు? " అంది మల్లీశ్వరి.

"అప్పుడే పరీక్షలయిపోయాయనుకున్నావా? అదే పెళ్ళి పరీక్షలు. ఇంకా నువ్వు చాలా పరీక్షల్లో పాస్ కావాలి" అన్నాడు శంకరయ్య.

"ఏంటండి మీరు? ఇంకేం పరీక్షలు? ఇంత మంచిపిల్లకు ఇంకేం పరీక్షలు పెడుతారు? ఆ పరీక్షల్లో ఫెయిలయినా ఈమె నా కోడలే" అంది శారద.

"అప్పుడే జత కట్టేశావా? అదేం కుదరదు. నా కోడలు కావాలంటే పరీక్షల్లో పాస్ కావాల్సిందే."

"మీ సాహిత్యంలోనో, ఫిలాసఫీలోనో పెడితే మాత్రం నావల్ల కాదు" అంది నవ్వుతూ మల్లీశ్వరి.

"అవి నా సబ్జెక్టులు. నువ్వు జీవితం పరీక్షల్లో పాస్ కావాలి"

"అవేంటో త్వరగా ముగించండి"

"భారీ కట్నం కావాలంటున్నాడు మా నాన్న" అన్నాడు రమేష్.

"అయితే మీ అందర్నీ జైల్లో పెట్టిస్తాను"

"అమ్మ బాబోయ్ కట్నానికి నువ్వంత వ్యతిరేకివా? "

"కొంత కాదు బోలెడంత వ్యతిరేకిని. కట్నం తీసుకుని పెళ్లి చేసుకోవడమంటే ఒక విధంగా అమ్ముడుపోవడమే కదా. మీ రమేష్‌ను అమ్ముకోవడం మీ కిష్టమా? నిజానికి లక్షలాది కట్నమిచ్చి ఆ ఇంట్లో చాకిరీ చేయాల్సిన అవసరమేముందో చెప్పండి."

"భర్తంటే భరించేవాడు. పోషించేవాడు. జీవితాంతం ఆమెను భరించే భర్తకు కట్నం రూపంలో ఏదో మేరకిస్తే అది తప్పెందుకవుతుంది? "

"మీరీ మాటలు హృదయపూర్వకంగానే అన్నా, నన్ను పరీక్షించడానికే అంటున్నా నా సమాధానం మాత్రం ఒక్కటే. నిజానికి మగవాడు స్త్రీని భరిస్తున్నాడన్నది తప్పు. కుటుంబానికి స్త్రీయే ఎక్కువ ఉపయోగపడుతుంది. ఆమె పనులన్నిటికీ విలువ కడితే జీతం కంటే ఎక్కువే అవుతుంది. ఉద్యోగం

చేసే స్త్రీపై అదనపు భారం పడుతుంది మామయ్యా! పెళ్ళిళ్ళు డబ్బు సంబంధాల యితే అందులో సుఖముంటుందా? "

"ఆ మాటను కాదనడం లేదమ్మా! కాని ఓ కొడుకు, ఓ కూతురు ఉన్నారనుకుందాం. తల్లి దండ్రుల ఆస్తిలోంచి బిడ్డకూ ఆస్తి వస్తుంది కదా! ఆ ఆస్తే కట్నమనుకుందాం. ఇందులో తప్పేముంది? మరి కూతురుకు ఆస్తిలో వాటా అవసరం లేదా? అదే ఇది."

"మామయ్యా! దీనికీ దానికీ సంబంధం పెట్టడం సరైంది కాదు. స్త్రీకి ఆస్తిలో వాటా రావాల్సిందే. కానీ హక్కుగా. అది వేరు. కాని ఆస్తి ఉన్నా లేకున్నా మంచి మొగుణ్ణి కొనాలనే పేరు మీద భారీ కట్నం పేరుతో మగవాళ్ళను కొనుక్కోవడమనేది సరైందం టారా? నిజానికి కట్నం కోసం నానా తంటాలు పడి ఏళ్ళ తరబడి పడ్డ కష్టార్జి తాన్ని కూడబెట్టడం, అప్పులపాలు కావడం దారుణాతి దారుణం కాదా? పిల్లల కోసం ఆస్తులు కూడబెట్టాలనుకోవడమే తప్పం టుంది ఓ రచయిత్రి. కట్నం కోసం సంబంధాలు మార్చడం, భారీ కట్నం కోసం నానా తంటాలు పడటం దారుణం కాదం టారా మామయ్యా! అదిప్పుడెంత సాంఘిక దురాచారంగా మారిందో మీకు తెలి యదా? "

తన కాబోయే కోడలు రమేష్ కంటే ఎక్కువ తెలివికలది, సామాజిక అవగాహన కలదని అర్థం చేసుకోవడానికి ఎక్కువ సమయం పట్టలేదు శంకరయ్యకు.

"ఈ పరీక్షలో నువ్వు నెగ్గావమ్మా! కానీ తల్లిదండ్రులు ఇచ్ఛికంగా తమ కూతురుకు ఏదో రూపంలో ఇచ్చారనుకుందాం. అది తప్పెలా అవుతుంది? " అన్నాడు.

"తమకు ఉండి ఉన్నదాంట్లో కొంతభాగం తన సంతానానికి ఇవ్వడంలో తప్పులేదు. కాని ఇది కట్నం పేరు మీద ఎన్ని వెర్రిత లలు వేస్తుందో మనం చూస్తూనే ఉన్నాం కదా! కట్నం ప్రసక్తి తెచ్చేవాళ్ళన్నా, కట్నం పేరు మీద ఇంతివ్వాలని డిమాండ్ చేసేవా ళ్ళన్నా నాకయితే అసహ్యం."

"ఇంతకీ నీకున్న ఈ సామాజిక అవగాహ నకు నేపథ్యం"

"సమాజమే. చుట్టూ చూస్తున్న విష యాలే"

"మరి నువ్వు మా కుటుంబంలో కలిసి పోగలవా? "

"ఇది చెప్పింది చెప్పడమే అవుతుంది. నాకొక్క విషయం అర్థంకాక అడుగుతు న్నాను మామయ్యా! ఆడవాళ్ళే అత్తగారింటి కుటుంబంలో కలిసిపోవాలి కాని మగవాళ్ళు మాత్రం ఎట్టి పరిస్థితుల్లోనూ అత్తవారి కుటుంబం గూర్చి ఆలోచించకూడదు. అంతేనా? "

మల్లీశ్వరి ప్రశ్నకు ఖంగుతిన్నాడు శంక రయ్య. తాను ఒక్క దిక్కు నుంచే ఆలోచిం చాడు కాని ఈ కోణంలోంచి సమస్యను చూడలేదు. పీడితకుల, పురుష దృక్కోణం లోంచే ఆలోచించిన తనలో పురుషస్వామ్య భావజాలాలు దూరం కాలేదా? తనను తనే ప్రశ్నించుకున్నాడు శంకరయ్య.

ఆమెకేం సమాధానం చెప్పాలో తోచడం లేదు. ఇంతలో మల్లీశ్వరి అంది.

"మామయ్యా! పెళ్లైన స్త్రీ అన్ని విధాలుగా అత్తగారి కుటుంబంలో కలిసిపోవాలనుకోవ డంలో స్వార్థం లేదా! ఇలా కలిసిపోకుంటే గొడవ. పురుషుడు మాత్రం అత్తవారి కుటుంబంతో కలిస్తే అది పెద్ద దోషం. కూతురు గాని, అల్లుడు గాని ఆ కుటుం బాన్ని ఏమాత్రం పట్టించుకున్నా అది తప్పే అవుతుంది. అంటే మనమింకా పురుషస్వా మ్యాధిపత్యంలోనే ఉన్నట్టే కదా!"

ఆమెను ఆశ్చర్యంగా చూస్తున్నాడు శంక రయ్య.

✤ మీ జీవితాలకు సంవత్సరాలను జత చేయడం కాదు. మీరు జీవించే సంవత్స రాలకు ప్రాణం పోయడమే ముఖ్యం. – అలెక్సిన్ కారెల్

"అది నూటికి నూరుపాళ్లు నిజమే నమ్మా! ప్రతి మగవాడు ఎంతో కొంత ఈ లక్షణాల్ని కలిగి ఉన్నాడు. స్త్రీలూ అంతే. ఆలి తరపు వాళ్ళు అందరూ చుట్టాలే లాంటివీ సమాజంలో ఉన్నాయి."

"నాన్నా! ఆదర్శాలు, ఆశయాలు, స్త్రీవాదం, పురుషస్వామ్యం లాంటివి సరే- ఇవి ఉండనే ఉన్నాయి. ఇప్పుడు అసలు విషయాలు మాట్లాడుకుంటే మంచిదేమో!" అన్నాడు రమేష్.

"అవన్నీ మాట్లాడుకోవాల్సింది పెద్దవాళ్ళతో. అట్లని పెద్దవాళ్ళన్న పేరుతో పెద్దరికం చేసి ఒప్పించడం నా పద్ధతికాదు. ఎవరికిచ్చేగౌరవం వాళ్ళకివ్వాలి. అయితే అంతకంటె ముందే మరికొన్ని విషయాలు మాట్లాడాలి."

"ఇంకేం మాట్లాడుతరు? అమ్మాయింటికి పోయి మాట్లాడాలెకాని."

"శారదా! అంత తొందర పడవద్దు నిదానమే ప్రధానమన్నారు."

"ఇంకేం మాట్లాడతారో మాట్లాడండి మామయ్యా!"

"పెళ్ళి చేసే పద్ధతుల గురించి అంటే వివాహ విధి గురించి నాక్కొన్ని స్పష్టమైన అభిప్రాయాలున్నాయి."

"బంగారమసోంటి కోడలు దొరుకుతుంటె ఇంకేమేమో అంటరేంది! మంచిగ శాస్త్రోక్తంగ బాజాభజంత్రీలతోని పెండ్లి చేయాలె కాని దాన్ని గురించి మాట్లాడేదేముంది? మీటింగు పెండ్లంటె మాత్రం నేనొప్పుకోను" అంది శారద

"అప్పుడే అంత తొందర పడుతావెందుకోయ్! మాట్లాడిన తర్వాత అదెందుకు వద్దో చెప్పు."

"మామయ్యా! వివాహం చేసే పద్ధతి విషయంలో మాకు పెద్ద అభిప్రాయాలేం లేవు. మా నాన్ననూ ఒప్పించగలను. వాటి గూర్చి మీరే చెప్పండి."

"కులాంతర, ప్రేమ వివాహాలకు నేనేం వ్యతిరేకిని కాను కాని అవి పైపై మెరుగులతో, ఆకర్షణలతో, అవగాహన లేకుండా చేసేవి కాకూడదు. తల్లిదండ్రులను దూరం చేసేవి, బాధించేవీ కాకూడదు... కనిపించిన వాళ్ళను ఒప్పించి చేస్తే సమస్యలుండవు- వాళ్ళతో కన్నీరు పెట్టించడమూ సరైంది కాదు. మొండికెత్తి ఒప్పుకోకుంటే ఆ సంగతి వేరు."

"అది నిజమే కాని లగ్గాలల్ల పద్ధతుల




## డబ్బుమనిషి

'మా ఆవిడ మరీ డబ్బుమనిషై పోయిందిరా.. చీటికి మాటికి డబ్బడుగుతూ మనశ్శాంతి లేకుండా చేస్తోంది' వాపోయాడో పెద్దమనిషి.

'అయ్యో పాపం.. అలాగా?' బాధపడ్డాడు స్నేహితుడు.

'మొన్న పదిరూపాయలిమ్మంది.. నిన్న ఉదయం ఇరవై అడిగింది. ఇవ్వాళ పొద్దున ఏకంగా పాతిక రూపాయలిమ్మని కూర్చుంది. ఛస్తున్నా..'

'నిజమే ఇలాగైతే కష్టమే. అయినా ఆవిడకెందుకట డబ్బు ఏంచేస్తుందేమిటి?'

'ఏమో.. ఎవడికి తెలుసు అసలు నేనెప్పుడైనా ఇస్తేకదా?'



గురించి చెప్పండ్రి."

"అక్కడికే కద వస్తున్నది... నీకన్నిటికీ తొందరే సరేకాని వంటయిందా?"

"అయింది కొద్దిసేపాగి తిందాం అవేంటో చెప్పండ్రి."

"వివాహవిధి మతాలనుబట్టి, ఒకే మతం లోనే ఉన్నా కులాలనుబట్టి ప్రాంతాలను బట్టి స్వల్పంగా తేడాలతో ఉంది. అయితే ఇవన్నీ సంస్కృత మంత్రాల పఠనంతో ఏం చేస్తున్నారో, చెబుతున్నారో అర్థంకాకుండానే ఉన్నాయి. వివాహవిధిని ముఖ్యంగా బ్రాహ్మణులే చేసేవారు. క్రమక్రమంగా కొన్ని కులాల్లోంచి వాళ్ళ పెళ్ళిళ్ళు వాళ్ళే చేసుకోవడం ప్రారంభమైంది. మన ప్రాచీన పెండ్లి విధానం అష్టవిధ పద్ధతులను పేర్కొన్నది. ప్రాజాపత్యం, దైవము, బ్రాహ్మము, ఆర్షము అనే పద్ధతుల్లో వివాహాలే జరుపుతారు. అసురుల్లో అసురము, రాక్షసుల్లో రాక్షసము, గంధర్వుల్లో గాంధర్వము, పిశాచ జాతుల్లో పైశాచికము ఉన్నాయి. ఇవికాక ఆర్యసమాజ్ వాళ్ళు చేసే వివాహపద్ధతి మరికొన్ని పద్ధతులున్నాయి. సంస్కృత మంత్రాలతో అర్థంకాకుండా ఉన్న పద్ధతి కంటె అందరికీ అర్థమయ్యే విధంగా మంత్రాలయినా, ప్రతిజ్ఞ అయినా ఉండాలని మరో వివాహపద్ధతిని ప్రవేశపెట్టాడు త్రిపురనేని రామస్వామి చౌదరి... ఇందులో భార్యాభర్తలు ఒకరితో ఒకరు ఒకరికొకరు తోడుగా ఉంటామని ప్రతిజ్ఞ చేసుకుంటారు. వాళ్లేం చెబుతున్నారో అందరికీ అర్థమవుతుంది. ఈ పద్ధతిని కమ్మలు బాగా ఉపయోగించుకున్నారు. ఏదేమైనా ఎవరికీ అర్థంకాని వివాహవిధికంటె అందరికీ అర్థమయ్యే భాషలో వధూవరులు ప్రతిజ్ఞ చేసుకుంటే సరిపోతుంది ఇదే నేను కోరుకునేది."

శంకరయ్య ఎలాంటి వివాహపద్ధతి కోరుకుంటున్నాడో అందరికీ అర్థమయింది.

"అంటే మీటింగ్ పెండ్లి చేయాలనుకుంటండ్రు అంతేకద! గా మాట సెప్పుటానికి గిన్ని విషయాలు చెప్పుకస్తిరి నీముక్కేది అంటే తలచుట్టూ తింపి చూపినట్టు." అంది శారద.

"ఈ విషయం గురించి నాకు పెద్దగా అభిప్రాయాలేం లేవు మామయ్యా? నాన్న వాళ్ళతో మాట్లాడుండ్రి! పద్ధతి ఏదయినా వివాహం కావడం ముఖ్యం" అంది మల్లీశ్వరి.

"అందరిముందు వైభవంగా బాజాభజంత్రీలతోని చేసుకోవాలె కాని గసోంటి పెండ్లెందుకండీ. రమేష్‌కు మంచి నౌకరుంది మనమిప్పుడో తీరుగనే ఉన్నట్టేకదా!"

"శారదా! ఇక్కడ చూడాల్సింది ఆర్థిక పరిస్థితి కాదు. ఓ కొత్తపద్ధతి వివాహమంటేందో అందరికీ అర్థమయ్యే పద్ధతి కావాలనే ఈ పద్ధతి ప్రవేశపెట్టాం కొందరిది పాటిస్తున్నారు. ఇక్కడా అన్నీ ఉంటాయి. పిలుచుకోదలుచుకున్న వాళ్ళందరినీ మంచి భోజనాలవీ ఉంటాయి. పిలుచుకోవడమేం. వివాహ విధిలో మాత్రం మార్పుంటుంది."



"ఎట్ల పెండ్లి జేసినా తాళి గట్టుడయితె ఉండాలి. లేకుంటె ఆడపిల్లకు పెండ్లయినట్టు ఎట్ల తెలుస్తంది?" అంది శారద

"పెండ్లయినట్టు తెలువాలని ఏముంది? మరయితే పెళ్ళయినట్టు తెలియడానికి మగవాడికేం చేస్తున్నారు?"

"అవన్నీ నాకు తెలువయికాని తాళయితె ఉండాలె."

"అవును నాన్నా! ఆ సమయంలో వీడియో కూడా తీయాలి."

"ఎందుకు రమేష్ ఇవన్నీ?"

"అమెరికాకు పోవడానికి పెళ్ళయినట్టు రుజువుగా చూపడానికి ఇది ఉపయోగపడుతుంది. ఇద్దరూ వెళ్ళడానికి ఇదవసరం." అన్నాడు రమేష్.

వాళ్ళు చాలాసేపే మాట్లాడుకున్నారు. అన్ని విషయాలు చర్చించుకున్నారు. "ఆ తర్వాతయినా ముందయినా పెళ్ళిని రిజిష్టర్ చేయించాలి.

"జంధ్యం వేసుకునే మనం బీన్‌బాజలతోని జోరుదారుగ పెండ్లి చేసుకోవాలె కాని మీటింగు లగ్గాలు, కాగితాల పెండ్లిళ్లు మంచిగనిపించడంలేదు."

"శారదా నువ్వింకా చాలా విషయాలను అర్థం చేసుకోవాలి. మన మల్లీశ్వరి చెబుతుందిలే."

శంకరయ్య మాటలకు నిష్కపటంగా నవ్వింది శారద... కొద్దిరోజుల్లోనే రమేష్, మల్లీశ్వరి పెండ్లి కుదిరింది. శంకరయ్య కోరినట్టుగానే పెళ్ళి జరిగింది.

"మేము త్రికరణ శుద్ధిగా అంటే మనో వాక్కాయ కర్మల ఒకరినొకరం ఇష్టపడ్డాం. ఒకరికొరకొకరం అన్నట్టు బతుకుతాం కుటుంబ గౌరవం కాపాడుతాం సమాజ హితానికే పాటుపడుతాం. సర్వకాల సర్వావస్థలయందు కూడా ఒకరిని వదలకుండా మరొకరముంటాం. భార్యంటే సహధర్మచారిణి. భర్తంటే ప్రాణసఖుడు. ఒకరిపై ఒకరి ఆధిపత్యం లేకుండా కలిసిమెలసి ఉంటాం. ఒకరిపై మరొకరుంచిన విశ్వాసాన్ని వమ్ము చేయకుండా జీవితాంతం ఒకరి అడుగులో మరొకరి అడుగేస్తూ బతుకుతాం. భర్త దేవుడు కాదు. భార్య బానిసా కాదు. భార్యాభర్తలిద్దరూ మంచి స్నేహితులు కష్టాల్లో సుఖాల్లో కలిమిలో లేమిలో కలిసి మెలసి ఉండే మంచి మిత్రుల లాంటి

వాళ్ళు. మంచి మిత్రులమైన మేము ధర్మ బద్ధంగా భార్యాభర్తలమై సమాజగమనానికి దోహదం చేస్తాం... ధర్మబద్ధంగానే బతుకుతాం చివరి శ్వాసవరకూ కలిసే ఉంటాం.'

అన్న ప్రతిజ్ఞతో శంకరయ్య, మల్లీశ్వరి ఒక్కటయ్యారు.

★ ★ ★

లక్ష్మిరాజం ఆత్మహత్య చేసుకున్నాడు.

ఏడుస్తున్నారు. రకరకాలుగా మాట్లాడు కుంటున్నారు. లక్ష్మిరాజం చావుకుగల కారణాలను, పరిస్థితులను తమకు తోచిన విధంగా మాట్లాడుతున్నారు.

"వచ్చే పాయె పాపం లక్ష్మిరాజం! పసి పొరగాండ్లను విడ్సిపెట్టిపాయె. పొల్లెట్ల బతుకాలె? పొల్లగాండ్లెట్ల బతుకాలె. ఈ మరమగ్గాలు పాడుగాను. ఎంతమంది బతుకులను నాశనం జేత్తయో."

"చేసుడేంది? ఒగలెను కొగలు అందరు దారిపట్టనే వట్టిరి అరె నీయవ్వ! గిట్లవుండేది? దేశానికి బట్టలందించే సాలోల్లు ఆత్మహత్యలు చేసుకునుడేంది?"

"ఏపో! ఏం మాట్లాడినవు. గిదేమన్న మనిషి బతికే కాలమేనా? దేశానికి అన్నమందించే రైతు ఆత్మహత్య చేసుకోంగ ఇగ మనసొంటి సాలోల్ల నెవ్వలడిగిండ్రు?"

"ఎంతయిన గిదంత అడివికే వచ్చింది. అరెనీయవ్వ గామొగ్గం గుంటల పనిజేసుకుంట బతికినప్పుడు గింతది లేకుండె. కుండల గలది తినెటోల్లం పిల్లగాండ్లను సాదుకునెటోల్లం. బాగ సంపాయించలేదు కావచ్చుగని గింత గందరగోళమయితె లేదు గద!"

"ఎప్పటి కష్టాలప్పుడే పటు."

"ఏం కష్టాలున్నా గింత పాపకారి కాలమయితె లేదు. గా పడుసు పోరగాండ్లు ఆత్మహత్యలు చేసుకునుడేంది మరి?"

"ఏం జేత్తదుమరి? తిండికే లేకపోతె ఏంజెయ్యమంటవు? మరమగ్గాలని కొనంగానే ఏమచ్చె... అన్ని ధరలు పెరిగె. గవర్నమెంటిచ్చేటియి ఇయ్యకపాయె. నేసిన బట్టను కొనెటోడు లేకపాయె. ఓ దిక్కేమొ అప్పులాయె. మల్ల అప్పులు పుట్టే వసతి లేకపాయె. ఉరిడిసినేబోదునా ఉరి పెట్టుకొని సత్తునా అన్నట్టాయె బతుకులు. మానం బోయినంక పానమెందుకని ఉరి పెట్టుకొని సావవట్టిరి. గదే నయ్యమనుకున్నట్టున్నడు లక్ష్మిరాజం."

"అనుకున్నడు నిజమేకాని అందర్నిడిసి పోతె ఐపోతదా?"

"ఓ నీయవ్వ మా చెప్పినవు తియ్యి. తీరి పారినోళ్ళు గట్లనే మాట్లాడతరు. పానమంటె తీపి లేందెవ్వలకు? ఎవ్వలకయిన సచ్చిపోవ న్ననుంటదా? నూరేండ్ల ముసలోడయినా ఇంకొంచెం బతుకుతె మంచిగుండు ననుకుంటడు. కాని గిట్ల సచ్చుడంటేమన్నట్టు? ఎన్ని కష్టాలుంటె, బతుకెంత దుర్భరమైతె గిట్లజత్తరు. అనంగనే ఐపోతదా? వేలకోట్ల లక్షల కొద్దిబాకీలు ఎగపెట్టెటోల్లు ఎగవెట్టుతరు. కాని మానం మర్యాదతోని బతికినోల్లు అప్పులయితె భరించలేరు. అందుకే గిసోంటి చావులు."

"ఆత్మహత్య చేసుకోవడమనేది ఓ తాత్కాలిక నిర్ణయం. ఆవేశంలో, అంతులేని బాధలో చేసుకునేది. ఆ సమయంలో బయటకు తీసుకపోతె, ఏదన్న ఆటంకం కలుగుతె ఆపచ్చు."

"ఒకలను జూసి ఒకరన్నట్టు సచ్చిపోవట్టిరి. ఒకరి చావు ఇంకొకరికి ప్రేరణోలె అయితంది."

"అది గుణపాఠం కావాలెగని ప్రేరణ కావద్దు."

"పత్తిరైతు గట్లనే సచ్చిపెయిండా? వాళ్ళయితె అక్కడ సచిపెయిండ్రని ఇక్కడ, ఇక్కడ సచ్చిపెయిండ్రని అక్కడ చచ్చిపెయిండ్రు. పురుగులను చంపుటానికని తెచ్చిన మందు రైతును చంపుటానికయింది."

"వాళ్ళను పత్తెత్వ్వలెయ్యన్నరు మరి' బాగ సంపాయించాలనే కద వరిపంటో మక్కలో పండించుకుంట బతుకుతె గాకపోవునా? అరె నీయవ్వ! ఏందిది? మన భూముల్ల పత్తి పండుతదా? పత్తికేం జెయ్యాలెన్న ఎట్ల చెయ్యాలె అనేవాట్ని పట్టించుకోకుం డానే ఏసిరి. వేలు సంపాయించాలె నను కుంటె వేల అప్పులాయె మరవ్వి తీర్చు టెట్ల? గందుకే చచ్చిరి."

"ధైర్యంగ బతుకాలెగని ఆత్మహత్యలట."

"అప్పులయితె గప్పుడు దెలుస్తది ధైర్యమే పాటుంటదో?"

"వెంకటనర్సేమో బాగ మాట్లాడుతండు. ఓ దిక్కు అదని, ఇదని, లాభాలని ఉరుకు లాడుతంటె ఎట్లూకుంటరు? నలుగురితో నారాయణ."

"మొగ్గం గుంటలను నమ్ముకుంటె లాభం లేదని సాంచెలను నమ్ముకున్నరు. సాంచెలచ్చి మొగ్గం గుంటలన్ని పూడుకపె యినయి."

"పోటి పోటీ పోటీ ఇంకా ఆధునిక మిల్లు లచ్చి సాచాల పినగూడ పంటంది. అందుకే గీ ఘోరాలు."

"బియ్యం పండిత్తె చాలదని పత్తికి, చేపల చెరువులకు పొయ్యి రైతులు చచ్చినట్టే యంత్రాలెంటవడి పోటీల తట్టుకోలేక సాలీలు సత్తున్నరు. పోటీ పేరుతో చావులు తప్పుత లేవు."

వాళ్ళ మాటలు వింటున్న శంకరయ్య కళ్లవెంట నీళ్ళు కారుతున్నాయి. కడుపు లోంచి సొద పెల్లుబికి వస్తుంది. ఆ ఆవేద నను పొంగుకొస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేక భోరుభోరునా ఏడుస్తున్నాడు.

తమ్ముడు గోడుగోడున ఏడ్వడం చూసి ఏడుపాపాడు వీరయ్య. శంకరయ్యను ఆశ్చ ర్యంగా చూస్తున్నాడు. అందరికీ ధైర్యం చెప్పేశంకరయ్య, చదువకున్న వాడయిన తమ్ముడు ఆడవాళ్ళకంటెక్కువగా ఏడుస్తుం డటం వీరయ్యకూ దుఃఖం తెప్పిస్తోంది. అన్న కొడుకైన లక్ష్మిరాజం మరణమే శంక రయ్యతో అంతగా ఏడిపిస్తుందని వాళ్ళంతా భావిస్తున్నారు. కాని అతని అంత దుఃఖా నికి కారణం ఒక్క లక్ష్మిరాజం మరణం మాత్రమే కాదు. యంత్రాలకు బలయిన, బలికాబోతున్న ఎంతోమంది.

ఏడ్చి ఏడ్చి కళ్లు తుడుచుకున్నాడు శంక రయ్య.

అసలేం జరిగింది? ఏం జరుగుతున్నది? తాను వృత్తులను వదులుకోవాలన్నాడు. ఇది సరైందేనా? జరుగుతున్నదేంటి మరి? చదు వులు, ఇతరత్రా అన్ని పనులు చేసుకోవా ల్సిందే కాని అందరూ తన కొడుకుల్లా ఉన్నత చదువులు చదువగలరా? మరి మిగతా వాళ్ళ సంగతి? ఒకటి రెండు తరా లైనా పూర్తిగా అందుకోకముందే ఉన్నత చదువులు ఖరీదుగా మారిపోతున్నాయి. చదువులే ఖరీదైనవయిపోతున్నాయి. చదువు లకోసం అంత డబ్బు పెట్టడం ఎంత మందికి సాధ్యమవుతుంది. ఇదంతా ఏంటి?

ఇంతకీ తన వాళ్ళిలా ఆత్మహత్యలకు పాల్పడటానికి అసలు కారణాలేంటి? ఈ పోటీవల్ల వచ్చేదేంటి? వాళ్ళు మాట్లాడుకుం టున్న మాటలు తన కళ్ళు తెరిపిస్తున్నాయి.

అవును నిజం పోటీవల్లే ఇదంతా జరుగు తుందా? పోటీ అంటే దుర్మార్గం చేట్లో తవుడు పోసి కుక్కలకు కాట్లాట పెట్టడం లాంటిదేనా ఇది? చదువుల్లో పోటీ పిల్లల ఆత్మహత్యలు. వ్యవసాయంలో పోటీ రైతుల ఆత్మహత్యలు. ఇప్పుడు యంత్రాల బట్టల్లో పోటీ. సంపాదన పద్మశాలీలు ఆత్మ హత్యలు ఎంత దుర్మార్గం.

ఇంతకీ నేత కార్మికులు ఆత్మహత్యలెందుక చేసుకుంటున్నారు? సిరి సంపదలకు నిల యంగా ఉండి సిరిసాలగా పేరుపొందిన సిరి సిల్ల నేడెందుకు ఉరిశాలగా మారింది? అస లేమవుతోంది? జరుగుతున్న దేంటి? తన తండ్రి కాలమే నయమా? అంటే అంటే?

తాను అభివృద్ధి నిరోధకంగా ఆలోచిస్తు

న్నట్టా? ఇంతకీ ఏది అభివృద్ధి? ఏం జరుగుతుందసలు?

అప్పుడెప్పుడో చాలాకాలం క్రితం ఎక్కడో చదివిన గుర్తు రైల్వే పట్టాలు పడినతర్వాత ఆ రైళ్ళు పద్మశాలీల గుండెలమీది నుండి పయనించినట్లయిందని చదివాడు. తాను దాన్ని ఖండించాడు. పారిశ్రామికీకరణ తన లాంటి వాళ్ళకెంతోమందికి మేలు చేసిందని వాదించాడు. తాము అభివృద్ధి చెందడానికి దోహదం చేసిందన్నాడు. అది నిజమేనా? అప్పటి తన అభిప్రాయాల్లో మార్పు వస్తుందా?

ఇంకా తాను అనేక విధాలుగా వాదించాడు. ఊళ్లో ఉంటే అభివృద్ధి సాధ్యం కాదన్నాడు. ఊరంటే ఫ్యూడల్ కేంద్రమన్నాడు. వృత్తులు దండుగన్నాడు. ఊరు తమకు దుఃఖాన్ని, అవమానాలనే మిగిల్చిందన్నాడు. ఇంకా ఇంకా చాలా వాదించాడు. కాని జరిగిందేంటి? జరుగుతున్నదేంటి? పారిశ్రామికీకరణతో పాటు గ్లోబల్ మాయనూ సమర్థించాడతను. కాని జరుగుతున్నదేంటి? పారిశ్రామికీకరణ, గ్లోబల్ మాయలతో వృత్తి పనుల వారంతా కుప్పకూలిపోతున్నారా? ఏళ్ళ ఆదాయమార్గాలు మూసుకుపోతున్నాయా? తనలాంటివాళ్ళు కొందరు చదువుకోని పిల్లలను ఉన్నత చదువుల చదివించి పైకి రావచ్చు కాని చాలామంది కుప్పకూలిపోతున్నారు. ఎంతోమంది ఉపాధిని కోల్పోతున్నారు. అవును ఇది నిజమేనా? ఓ మిత్రుడన్న ఈ వాదంలో చాలావరకు వాస్తవాలే ఉన్నాయా? రైలు పట్టాలొచ్చి ఎడ్లబండ్ల వృత్తివారికి, సాంప్రదాయ వృత్తులవారికి విఘాతం కలిగించాయి. సాంచాలొచ్చి మగ్గం గుంటలను, షటిల్ గుండలను మూసేశాయి. పరిశ్రమలొచ్చి వనరులన్నిటినీ తోడుకుంటూ ఏం మిగులకుండా చేశాయి. చేస్తున్నాయి. కులాలు, కులాలతో వస్తున్న అంతరాలను తొలగిస్తే, పనికి విలువిచ్చే సంస్కృతి ఏర్పడితే వృత్తుల ద్వారా పనులు ఎంత అద్భుతమైనవి? పారిశ్రామికీకరణతో జరిగేవి మాత్రం వృత్తిపనుల్లాంటివి కావా?

ఆలోచిస్తూనే ఉన్నాడు శంకరయ్య.

గోడ కొరిగి కళ్ళు మూసుకున్నాడు. కళ్ళ వెంట నీటి బిందువులు కారుతూనే ఉన్నాయి. వచ్చేవాళ్ళు వస్తున్నారు. పోయేవాళ్ళు పోతున్నారు. ఎవరెవరో వచ్చి ఫోటోలు తీసుకుంటున్నారు. బయటంతా అల్లరల్లరిగా ఉంది. పంచనామా కోసం, ఇతర పనుల కోసం సన్నాహాలు జరుగుతున్నాయి.

శంకరయ్య తలపట్టుకొని కూర్చున్నాడు. లక్ష్మిరాజం ఎందుకు ఆత్మహత్య చేసుకున్నాడు? సిరిసిల్ల నేత కార్మికుల నేతపరిశ్రమను పరిశీలిస్తే లక్ష్మిరాజం ఆత్మహత్యకు గల కారణాలు అవగతమవుతాయి. వాళ్ళందరివీ మరమగ్గాల చావులే. లక్ష్మిరాజందీ అంతే ఇలాంటివాటిని వేరుగా చూడటానికి వీల్లేదు.

సిరిసిల్లను కళ్ళముందు సాక్షాత్కరింపచేసుకున్నాడు శంకరయ్య. 'చేనేత నుంచి మరమగ్గాల వరకు బాగానే జరిగింది. కార్మికులు తట్టుకొని నిలబడగలిగారు. ఆ మార్పులను చాలామంది తట్టుకొని నిలువగలిగారు. కానీ, ఈ గ్లోబల్ మాయను, మార్పులను అందుకోలేకపోయారు. అనారోగ్యకరమైన పోటీ రైతుల ప్రాణాలను తీసినట్టే నేత కార్మికుల ప్రాణాలను తీసింది. తీస్తుంది. దుర్మార్గమైన పోటీ సంక్షేమ పథకాల కుదింపు మరింత సంక్షోభంలోకి నెట్టివేసింది. విదేశీమోజు, విదేశీ వస్త్రాల నాణ్యత, ఆ నిగనిగలు, ఆ మాయలో కొట్టుమిట్టాడుతూ నేత కార్మికులు నాశనమయ్యారు. రైతులను బలిదీసుకున్న రూపాయే, ఆ సంస్కృతే నేత కార్మికుడినీ బలిదీసుకుంది.

సిరిసాల ఉరిశాల అందుకే అయింది' తనలో తానే గొణుక్కుంటున్నాడు శంకరయ్య.

'వ్యవసాయం కాని, నేత పరిశ్రమ కాని వృత్తిగా, బాధ్యతగా స్వీకరించబడినపుడు బాగానే నడిచాయి. అవి వ్యాపారంగా మారిన తర్వాతే సమస్యలొస్తున్నాయా? ప్రశ్నించుకున్నాడు శంకరయ్య.

'పోటీ బిడ్డా పోటీ ఆ పోటీకి నువ్వు బల య్యావు.' ఏడుస్తూ అన్నాడు శంకరయ్య.

బజారునిండా జనాలు ఇంటినిండా జనం ఏడ్పులు. హాహాకారాలు. పోలీసులొచ్చారు. వివిధ భంగిమల్లో ఫోటోలు తీసుకుంటు న్నారు. పోస్ట్ మార్టం కోసం శవాన్ని తర లిస్తున్నారు.

"నేత కార్మికులను ఆదుకోవాలి. ఆదుకో వాలి.

సబ్సిడీలను పునరుద్ధరించాలి.

కార్మికులకు ఎక్స్‌గ్రేషియా ఇవ్వాలి.

ప్రభుత్వం నుండి ఆర్థిక సాయం చేయాలి.

నేత కార్మికులు నినాదాలిస్తున్నారు. కేకలు పెడుతున్నారు.

ప్రభుత్వం నుండి హామీ లభించాలి. శోకా లతో, స్లోగన్లతో ఆ వాడ ప్రతిధ్వనిస్తున్నది.

"భాస్కర్! నువ్వు మంచి జర్నలిస్టువు లాభాపేక్ష లేకుండా కులం కోసం, సమాజం కోసం పనిచేస్తున్నవాడివి. షోలాపూర్, భీవండి, సిరిసిల్ల, నిజామాబాద్ ప్రాంతాల్లో విస్తృతంగా పర్యటనలు చేసినవాడివి.- అసలేం జరుగుతున్నది? ఈ సామాజిక పరి ణామాల లక్ష్యమేంటి? శ్రమజీవులైన మన వాళ్లెటుపోతున్నారు? జరుగుతున్న పరిణా మాలు పీడిత జీవులకనుకూలమైనవేనా? ఈ ప్రశ్నలన్నీ నన్ను వేధిస్తున్నాయి. ప్రపం చీకరణ పరిణామాల వల్ల లాభాలే జరిగా యని వాదించాను. దేశీయ పరిశ్రమలు పోతే నష్టపోయేది మనదేశంలోని పెట్టుబడి దార్లు తప్ప మనలాంటి శ్రామిక కులాల వారు కాదని వాదించేవారికి మద్ధతు పలి కాను. వ్యవసాయాలు దెబ్బతింటే మునిగిపో యేదేంటి? మనవాళ్లకేమన్నా భూములు న్నాయా అనేవాళ్లూ ఉన్నారు. అంతా గజి బిజి ఏదో తెలియని స్థితి లక్ష్మీరాజం మరణం నాలో అంతర్మథనాన్ని లేపింది. ఎన్నో విషయాలు గూర్చి పునరాలోచించే టట్టు చేసింది. అసలు జరుగుతున్నదేంటి? ఏమవుతుంది? ఒక్కసారి చర్చించుకుందాం మనల్ని మనం పునర్మూల్యాంకనం చేసు కుందాం సీతారాం గారూ! మీది సిరిసిల్ల సీనియర్ రైటర్ మీరు. యాభై అరవైలలో మాండలికంలో కథలు రాసారు. లక్ష్మయ్య గారూ! మీరీ ఊరివారే. కష్టపడి జీవితాన్ని గెలుచుకునే క్రమంలో ఉన్నవారు. కరీంనగ ర్‌లో ఉంటున్నారు. నలుగురి పిల్లల్లో ఇద్దర్ని డాక్టర్లు, ఇద్దరిని ఇంజినీర్లను చేసినవారు. ఇద్దరు కొడుకులను అమెరికాకు పంపించారు మచ్చయ్య మామా! నువ్వు మా నాన్న కంటె కూడా పెద్దవయసు వాడివి. మూడు నాలుగు తరాలను చూసినవాడివి. మన మంతా ఒకసారి మనల్ని మనం విశ్లేషించు కుందాం ఓ దిక్కు ప్రపంచీకరణ పేరు మీద మాయాజాలం, మరో దిక్కు కులచైతన్యం, పెల్లుబుకుతున్న కాలం. విషయాలనెలా అర్థం చేసుకోవాలో తెలియని సందిగ్ధ స్థితి ఇంకా చాలామందే ఉన్నారిక్కడ. అకాల మరణం చెందిన లక్ష్మీరాజం కర్మ రోజున మనమీ విషయాలను మాట్లాడుకుంటే మంచిది. ఈ ఊరును కేంద్రంగా జరిగిన విషయాలను పునర్‌మూల్యాంకనం చేసు కుందాం." అన్నాడు శంకరయ్య.

వాకిట్లో వేసుకున్న టెంట్ కింద చాలా మందే కూర్చొనున్నారు.

"అవును! ఈ విషయాలు మనలో కొంత అవగాహన పెంచటానికి ఉపయోగపడ తాయి. కర్మంటే తిని పోవడమే కాకుండా మనల్ని మనం విశ్లేషించుకోవడం మంచిదే." అన్నాడు గూడూరి సీతారాం.

మనం గతంలో చాలా వెనుకబడి ఉన్నా మన్న ఆత్మన్యూనతా భావంతో మాట్లాడు కుంటే వచ్చేదేం లేదు విషయాలను వాస్త

వికదృష్టితో పరిశీలించి ఎలా ఉపయోగపడుతామనే పద్ధతిలో పోవాలి" అన్నాడు డాక్టర్ లక్ష్మయ్య.

"నా చిన్నతనంలో ఉడిది పడింది. ప్లేగు రోగంతోని వందలు, వేల మంది చనిపోయింద్రు... అప్పుడు కరువులొచ్చినా, కాటకమచ్చినా కష్టమే ఉండేది. దొరల కాలమే నడిచేది. నిజాం నవాబుకు దొరలకు దగ్గరి సంబంధాలుండేవి. మనోల్లకు అప్పుడేముండె ఆకలే. మెల్లమెల్లగ పైకొస్తున్నరు మనోల్లు. నేనీ ఊరికి కట్టుబట్టలతోని వచ్చినోన్ని. మా వంశవృక్షం పెరిగింది. మునిమనుమలను చూసిన ఈ ఊళ్ళె అందరికంటె ఎక్కువ వయసు నాదే. మొన్న మొన్నదాక వేముల వెంకటనర్సు, వేముల పోచాలు ఊళ్ళో అందరికంటే ముసలోల్లుండిరి. వాళ్లు పోయింద్రు. నాకయితె గప్పటికంటే గిప్పుడే మనోల్ల బతుకులు మంచిగున్నయనిపిస్తుంది." తన అనుభవాలను చెప్పాడు మచ్చయ్య.

"మనవాళ్ళలో కొందరికి భూములున్నా భూమే, వ్యవసాయమే ప్రధానవృత్తిగా బతకడం అలవాటులేదు. మనది ఒకవిధంగా పారిశ్రామిక మనస్తత్వమే. ఊళ్ళో భూములవీ పెద్దగా లేకపోవడం వల్ల వ్యవసాయ కుటుంబాల వారికున్నట్టు గ్రామాలను వదలడం పాపమన్న ఆలోచనుండదు. బతుకుదెరువుకోసం వలసలు పోవడం అతి సాధారణం. మనవాళ్ళు నేత కార్మికులుగానే కాకుండా బీడీ కార్మికులుగా కూడా అత్యధిక సంఖ్యలో ఉన్నారు. బొంబై పూనాలకు చాలాకాలం క్రితమే వలసపోయారు. అక్కడ బీడీల పరిశ్రమను చేపట్టారు. సమ్మెలు చేశారు. జైల్లో పడ్డారు. ఆ తర్వాత ట్రేడ్ యూనియన్ల వైఫల్యం వల్ల ఇది స్త్రీల పరిశ్రమగా మారింది. కుటీర పరిశ్రమే అయినా ఆదాయాన్నిచ్చే వృత్తయింది. జగిత్యాల నుంచి నిజామాబాద్ వరకు స్త్రీల ప్రధాన ఆదాయం బీడీలు చేడయమే. ఇది వాళ్ళ కుటుంబాలకెంతో ఉపయోగపడుతుంది.

మనవాళ్ళకు ముఖ్యంగా మహారాష్ట్రతో ఎక్కువ సంబంధాలుండేవి. ఇప్పటికీ ఉన్నాయి. వలసలకు మహారాష్ట్రనే కేంద్రంగా చేసుకున్నారు. మహారాష్ట్ర నుంచి ఆర్.ఎస్.ఎస్.ను, ఆ భావజాలాన్ని మన రాష్ట్రానికి తీసుకొచ్చింది ప్రధానంగా పద్మశాలీలే. తెలంగాణ నుంచి అది క్రమక్రమంగా రాష్ట్రమంతటా వ్యాపించింది. ఉద్యమాలు నడిపిన చరిత్రా మనవాళ్లకుంది. అవ్వబాంచెను అయ్యబాంచెను అనుకుంటూ వినయంగా ఉండేవాళ్ళే జగిత్యాల జైత్రయాత్రను కొనసాగించారు. కల్లూరి నారాయణ ఉద్యమాన్ని నడిపాడు. ప్రజాస్వామిక చైతన్యం కోసం పోరాటాన్ని సాగించారు. స్వాతంత్ర్యానికి ముందు ఆ తర్వాత జరిగిన ఉద్యమాల్లో అసువులు బాసారు. ఉదయం ఉద్యమం నడిపిన పోశెట్టిని దొరలే చంపారు. తమతో సమానంగా, ఇంకా బాగా చదువుకుంటున్న వాళ్లను కొందరు దాతలు ఓర్చేవాళ్లు కాదు. స్వాతంత్ర్యానంతరం చదువుకున్నతరంలోని కొందరిని ఈతకని తీసుకెళ్ళి నీళ్ళలో ముంచి చంపడమూ జరిగింది. ప్రజాస్వామిక చైతన్యం కోసం మనవాళ్ళు చేసిన ఉద్యమాలను అగ్రకులాల వాళ్ళు చేతుల్లోకి తీసుకున్నారు. వీళ్ళను వెనుకకు ఆర్థికంగా, ఇతరత్రా బలంగా ఉన్న అగ్రకులాల వాళ్ళు రాజకీయాలనూ హస్తగతం చేసుకున్నారు. అందువల్లనే ఇతర రంగాల్లో మనవాళ్లు ముందున్నా రాజకీయాల్లో వెనుకబడినట్టు కనబడటం."

కొక్కుల భాస్కర్ విశ్లేషణనందరూ శ్రద్ధగా వింటున్నారు. అవును ఆ తర్వాతికాలంలో చదువులు, వ్యాపారానికి ఇచ్చిన ప్రాముఖ్యత మనవాళ్ళు రాజకీయాలకివ్వలేదు. అందుకే రాజకీయాల్లో ఇతర రంగాల్లో ఉన్నట్టుగా ముందున్నట్టు అగుప

✤ ప్రార్థనతో ప్రపంచాన్ని మార్చలేము. అయితే ప్రార్థన మనుషులను మార్చగలదు

– బర్టన్ హిల్స్

డరు" అన్నాడు వేముల వెంకటేశం.

"చేనేత సహకార సంఘాల వల్ల మన వాళ్లు కొంత అభివృద్ధిచెందారు. వీటికి ఆద్యులుగా గుంటుక నరసయ్యగారిని చెప్పు కోవచ్చు. గుంటుక నరసయ్య శిష్యుడే కొండా లక్ష్మణ్ బాపూజీ పద్మశాలి కులం లోంచి రాజకీయాల్లోకి వచ్చి ఎదిగిన వాళ్లలో ప్రముఖుడని చెప్పవచ్చు. ఈతడు మనజాతి కోసం ఎదుగుదల కోసం కృషి చేసినమాట నిజమే ఆ పరంపరను కొనసా గిస్తూ రాజకీయాల్లో కూడా బాగా ఎదిగి జాతిని శాసించగల వ్యక్తి వస్తే బాగుండేది కాని రాలేదు. ఇకముందు వస్తారన్న ఆశ ఉంది." అన్నాడు లక్ష్మయ్య.

"ప్రతి జాతిలో వైతాళికుడనదగే వ్యక్తి వస్తే ఆ జాతి అన్ని రంగాల్లో ముందుకు పోతుంది. బహుశా ఇలాంటి వ్యక్తిని గురించే కావచ్చు సుమతీ శతకకారుడు కులములోన ఒకడు గుణవంతుడుండె నా కులము వెలయు వాని గుణము చేత అనే పద్యం రాశాడు. దళిత పీడిత జాతులకు అంబేద్కర్ గొప్ప వైతాళికత్వం నెరిపారు. అంబేద్కర్ కృషి వల్ల, అతని రచనల ప్రభావం వల్ల దళితుల్లో చెప్పుకోదగిన జాగృతి వచ్చింది. త్రిపురనేని రామస్వామి చౌదరిలాంటి వైతాళికుల వల్ల కమ్మలు చైత న్యవంతులయ్యారు. అన్ని రంగాల్లోనూ గణ నీయంగా అభివృద్ధి చెందారు. అలాంటి వైతాళికులే మనజాతిలోనూ కావాలి."

"అంటే రచయితగా నువ్వు కులవ్యవస్థను ఇంకా ప్రోత్సహిస్తున్నావా శంకరయ్యా! ఆ కులాలు మనకేమిచ్చాయని?" అన్నాడు బొద్దుల తిరుపతయ్య.

"కుల వ్యవస్థ సుస్థిరంగా ఉండాలని నేను కోరుకోవడంలేదు. కులవ్యవస్థ దుర్మార్గమై నదే. కాని ఇది నిర్మూలింపబడాలంటే ఒక్క రోజులో అయ్యే పని కాదు. ఇవి ఇలాగే కొనసాగడానికి వీటివల్ల ప్రయోజనం పొందే రాజకీయులు ప్రయత్నాలు చేస్తూనే ఉంటారు. అందుకోసం మనం చేయాల్సిం దేంటి? కులవ్యవస్థ నిర్మూలనకు కృషి చేస్తూనే కులం వల్ల వచ్చిన అంతరాలను, భేదాలను తగ్గించడానికి ప్రయత్నం చేయాలి. అందుకోసం పీడిత కులాల్లో చైతన్యం రావాల్సిన అవసరముంది. కొద్ది కాలంగా దేశమంతటా చాలా కులాల్లో చైతన్యం రావడం, సంఘాలు ఏర్పడటం గమనిస్తూనే ఉన్నాం. ఇందులో కొన్ని రియాక్షనరీ సంఘాలు కూడా ఉన్నాయి." అన్నాడు శంకరయ్య.

"మరి ఈ వృత్తుల గురించి మీ అభిప్రా యమేంటి? "

'ప్రతి దేశంలోనూ వృత్తులున్నాయి. కాని కులాలు లేవు. కులాలవారీగా వృత్తులు చేయడమనేది ఇక్కడే ఉంది. క్రమక్రమంగా అదీ పోతుంది. అయితే ఈ వృత్తులున్నా ఆ వృత్తులు చేసేవారికి ఇతర దేశాల్లో ఉన్నట్టు ఆస్తులు, ఆదాయం, అధికారాలుంటే బాగుండేది. అలా అయితే కులాలు వాటి కవే మాయమయ్యేవి. మనదేశంలో అన్ని రకాల పనులు చేస్తూ బతికే శ్రమజీవులకు కాకుండా విశ్రాంతి కులాలవారికి, కర్రపె త్తనం గాళ్లకు ఆస్తులున్నాయి. అధికారాలు న్నాయి. ఈ అంశాన్ని తొలగిస్తే ఈ వ్యవ స్థలో ఉన్న కుళ్ళు, అంతరాలు పోతాయి. పని సంస్కృతికి పనిచేసే వాళ్ళకు విలువని చ్చినపుడే అది సాధ్యమవుతుంది"

శంకరయ్య విశ్లేషణ అందరికీ అర్థం అయినట్టే అనిపించినా పూర్తిగా అర్థంకా లేదు.

"అది నిజమే శంకరయ్యగారూ! కానీ మనదేశంలో రాజకీయాలు గమ్మత్తుగా, ఎవరి విశ్లేషణకందని విధంగా ఉంటు న్నాయి. కష్టం ఒకరిదైతే సుఖం వేరొకరి దనే పద్ధతిలో సాగుతున్నాయి. పనొకరిద యితే ఫలితం మరొకరిదన్నట్టుగా ఉన్నాయి గదా మన బతుకులు. స్వాతంత్ర్య సమర యోధులు కొందరు ఘోరమైన ఆర్థిక దుస్థి

తిలో ఉన్నారు. ఓ కప్పు టీ కోసం కూడా కటకటపడుతున్నారు. స్వాతంత్ర్య పోరాట సమయంలో స్వాతంత్ర్యం వద్దన్నవాళ్లే అది వచ్చిన తర్వాత నాయకులై పరిపాలన సాగిస్తున్నారు. ఎంతో కష్టపడి పైకొచ్చిన మన వాళ్ళలోనూ కృత్రిమత్వం వచ్చేసింది.

"ఇదంతా సాంస్కృతీకరణ ఫలితం లక్ష్మయ్యగారూ! ఏదేమైనా మనం మాత్రమే కాదు ఎవరైనా సరే తమ మూలాలను మరిచిపోకుండా ఉంటే అంతే చాలు" అన్నాడు సీతారాం.

"మహారాష్ట్రలో అంబేద్కర్ ప్రభావం అధికంగా ఉంది. కాని అక్కడ దళితపార్టీలు అధికారంలోకి ఒక్కసారి కూడా రాలేదు. ఉత్తరప్రదేశ్ సాంప్రదాయానికి, రామాయణ మహాభారత సంస్కృతులకు కేంద్రం. కాని అక్కడ దళిత పార్టీల ప్రాబల్యం ఉంది. తమిళనాడులో ద్రవిడ సంస్కృతీ ప్రభావం విశేషం. అయినా వాళ్ళూ వీళ్ళూ అధికారంలోకి వస్తారు. అయితే భారతదేశం మొత్తం మీద ఏ పార్టీలోనైనా సరే కులాల ప్రభావం ఉందన్నది స్పష్టం. ఆంధ్రప్రదేశ్‌లో బ్రాహ్మణుల చేతుల్నుండి రెడ్లు, రెడ్ల చేతుల్నుండి కమ్మలు రాజకీయాధికారాన్ని కైవసం చేసుకున్నారని ఓ విశ్లేషకుడన్నాడు. ఆయా కులాల్లో వైతాళికులు, చైతన్యం రావడం వల్లే ఇది సాధ్యమైందనీ అంటాడు" అన్నాడు వెంకటేశం.

"అయితే కావచ్చు కానీ మనమిప్పుడు రాజకీయాధికారంగురించో మరేదో కాదు మాట్లాడుకోవాల్సింది. ఇలా మాట్లాడటం ద్వారా అది వస్తుందనీ కాదు. మనల్ని మనం విశ్లేషించుకోవడం మనవాళ్ళకు ఏదో మేరకు ఉపయోగపడటం."

"అదెలా అంటావు శంకరయ్యా"!

"రాజకీయాలు కాని, వ్యాపారాలు కాని, కొంతమంది పైకిరావడంకాని గాల్లో మంత్రం వేసినట్టు సంభవించేవి కాదు దానికి స్పష్టమైన నేపథ్యముంటుంది. వ్యాపారం చేయడానికి, రాజకీయాల్లోకి రావడానికి నాకెవరు సపోర్టు చేస్తారులే అనే వాళ్ళు అలా కులం ద్వారానో సిద్ధాంతం ద్వారానో మద్దతు దొరికిన వాళ్ళు ఆయా రంగాల్లో పైకొచ్చారు. తెలంగాణాలో అన్నల ప్రభావం బాగా పెరిగిన తర్వాత రెడ్లు, వెలుమలు వ్యాపారాల్లోకి వచ్చారు. కొన్ని చోట్ల పెద్ద పెద్ద వ్యాపారాలను చేజిక్కించుకున్నారు. దీని వెనుక ఎన్నో కారణాలుంటాయి కదా అలాగే కళా సాహిత్య సాంస్కృతిక రంగాల్లోనూ పైకి రావడానికి దీనికి తగ్గ నేపథ్యం తప్పకుండా తోడ్పడుతుంది" అన్నాడు శంకరయ్య.

శంకరయ్య మాటలందరికీ నచ్చాయి.

"ఇన్ని తెలిసిన వాడివి లక్ష్మిరాజం విషయంలో ఎందుకు జాగ్రత్తలు తీసుకోలేదు." అన్నాడు బూర్ల వెంకటేశం.

"నిజమే తీసుకోవాల్సింది కాని నేనెట్టి పరిస్థితుల్లోనూ ఈ విషయాన్ని ఊహించనైనా ఊహించలేదు. లక్ష్మిరాజం అలా అనుమానించేట్టు మాట్లాడలేదు. సిరిసిల్ల విషయాలను చూసయినా ముందు జాగ్రత్తలు పడాల్సింది. ముందే జ్ఞాపకం చేస్తే లేని ఆలోచనను ముందుకు తెచ్చినట్టవుతుందన్న భయం మరో దిక్కుంది. అయినా ఈ విషయంలో నాది తప్పే." అన్నాడు శంకరయ్య కన్నీరు పెట్టుకుంటూ.

"ఇక ముందయినా మనం జాగ్రత్త పడుదాం ఈ విషయం మనకు గుణపాఠం కావాలి- తప్పకుండా అవుతుంది" అన్నాడు రామలింగం.

"అవన్నీ నిజమే కావచ్చు! నేను ముసలోన్నయిన నా ఆలోచనలు వేరుగుండవచ్చు- కాని నాకు ఇందులో కూడా మన తప్పులు న్యాయనిపిస్తుంది. నాకు దుఃఖముంది నిజమే అందుకు కారణం నువ్వే అని చెప్పేటోడు మనూరికి గురువుగ వచ్చిన రాజయ్యగారు. అవు మన దుఃఖానికి మనమే కారణం కాదా మరి! బాగా సంపాయించక

పోవచ్చు మీరనే సుఖాలేందో పొందకపో వచ్చు కాని హాయిగ నయితె బట్ట పొట్టక యితె బతుకుతున్నం గద! సుఖాలు గావ ల్నని, బాగసంపాదన గావల్ననిరి అపేక్షతో వేటి వేటి వెంబడో పడితే ఇగో గిట్ల కావట్టె... దీనికి కారణం మన ఆపేక్ష, ఉరు కులాట గాదా? "

మచ్చయ్య మాటలెంతో ఆలోచనాత్మ కంగా తోచాయి వాళ్ళకు "కావచ్చు కాని ఎప్పటి కాలమప్పుడు నీ తీరుగనే ఆ తర్వాతి తరమెల్లనూ ఆలోచించుమంటె ఆలోచించుతారా? మరి నీ మనుమడు లక్ష్మయ్య కొడుకులిద్దరు అమెరికా పొయింద్రు నువ్వు వద్దంటె ఆగుతారా? దీన్ని గూడ అపేక్షే అంటావా? " అన్నాడు బొద్దుల నారాయణ.

"పెద్ద మనిషిని ఎందుకలా దబాయి స్తావు నారాయణా! వాళ్ళాగకపోవచ్చు నిజమే కాని ఆయనన్న దాంట్లో ఎంతో అర్థ ముంది అవును మన సుఖాపేక్షే కదా దుఃఖాలను పెంచుతుంది. మనం అభి వృద్ధి చెందాం నిజమే కాని మన పూర్వ తరాల వారిలో ఉన్న మానవత, ఆర్ద్రత, తృప్తి మన తరంలో, తర్వాతి తరంలో ఇప్పుడు మనుషుల మధ్య మానసిక దూరం పెరగడం లేదా? కృత్రిమత్వం పెర గడం లేదా? ఇవన్నీ సుఖాపేక్షతోనే కదా వస్తున్నవి పోనీ ఆ సుఖం పొందుతున్నాడా మనిషి? తృప్తి లేంది సుఖముంటుందా? "

"నువ్వేవేవో లోతైన విషయాలు మాట్లా డ్తావు గాని శంకరన్నా! మరి నీ కొడుకు లను అమెరికా పంపించవా? రేపు నేను చూడనా? "

"వెంకటేశం ఇప్పుడా విషయాలన్నీ వద్దు. వ్యక్తిగతంగా పోకుంటేనే మంచిది. శంక రయ్య శ్రామిక తాత్వకత మీద కృషి చేస్తు న్నాడు." అన్నాడు రామలింగం.

"సూఫీ ఇస్లాం, ఆదిశంకర, బౌద్ధం, కబీర్ లాంటి అనేక తత్వాలు వచ్చాయి మన దేశంలో సమాజంలో వచ్చే ప్రతి మార్పుకూ మన వాళ్లెంతో కృషి చేసారు. తమను కొంతైనా పట్టించుకున్న తత్వవేత్తలను తమ వాళ్ళను చేసుకున్నారు. మన లాంటి వాళ్ళకు కావాల్సింది శ్రామిక తాత్వికత" అన్నాడు శంకరయ్య.

"అవన్నీ పెద్ద పెద్ద సంగతులు అందరికీ అర్థం కాకపోవచ్చు ఇక్కడ అన్ని స్థాయిల మనుషులున్నారు. మనం అభివృద్ధి చెందామా? మా నాన్న కరీంనగర్ పోయిన ప్పుడు నిమ్మపులుసు పిప్పరమెంట్లు తెచ్చేవాడు. మూడో నాలుగో అరటిపండ్లు కొనుకొచ్చేవాడు వాటిని మేమెంతో ఆనందంగా తినేవాళ్ళం. పరవశం చెందుతూ తినేవాళ్లం. కొట్లాడుతూ తినేవాళ్ళం. నేను నా పిల్లలకు బిస్కెట్లు తెచ్చాను. డజన్ల కొద్దీ పండ్లు తెచ్చాను. నేను మొన్న మొన్నటి వరకూ మా అవ్వ కుట్టిన బొంత మీదనే పడుకునే వాణ్ని. కాని నా కొడుకులు పరుపులు మీద పడుకుంటున్నారు. అంటే మనం అభివృద్ధి చెందినట్టేనా? మన ఊరి సాలెవాళ్ళ స్థితిలో చాలా మార్పు వచ్చింది. ఇది అభివృద్ధన్నట్టేనా? మరయితే ఎందుకు సంక్షోభముంది? ప్రతి కుటుంబం లోనూ తీవ్ర సంక్షోభం ఉంది. ఇదంతా ఏంటి? మన కుటుంబాలు ఎంత వరకు పై కొచ్చాయి? రచయితవు గదా శంకరయ్యా నువ్వు. నీ అవగాహనేంటో చెబితే బాగుం టుంది? అవి మన వాళ్ళందరికీ ఏదో మేరకు ఉపయోగపడవచ్చు " అన్నాడు డా॥ లక్ష్మయ్య.

ఆ మాటలు అందరినీ ఆలోచనలో పడే శాయి.

"ఆం చెందినం తియ్యి అభివృద్ధి? అప్పుడే నయముండె. ఇంత కూటికన్న దొరికేది. వృత్తులన్ని నాశనమయిపోయి నయి విషపాతుకాలు పెరిగినాయి. బాగ మీదికి పోయింద్రట మనుషులు!" అన్నాడు వ్యంగ్యంగా నారాయణ.

"అన్ని విషయాలను అలా తేలికగా తీసు

కోవద్దు నారాయణా! లక్ష్మయ్యా సారన్నది నిజమే. నువ్వన్నదీ నిజమే. వడ్లు పెరుగు కలిపినట్లున్న ఈ పరిస్థితిని సరిగ్గా సమీక్షించుకోవాలి." అన్నాడు సీతారాం.

"శంకరన్నా! మాట్లాడవేంటే!" అన్నాడు వెంకటేశం ఇక నోరు విప్పక తప్పలేదు శంకరయ్యకు.

"నేను ఒకప్పుడు క్రమ పరిణామాన్నంతా చూసి సమాజం పీడిత వర్గాల కనుకులంగా మారుతుందని, అది అభివృద్ధే అనుకునేవాడిని. కాని క్రమక్రమంగా నా అవగాహన పెరిగి, అనుభవాలు పెరిగి అనేక విషయాలను చూసున్న కొద్దీ అంత తొందరగా దేన్నికైనా సర్టిఫికెట్ ఇవ్వడం సరైంది కాదేమోననిపిస్తుంది. ఇప్పుడున్న పరిస్థితులు సీతారాం, లక్ష్మయ్యసారు చెప్పినట్టే ఉన్నాయి. వడ్లు పెరుగు కలిపినట్టు. నా చిన్నతనంలో ఈ ఊళ్ళో మన కులం వాళ్లవి నలభై కుటుంబాల వరకుంటే ఇప్పుడు డెబ్భై ఎనభై అయ్యుంటాయి. అప్పుడు వేముల వాళ్ళు మాత్రమే మన కులంలో పైకొచ్చిన వాళ్ళు. వాళ్ళకు భూములుండేవి. చదువులుండేవి. సమాజంలో గౌరవమూ ఉండేది. నాకు తెలియని కాలంలోనే వేముల పోచాలు పోలీసుపటేలు గిరీ చేశాడు. వేముల వాళ్ళను వదిలిపెడితే మిగతా కుటుంబాలన్నీ పేద కుటుంబాలే. దొరలతో అవమానాలను పొందిన కుటుంబాలే. రెక్కాడితే డొక్కాడని కుటుంబాలే. తర్వాత జరిగిన క్రమ పరిణామం మీకు తెలుసు. ఇప్పుడు వేముల వాళ్ళ ఎనిమిది కుటుంబాల్లో రెండు కుటుంబాలు మాత్రమే ఊళ్ళో ఉంటున్నారు. మిగతా వాళ్ళూ, వాళ్ల పిల్లలు ఊర్నుంచి దూరమయినట్టే. అయితే వాళ్ళంతా బాగానే చదువుకున్నారు. మంచిగానే సెటిల్ అయ్యారు. వీళ్ళ కుటుంబాల్లోంచే నలుగురు డాక్టర్లయ్యారు. నలుగురు ఇంజనీర్లవుతున్నారు.

స్వయంకృషితో పైకొచ్చిన మచ్చయ్య కుటుంబంలోని వాడే లక్ష్మయ్యసార్ మచ్చయ్య మనుమడైన లక్ష్మయ్యసారు ఉపాధ్యాయునిగా ప్రారంభించి, డాక్టరేట్ చేసి డిగ్రీ కాలేజ్ లెక్చరర్ వరకెదిగాడు. అతని నలుగురి పిల్లల్లో ఇద్దరు డాక్టర్లు, ఇద్దరు ఇంజనీర్లు. బొద్దుల వాళ్ళలో మరికొంత మంది ఉపాధ్యాయులూ ఉన్నారు. గుడిమళ్ళ భూమయ్య కొడుకు పి.జి. చేసి ఉపాధ్యాయుడయ్యాడు. ఒకప్పుడు తిండికే మొహం వాచున్న మా కుటుంబం సంగతి మీకు తెలుసు. మా చిప్ప వాళ్ళలో చదువుకున్న వాళ్లతో పాటు సింగరేణి గనుల్లో పని చేసే వాళ్ళూ ఉన్నారు. గోరంటల, సామల వాళ్ళు ఓ తీరుగానే బతుకుతున్నారు. వీళ్ళలో కొందరు ఆదిలాబాద్ జిల్లాలో స్థిరపడ్డారు. అనుమాండ్ల, ఆడిగొప్పుల వాళ్ళ పరిస్థితి గొప్పగా లేకున్నా పైకి చూస్తే మునుపటి కంటె నయమనిపిస్తుంది. వృత్తినే పట్టుకొని బతుకుతున్న సుంకనపల్లి వాళ్ళు, పోతువాళ్ళ పరిస్థితి అంతంత మాత్రంగానే ఉంది. నీడిమెట్ల వాళ్ళు ఊళ్ళోంచే వెళ్ళిపోయారు. దొంతల వాళ్ళు ఓ తీరుగా ఉన్నారు. ఇలా చెప్పుకుంటూ పోతే దీనికి అంతేలేదు. మీకు తెలియందేమీ లేదు.

ఈ విషయాలనన్నిటినీ పైపైన చూస్తే మునుపటికంటె ఇప్పుడు పైకి వచ్చినట్టే కనబడుతుంది. నేనూ అలాగే అనుకున్నాను. కాని ఇది నిజమా? లోతుగా పోయి పరిశీలిస్తే అర్థమవుతుంది. మన వాళ్లలో చైతన్యం వచ్చింది. మునుపట్లా అంతఘోరంగా మనలను అవమానించే దొరలు లేరు. మన వాళ్ళలో కొంతమంది దొరలతో సమానంగా కొందరి కంటె ఉన్నతంగా కూడా ఉన్నారు. మరి పైకి కనిపించే ఇవన్నీ చూసి మురిసి పోదామా అలా అయితే ఈ సంక్షోభమెందుకు? ఈ అశాంతి ఎందుకు? అల్లకల్లోలమెందుకు?



అసలేం జరుగుతోంది? ఈ ఆత్మహత్యలెందుకు జరుగుతున్నాయి? మచ్చయ్య చెప్పినట్టు అపుడు ఈ సుఖాలనేవి లేవు కాని ఈ ఆత్మహత్యలు లేవు కదా! విలువలు ఇంత ఘోరంగా ధ్వంసం కాలేదు కదా! వృత్తులు క్రమక్రమంగా కనుమరుగవుతున్నాయి. మరి వీటికి ప్రత్యామ్నాయాలేవి? ప్రత్యామ్నాయాలుంటే ఇంత సంక్షోభం ఎందుకుంటుంది? అందుకేనేమో పీడిత కులాల్లో కుల చైతన్యం వస్తున్నది! అప్పుడు నా తల్లికి ఒక్క చీర కొనివ్వలేని స్థితి నుండి ఈ రోజు నా కొడుకును అమెరికాకు పంపగలిగే స్థానానికెదిగాను. కాబట్టి అంతా బాగాలేదని చెప్పడానికి నాకు నోరు రావడం లేదు. అన్నీ కష్టాలే ఏరిపారేయండని చెప్పడానికే మనసొప్పడంలేదు. ఇదో విచిత్రమైన పరిస్థితి. మన ఊరునే కాదు. ఏ ఊరును నిశితంగా పరిశీలించినా మనకీ విషయాలు అవగతమవుతాయి.

ఫ్యూడలిస్టిక్, భూస్వామ్య వ్యవస్థలు విచ్ఛిన్నమైన మాట నిజమే. మనకెన్నో అవమానాలను మిగిల్చిన ఆ వ్యవస్థలు పోవాల్సిందే కాని ప్రకృతి విచ్ఛిన్నమవుతుంది. వాతావరణం సమతుల్యత తప్పుతుంది. ఈ నష్టాన్ని పూరించడం ఎలా? దాంతో పాటు ప్రత్యామ్నాయాలేం లేకుండా వృత్తులూ పోతుండటం వల్లనే ఈ సంతోషం వస్తుందేమో ననిపిస్తుంది. నిజానికి అభివృద్ధి అంటే ఏమిటి? అందరూ మధ్య తరగతి వరకు ఎదగడమే నిజమైన అభివృద్ధి అంటాను నేను. అది జరిగిందా? జరుగుతుందా? కొందరు మాత్రం ఉన్నతోన్నత స్థితిలోకి, చాలామంది అథఃపాతాళానికి పోతున్నట్టు కనబడటం లేదా? అందుకేనేమో ఈ సంక్షోభాలన్నీ ఏది ఏమైనా నాక్కూడా ఈ పరిస్థితి ఖచ్చితంగా ఇలా ఉందని చెప్పే విధంగా కనబడటం లేదు. ఇది నేను గమనించింది మాత్రమే. ఇదే సమగ్రమని చెప్పడం లేదు."

శంకరయ్య ఒక్క ఆశ్చర్య చకితులై చూస్తున్నారు వాళ్ళంతా. తమ ఊళ్ళో పుట్టినవాడు, తమ మధ్య బతికినవాడు ఇంత లోతైన అవగాహనతో విషయాలను వివరిం

చడం వాళ్ళకు ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

"బాగా చెప్పినవు బిడ్డా! మాకు తెలువని విషయాలెన్నో చెప్పినవు" అన్నాడు శంకరయ్య మీద చెయ్యేస్తూ మచ్చయ్య.

"పెదనాన్నా! ఈ మధ్య ప్రపంచీకరణం గూర్చి చాలా వింటున్నాం అది మనలాంటి వాళ్ళకు, వృత్తిపనివాళ్ళకు మేలు చేస్తుందా? లేదా? " అన్నాడు శ్రీరాం.

శంకరయ్య దిక్కు అందరూ కుతూహలంతో చూస్తున్నారు.

"ప్రపంచీకరణం అనేది ఓ మాయ. అది బలహీనవర్గాలవారికి మేలు చేస్తుందనుకోవడం భ్రమ. వృత్తిపని వారికీ ప్రపంచీకరణల వల్ల ఎంతో లాభం జరుగుతుందని నేనూ నమ్మాను. కాని ప్రత్యక్షంగా చూసినతర్వాత ఆ నమ్మకం పోయింది. వృత్తిపనివారి బలమంతా ఆ పనుల్లోనే ఉంది. అవే వాళ్ళ కాదాయమార్గాలు సాలీలకు బట్టల తయారీ, గొల్లలకు గొర్రెల పెంపకం, పాల ఉత్పత్తి, కాపులకు వ్యవసాయం, గౌండ్లకు కల్లుగీయడం మొదలైనవి. ప్రపంచీకరణ అనే మాయాజాలం వచ్చిన తర్వాత దేశీయ వృత్తులన్నీ నశిస్తున్నాయి. దేశీయ కళలకూ అదే గతి పడుతుంది. బలమున్నవాడి కళలు, పనులే చలామణి అవుతున్నాయి. దీంతో తీవ్రమైన సంక్షోభం ఏర్పడుతుంది. గొర్రె పెనుక అంటే తెలియనివాడు గొర్లమందల యజమాని కావడం, పెండను తాకనివాడు పాల వ్యాపారి కావడం, నాగలిపాలె తెలియనివాడు భూమిపై ఆధిపత్యం చలాయించడం, నాడె అంటే కూడా తెలియనివాడు బట్టల దుకాణాల్లో కూచోవడం, ఉంగటం అంటే ఎరుగనివాడు చెప్పుల దుకాణం యజమాని కావడం లాంటివన్నీ ఇందులోని భాగాలే. ఇరవైనాల్గు గంటల ఎలక్ట్రానిక్ మీడియా హోరుతో దేశీయమైన కళలన్నీ మటుమాయమవుతుండటం కూడా ఇందులో భాగమే. వృత్తిపనులు దుర్మార్గంగా నశిస్తూ సంక్షోభంలోకి నెట్టబడుతుండటం ఇందులో భాగమనే నేననుకుంటున్నాను. మరిక ఇది మన కెలా మేలు చేస్తుంది? అట్లని నేను కులాలను, వృత్తులను పట్టుకొని అలాగే ఉండమని కోరడంలేదు. చదువులు, ఉద్యోగాలు, రాజకీయాలు, ఇతర పనులతో జీవితాలను గెలుచుకోవాల్సిందే. కాని అందరికీ ఇవి సాధ్యంకాకపోవచ్చు అందుకోసం ఈ ప్రయత్నాలు చేస్తూనే ఆదాయ మార్గాలైన వృత్తులనూ కాపాడుకోవాలి. అప్పుడే మన దేశంలాంటి దేశంలో వృత్తిపనివాళ్ళకు, ఆ కులాల వాళ్ళకు అభివృద్ధి సాధ్యమవుతుంది" అన్నాడు శంకరయ్య.



"అన్ని పనులయిపోయినాయి. భోజనాలకు లేవుండ్రి." అన్నాడు వీరయ్య పెద్దకొడుకు రాజేశం అక్కడికొచ్చి నిల్చొని.

అంతా లేచి నిల్చున్నారు.

భోజనాలకు కదులుతున్నారు. ఎన్నో విషయాలను చర్చించుకున్న వాళ్ళకు విందు రుచించడంలేదు. లక్ష్మిరాజం లాంటి చావు ఎవరికీ రాకుండా ఏం చేయాలో ఆలోచిస్తూనే ఒక్కో ముద్ద నోట్లో పెట్టుకుంటు

✤ తన వంతు నిందకంటే కాస్త ఎక్కువ నిందను, తన వంతు పేరు కంటే కూడా కాస్త తక్కువ పేరును మంచి నాయకుడు స్వీకరిస్తాడు. –ఆర్నాల్డ్ హెచ్ గ్లాస్గో

న్నారు చాలామంది.

★ ★ ★

శంకరయ్య ఇల్లంతా సందడిగా ఉంది. వచ్చేపోయే జనాలతో హడావిడిగా ఉంది. అందరి ముఖాల్లోనూ ఆనందం శారద సంతోషానికయితే అంతే లేదు.

తన కొడుకు లిద్దరూ అమెరికా వెళ్తున్నారు. కొద్ది రోజుల్లో కోడలూ వెళ్ళిపోతుంది. బంధువులు, ఇరుగుపొరుగు వాళ్ళు, కులంవాళ్ళు, ఊరివాళ్ళంతా శారదను అభినందిస్తున్నారు. ఆమె అదృష్టాన్ని పొగడుతున్నారు.

"నీకేందిగ, ఇద్దరు కొడుకులు అమెరికాకు పోతున్నారు. ఇగ పైసలే పైసలు. గక్కడి ఒక్క రూపాయి గిక్కడ యాభైరూపాయలటకద! పైసల్ల ముంచుతరు నిన్ను కొడుకులు."

"శారదక్క కేందిగ మారాజు. మస్తు పైసలొస్తయి. అమెరికాల ఇద్దరు కొడుకులంటె మాటలా?"

"ఉన్నిద్దరు కొడుకులు అమెరికాల సంపాయించుతరిగ ఇంకేం గావాలె?"

"అవు మరి నేను మారాజునే. చిన్నప్పుడు పడ్డ కష్టానికి ఇప్పుడు ఫలితం దొరికిందేంది?" సంతోషంగా అంది శారద.

"ఏ ఇగ శారదక్కను మందలియ్యవాటం గాదు."

"గట్లెందుకంటవు రాజక్క! నాకు కండ్లు నెత్తికేమెక్కయి. కష్టాలు సుఖాలు అన్నీ చూసిందాన్ని."

ఆడవాళ్ళు రకరకాలుగా మాట్లాడుకుంటున్నారు.

శంకరయ్య చుట్టూ చాలామందే ఉన్నారు. నవ్వుతున్నారు. తుళ్ళుతున్నారు. మాటల్లో ప్రపంచమంతా తిరిగొస్తున్నారు. రమేష్, సురేష్ స్నేహితులూ అభినందనలు చెబుతున్నారు.

"ఓ కొడుకును నౌకరికి, ఇంకో కొడుకును చదువుకుంటానికి పంపిస్తున్నవన్నమాట- చదువుకునుడందేంది? నౌకరన్నట్టేనాయె. ముందు పెట్టిన పైసల్లోని పోతడు. అటెనుక వాళ్ళ ప్రొఫెసరే ఏదన్నా పనిజూపుతాడు. వాటితో చదువుకోవచ్చు" అన్నాడు విజయేందర్‌రెడ్డి.

"మొత్తంమీద శంకరయ్య అదృష్టవంతుడే. ఇద్దరు కొడుకులు అమెరికాకు పోవడమంటే మాటలా?" అన్నాడు శంకర్రావు.

"మీరేదంటె అదే కాదంటే మాత్రం మీరూర్కుంటారా?" నవ్వుతూ అన్నాడు శంకరయ్య.

"శంకరయ్యా! పొట్ట పగిలేటట్టు తిని పరిగడుపే అన్నట్టున్నయి నీ మాటలు ఇద్దరు కొడుకులను అమెరికాకు పంపించుకుంట ఏదో పోయినట్టు మాట్లాడవడ్తివి."

"అదేంలేదు రాజిరెడ్డిసాబ్! ఇది మాకు అరుదుగా లభించిన అవకాశం. ముప్పయేళ్ళ క్రితమే మన ప్రాంతం నుండి తక్కువే అయినా కరణాలు, రెడ్లు, వెలుమలు అమెరికాకు పోయారు. మాకీ అవకాశం ముప్పయేండ్ల తరువాత లభించింది. అదీ ఎంతకాలమో తెలియదు. ఏదేమైనా నా కొడుకులిద్దరూ అమెరికాకు పోవడం ఒకవిధంగా నాకు ఆనందంగానూ, గర్వకారణంగానూ ఉంది. పేద వర్గాల్లోంచి చదువుకొని జీవితాలను గెలుచుకున్నవాళ్ళు ఇలా పోవడంవల్ల కుటుంబాల ఆర్థిక పరిస్థితి మెరుగుపడుతుంది. ఆ కుటుంబాలకు సమాజంలో గౌరవం పెరుగుతుంది. ఇంతకు ముందు దుబాయ్‌కి పోయి సంపాదించుకొచ్చిన కుటుంబాల కంటె దీంతో ఉన్నత స్థితి వస్తుంది. ఇది మాలాంటి కుటుంబాలకు గొప్పే అందుకే పంపడం మరి." అన్నాడు శంకరయ్య.

ఇద్దరు కొడుకులు అమెరికాకు పోతుండటం అతనికెంతో ఆనందంగానే ఉంది. కాని ఉన్న ఇద్దరూ దూరం కావడం కొంత

బాధగానూ ఉంది. అయినా ఇలాంటి అవకాశాన్నెవరూ వదులుకోకూడదనే శంకరయ్య అభిప్రాయం.

"మొత్తంమీద ఇల్లు ఇల్లంతా సంబరంగా, సంతోషంగా ఉంది ప్రయాణ మెప్పుడు.?" అన్నాడు వెంకటయ్య.

"ఎప్పుడో అయితే ఇంత హడావిడెందుకుంటుంది? ఈరోజే! ఈరోజు హైదరాబాద్ పోవడం. రేపు హైదరాబాద్ నుండి బొంబాయి ప్రయాణం ఒకరోజు బొంబైలో ఉండటం. మరునాడు బొంబాయి నుండి అమెరికాకు" అన్నాడు శంకరయ్య.

ఇక్కడే బస్సెక్కించి కూర్చుంటారా? బొంబై వరకు పోతారా? "

"నేను, శారద, కోడలు బొంబై వరకు పోతున్నాం. రమేష్ సురేష్‌ను విమానమెక్కించి తిరిగొస్తాం. నెలరోజుల్లో మల్లేశ్వరి వీసా వంటివి తయారవుతాయి తర్వాత ఆమె కూడా పోతుంది."

"శంకరయ్యా! కొడుకు పుట్టి తండ్రిని చదివించాడంటే ఇదేనేమో! నీ చిన్నతనంలో సైకిల్ కూడా కొనుక్కోలేని స్థితిలో ఉన్నవాడివి. ఈరోజు విమానంలో ప్రయాణిస్తున్నావు. హైదరాబాద్ నుండి బొంబైకి విమానంలోనే కదా ప్రయాణం."

విజయేందర్‌రెడ్డి మాటలకు నవ్వాడు శంకరయ్య.

"అవును నాకు, శారదకు ఇదే మొదటిసారి విమానం ఎక్కడం. ఈ నెపంతోనైనా ఓసారి విమానమెక్కొచ్చు" సంతోషిస్తూ అన్నాడు.

"ఒకప్పుడు రాజమల్లును భీవండికి పంపుతూ ఎన్నో రకాలుగా మాట్లాడుకున్నం. అయినా పోయిండు. అదేం కలిసి రాలేదు. కొన్నేండ్ల తరువాత రాజేశంను దుబాయ్‌కి పంపుకుంట వాదించుకున్నాం. కుటుంబు కోసమే పోతున్నానని రాజేశం పోయాడు. పోయినందుకు ఓ తీరుగా సంపాయించుకున్నాడు. ఇల్లుకట్టుకున్నాడు. పిల్లలను చదివిస్తున్నాడు. ఇక్కడే దుకాణం పెట్టుకొని ఉండుటానికి ప్రయత్నం చేస్తున్నడు. దుబాయ్‌కి పోవుడు రాజేశంకు మంచిగనే కలిసొచ్చింది. ఈ రోజు మరింత దూరంగా ఖండాన్నే వదిలిపెట్టి పోతున్నరు శంకరయ్య కొడుకులు. ఆ ఇద్దరిని వద్దన్నారు కాని వీళ్ళనెవరూ వద్దనడం లేదు... మెచ్చుకుంటున్నారు. ఇదే నాకు అర్థంకానిసంగతి వాళ్ళనేమొ పోవుడెందుకు అదెందుకు ఇదెందుకు అన్నవాళ్ళు వీళ్ళనేమొ పోతేనే మంచిదంటున్నరు. దీని మతులబేందంటవు శంకరయ్యా!" నవ్వుతూ అన్నాడు బూర్ల వెంకటేశం.

ఆ మాటలకు తాను సమాధానం చెప్పడం అంత సులభం కాదనుకున్నాడు శంకరయ్య.

ఇంతలో విజయేందర్ రెడ్డి, "వాటికీ వీటికీ చాలా తేడా ఉంది. నిజానికి రాజమల్లు రాజేశం ఊరొదిలి బతుకపోతాననడంలో అర్థముంది. తమ పనిలో బతకడం సాధ్యం కాకనే వాళ్ళా నిర్ణయాలు తీసుకున్నారు. వాళ్ళది అవసరం. బతుకపోవడం. ఇక్కడ బతుకలేక పోవడం. అవసరార్థం పోవడం

అమెరికాకు పోతున్న వలసలు అలాంటివి కాదు. అవి కష్టంతో కూడుకున్నవైతే ఇవి వైట్‌కాలర్డ్‌వి. సుఖాలను కోరి పోయేవి. బాగా డబ్బు సంపాదించాలన్న కాంక్షతో పోయేవి. కాకుంటే ఇరవై, పాతిక వేలకు పైగా ఇక్కడ జీతమున్నా అవి వదిలి పోవాల్సిన అవసరమేముంది? అందరి విషయంలో కాదు నేననేది.

ఆకలి కోసం రొట్టె దొంగిలిస్తే అది దొంగతనం, లక్షల్లో బేంకులను ముంచితే అది హుందాతనం అన్నట్టే! ఈ వలసల్లోనూ భేదముంది ఈ మూడూ బతకడానికి పోయే వలసలంటే మాత్రం నేనొప్పుకోను" అన్నాడు.

ఆ మాటల్లో ఎంతో నిగూఢార్థము న్నట్లు అర్థమవుతుంది శంకరయ్యకు. కాని ఆ సమయంలో విజయేందర్ రెడ్డితో వాదించి దాన్ని పొడిగించడం అతని కిష్టం లేదు. ఆ మాటలు వింటున్న రమేష్‌కు మాత్రం కొంత చురుక్కుమన్నట్టయింది.

"అంకుల్! మీ మాటల్లో వాస్తవా లుండొచ్చు. ఎవరెందుకు పోతు న్నారో నాకైతే తెలియదు కాని నేను మాత్రం అక్కడే ఉండి సుఖాలనుభ వించడానికి పోవడంలేదు. కొంత డబ్బు సంపాదించుకొచ్చి ఇక్కడే నా వాళ్ల మధ్య హాయిగా బతకాలని పోతున్నాను. మాఇద్దరి సంపాదనతో ఇక్కడా హాయిగా బతుకొచ్చు. కుటుంబాన్ని చూసుకోవచ్చు. కాని దుర్భర పేదరికం అనుభవించిన మా కుటుంబం ఆర్థికంగా, సామాజికంగా ఓ స్థితికి రావడానికి నేనూ, నా భార్య కృషి చేయాలనే పోతున్నాం. దీంతో తమ్ముడిని చదివించవచ్చు. చదువయిన తర్వాత వాడేం చేస్తాడో వానిష్టం. నేను మాత్రం ఐదారేళ్ల కంటె ఎక్కువ అక్కడుండను. ఓ మోస్తరుగా డబ్బు సంపాదించుకొని తిరిగొస్తాను" అన్నాడు.

"ఆ అవన్నీ మాటలే అమెరికాకు పోయిన వాళ్లెవరూ తిరిగిరారు. ఆ సుఖాలకు అలవాటుపడి ఇక్కడుండ లేరు. ఎంతమందిని చూళ్లేదు. అటు పోయిన వాళ్లెవరొచ్చి ఇక్కడ సంసారం చేస్తున్నారు. ఇక్కడి బతుకు వాళ్లకు ఆననే ఆనదు. పిల్లలను అమెరికాకు పంపించామంటే ఇక వాళ్ళు విడిచిన ముల్లె అన్నట్టే. కాకపోతే అప్పుడప్పుడింత డబ్బు పంపియ్యవచ్చు" అన్నాడు చంద్రమౌళి.

ఆ మాటలు వింటుంటే శంకరయ్యకు భయం భయంగానే ఉంది. అయినా తాను చేస్తున్న పని తప్పనిపించడం లేదు.



## అంతా సంతోషిస్తారు!

విమానంలో వెళ్తున్న ఓ రాజకీయనాకుడికి ఓ గొప్ప ఆలోచన వచ్చింది. వెంటనే సెక్రటరీని పిలిచి 'సెక్రటరీ.. కిటికీలో నుంచి ఓ వందరూపాయల నోటు జారవిడిచామనుకో.. అది ఎవరికి దొరికితే వాడు కనీసం ఒక్క భార తీయుడైనా సంతోషిస్తాడు. నువ్వేమంటావ్?' అన్నాడు.

దానికి సెక్రటరీ 'అవును సర్. అయితే ఓ చిన్నసలహా.. వంద రూపాయల నోటుబదులు పదిరూపాయల నోట్లు పది జారవిడిచామను కోండి. పదిమంది భారతీయులు సంతోషిస్తారు' అన్నాడు తనతెలివికి తానే సంతోషిస్తూ.

ఇదంతా వింటున్న పైలట్ చిరాగ్గా అన్నాడు. 'అసలు మీ ఇద్దరినీ కిందికితోసేస్తే విమానంలోని వారితోపాటు దేశం జనాభా మొత్తం సంతోషిస్తుంది.'

"రారనే అనుకుందాం. అక్కడవాళ్లు హాయిగా బతికితే చాలదా? అమెరికాలో మాచిప్పవాళ్ల సంతతి ఉంటుంది కదా! ఆ విధంగా తృప్తిపడాలి" అన్నాడు రాని నవ్వును తెచ్చుకుంటూ శంకరయ్య.

ఆ మాటలు తనను తాను సంతృప్తి పర

చుకోవడానికి అంటున్నవి మాత్రమేనని వాళ్లకు తెలుసు.

"అవునవును అట్లనుకుంటె ఐపోతదిగాని ముందున్నది ముసుళ్ల పండుగ."

"ఏందోయ్ వెంకటేశం, నన్ను బెదిరించ వడితివి. నేను అన్నీ ఆలోచించే ఏ పన యినా చేస్తాను. అయినా జరిగేది జరుగు తుంది. ఎప్పుడో ఏదో అవుతుందని వచ్చిన అవకాశాలను కాలదన్నుకోవడం మూర్ఖత్వం కాదా? పిల్లల భవిష్యత్తుకు భంగం కల్గించే హక్కు మనకుందా? "

"ఆ మాట నిజమే సరేగాని శ్రీరాం! నువ్వు కూడా ఇంజనీరువే కదా! నువ్వెం దుకు పోవడం లేదు అమెరికాకు!"

అక్కడే ఉన్న శ్రీరాంను చూస్తూ అన్నాడు వెంకటయ్య.

జవాబు చెప్పడానికి వెనుకాముందాడు తున్నాడు శ్రీరాం. "అన్నయ్యకు అమెరికాకు పోవడం ఇష్టంలేదు. ఇక్కడే మంచి ఉద్యో గముంది కదా!" అన్నాడు సురేష్.

"ఈ కాలంలో అమెరికాకు పోవుడానికె వ్వల కిష్టముండదని అవన్నీ మాటలే." అన్నాడు రాజిరెడ్డి

"చెప్పు శ్రీరాం ఎందుకు వెనుకాముంద వుతున్నావు!"

"ఇందులో చెప్పడానికేముంది? నాకిక్కడ ఉద్యోగం చేయడమే ఇష్టం. నాకు వస్తున్న జీతంతో ఎంజాయ్ చేయదలుచుకుంటే ఇక్కడా చేయొచ్చు పోతే నా కోసం సర్వస్వం ధారపోసిన అమ్మను వదిలిపెట్టి నా సుఖం నేను చూసుకోవడం నాకిష్టం లేదు. కొద్దిరోజుల్లో నాభార్యకూ ఉద్యోగం దొరుకుతుంది. ఇద్దరి సంపాదనతో మరింత హాయిగా బతుకొచ్చు అమెరికాకు పోవడం తప్పని నేనడం లేదు కాని నాకు మాత్రం నాదేశంలో ఉండటమే ఇష్టం" అన్నాడు శ్రీరాం.

ఆతని దిక్కు ప్రశంసాపూర్వకంగా చూ శారు చాలామంది. "ఎంతయినా పైసలకు భ్రమించి పోవుడుగాని అందర్ని విడిచిపెట్టి అంతదూరం పోకుంటేంబోతుందది? పరా కతుగ ఇక్కడ నౌకరి చేసుకుంట ఉంటె హాయిగా బతుకరాదా? "

"ఆ మాట నిజమే కాని ఇక్కడ అందరికీ అవకాశలు రావడంలేదు. ఆ అవకాశా లుంటే అక్కడికి పోయే ఆలోచనే ఉండేది కాదు... అందరూ ప్రయత్నం చేస్తుండేసరికి ఒకర్నిచూసి ఒకరన్నట్టుగా పోతున్నారు. పై చదువుల ఉద్దేశ్యం ఇంజినీరింగ్ చద వడం అమెరికాకు పోవడానికన్నట్టే అయిపో యింది".

కట్టె పట్టుకొని మెల్లమెల్లగా నడుస్తూ అక్కడికి చేరుకున్నాడు. మచ్చయ్య... శంక రయ్య ఎదురువెళ్ళి తీసుకొచ్చి కూర్చోబె ట్టాడు... 'భ్రమలు, భ్రమలు అమెరికా పైన భ్రమలు- డాలర్ భ్రమలు డాలర్ భ్రమ వల్ల పడిపోతున్నారందరు. ఉరుకుంద్రి బిడ్డా! అందరురుకుంద్రి దేశాన్నిడిసి పెట్టు రుకుంద్రి అవ్వయ్యను విడిసిపెట్టురుకుంద్రి ఊర్నువాడను పిల్లాజెల్లను అందర్నిడిసి పెట్టుకురుకుంద్రి. బాగా సంపాయించు కుంద్రి. సుఖపడుంద్రి. మీకోసం ముస లోల్లు కండ్లల్ల వత్తులేసుకోని ఎదురు సూత్తాంటరు. ఎవ్వలెదిరి సూత్తేంది! మీరు రారు. వీళ్ళు సూత్తనే ఉంటరు. గిదీ కాలం బిడ్డ... డాలర్ భ్రమల కాలం పోంద్రి. పోంద్రి అందరు పోంద్రి. ఊళ్ళళ్ళ దేశంలో ఎవ్వరుండకుంద్రి. మా అసోంటి సాతగా నోల్లే ఉంటరు." అన్నాడు మచ్చయ్య.

ముడతలు పడ్డ ఆ వృద్ధుని ముఖంలో ఎంతో ఆవేదనుంది.

"తాతా! నువ్విట్లనుడు సహజం. మీ తరం ఆలోచనా ధోరణి అదే కాని ఈ కాలంలో కూడా ఒకచోట కదలకుండా ఉండమంటే ఎలా? ఉద్యోగికి భూమి లేదని ఎప్పుడో అన్నారు. ఇంతకుముందు ఊళ్లు విడిచి పట్టణాలకు, దూర ప్రదేశాలకు

పోయేవాళ్ళు. ఇప్పుడు మరికొంత దూరం పోతున్నారు. అయినా అప్పటికీ ఇప్పటికీ రవాణాలో, ఎలక్ట్రానిక్ మీడియాలో ఎన్ని తేడాలొచ్చాయి. మీకాలంలో ఆడవాళ్లు ఉద్యోగాలు చేయడం గుర్చి ఊహించారా? ఇప్పుడు పురుషులతో సమానంగా విదేశాలకు పోతూ ఉద్యోగాలు చేస్తున్నారు ఇప్పుడు దూరమంటే ఏంటి? ఎంత దూరంలో ఉన్నా నిమిషాల్లో ఆ వ్యక్తితో మాట్లాడవచ్చు. మరిక దూరమెక్కడుందో చెప్పు తాతా" అంది మల్లీశ్వరి.

"అవును! ఎలక్ట్రానిక్ మీడియా పెరుగుదలతోనే వేల మైళ్ళ దూరం నిమిషాల్లోకి తగ్గింది. నిమిషాలు మాత్రమే. దేశంలో ఉండి ఇంటికి రావడానికి రైల్లో వచ్చే సమయంకన్నా విదేశాల్లో ఉండి విమానంలో వచ్చే సమయం తక్కువే. ఆ అమ్మాయన్నట్టు దూరం సమస్య లేనే లేదిప్పుడు!" అన్నాడు విజయేందర్‌రెడ్డి!

"అది నిజమే సార్! మనుషుల మధ్య భౌతికదూరం తగ్గవచ్చు నిమిషాల్లోకి, సెకండ్లలోకి కాని మనుషుల మధ్య మానసిక దూరం మాత్రం అనేకరెట్లు పెరిగింది' ' అన్నాడు శ్రీరాం.

శంకరయ్య, మచ్చయ్యతో పాటు అక్కడున్నవాళ్ళంతా శ్రీరాం దిక్కు ఆశ్చర్యపోతూ చూస్తున్నారు.

బాగా చెప్పినవు బిడ్డ? చిన్నోనివైనా పెద్ద మాటలు చెప్పినవు. దుబాయ్‌కి పోయినోల్లు, అమెరికాకు పోయినోల్ల సంగతి వింటున్నం గద! ఫోను డబ్బాలల్ల మాట్లాడుకునేదేనాయె. లేకుంటే గదేదో క్యాసెట్లు పంపుతరట. గవ్వన్ని వింటరు. ఎంతయినా మనుసులు కలుసుకొని మనసు విప్పి మాట్లాడుకున్నట్టుంటదా? ఆ ప్రేమలుంటయా? " అన్నాడు మచ్చయ్య.

"మరి నీ మనుమని పిల్లలు గూడ పోయిండ్రుగద తాతా! వాళ్ళను వద్దన్నవా? ఆపలేదెందుకు? " అన్నాడు సురేష్

"ఆపుతె ఆగిటోల్లెవ్వలు? అయినా పోవద్దని నేనెందుకంట బిడ్డ? ఎవ్వల బతుకులు వాళ్ళు నిర్ణయించుకుంటరు. ఏదో మనసు కొట్టుకోని అట్లంటి. ఈ తరమోల్ల భవిష్యత్తు చెప్పెటోన్నా నేను" అన్నాడు మచ్చయ్య.

"ఎందుకు చెప్పొద్దు తాతా? మీ అనుభవాలెంతో విలువైనవి" అంది శ్రీరాం భార్య.

"రమేష్, సురేష్ తరాల మధ్య అంతరాల వల్ల ఇలాంటి చిన్న చిన్న అభ్యంతరాలు రావడం మామూలే. కాని ఈ పరిస్థితుల్లో విదేశంలో ఉద్యోగం అవకాశాన్ని వదులుకోకూడదు. ఒక్కసారి క్రమ పరిణామ క్రమాన్ని పరిశీలిస్తే అర్థమవుతుంది. మీ ముత్తాతల నుండి మీ తాత వరకు మీ ఇంటి పరిస్థితి స్తబ్ధంగానే ఉంది. వాళ్ళంతా మగ్గం గుంటకే పరిమితమై బతికారు. మీ తండ్రి కాలం నుంచి కొంత మార్పు మొదలయింది. మీ తాత నేత కార్మికుడయితే మీ తండ్రి ఉపాధ్యాయుడయ్యాడు. ఏ పాఠశాలకైతే పోవడం అదృష్టంగా భావించాడో అదే పాఠశాలకు ప్రధానోపాధ్యాయుడయ్యాడు. రాష్ట్రమంతటా రచయితగా పేరు తెచ్చుకున్నాడు. మీ తరంలోకి వచ్చేసరికి నువ్వు ఖండాలకతీతంగా అమెరికాకుపోతున్నావు. నీకు అక్కడే స్థిరపడే అవకాశాలు కూడా ఉన్నాయి. ఇది క్రమ పరిణామమే కదా? మీ కుటుంబం సాధించిన అభివృద్ధన్నట్టే కదా! విషయాలు ఇంత స్పష్టంగా కనబడుతుంటే మీ నాన్న మాత్రం ఒక్కోసారి ఏదో పోతున్నట్టు మాట్లాడుతుంటాడు. మన మెటు పోతున్నామంటాడు? ఎంతయినా రచయిత కదా? రకరకాల సంఘర్షణ అతనిలో నిరంతరం జరుగుతూనే ఉంటుంది.

మనమిప్పుడే ప్రయాణాన్ని తెలుగుపల్లె నుండి టెక్సాస్‌కు లేదా తెలివికుంట నుండి అమెరికాకు అని చెప్పుకోవచ్చు నిజంగా ఇదెంత మహత్తర అవకాశం! సరిగ్గా తిండికి

కూడా లేని చేనేత కుటుంబంలోంచి వచ్చి మారుమూల పల్లెటూళ్లో పుట్టిపెరిగి ప్రపంచంలోనే ప్రథమ స్థానంలో ఉన్న అమెరికాకు పోతున్నావంటే ఇది అపురూపమైన విషయమే. అప్పుడు కొండల్‌రావు బిడ్డ, అల్లుడు అమెరికాకు పోతే అదో గొప్ప వార్తగా చెప్పుకున్నాం. ఈ రోజు ఓ చేనేత కార్మిక కుటుంబంలోని వ్యక్తికా అవకాశం వచ్చింది. ఇది గొప్ప విషయం కాదా? ఇది స్వయం కృషితో జీవితాలను గెలుచుకోవడం కాదా? ఏమంటావు శంకరయ్యా! నువ్వెందుకు మౌనంగా ఉన్నావు... ఇప్పుడేమంటావు? సమాజం ముందుకు పోతుందా? వెనకకు పోతుందా? " అన్నాడు కొక్కుల భాస్కర్.

అతని దిక్కు అందరూ తలెత్తి చూశారు.

శంకరయ్యలో అంతర్మథనం చెలరేగుతుంది... కొద్దిసేపెవరేం మాట్లాడలేదు.

"భాస్కర్! ఒకవిధంగా ఆలోచిస్తే నువ్వు చెప్పిన విషయాలు సరైనవే ఒకప్పుడు మొన్న మొన్నటివరకూ నేనూ ఇదేవిధంగా ఆలోచించాను. కాని నువ్వన్నట్టు, నేను ఇదువరకు ఆలోచించినట్టు ఇలాంటి అవకాశాలు ఎంతమందికొస్తున్నాయి? ఊరును మొత్తం పరిశీలిస్తే ఇలా ఎన్ని కుటుంబాలు జీవితాలను గెలుచుకున్నాయి? ఇంకెంత మంది గెలుచుకుంటున్నారు? ఈ గెలుపులు శాశ్వతంగా ఉండేవేనా? లోతుకు వెళ్లి పరిశీలిస్తే మనకెన్నో విషయాలు అర్థమవుతాయి. మొత్తంగా చూసినప్పుడు ముప్పయి నలభై ఏండ్ల కిందికంటే జనాలు సుఖంగా, తృప్తిగా ఉన్నారా? మరయితే ఈ సంక్షోభం ఎందుకు? సాంప్రదాయకపరమైన వృత్తులు పోవడంవల్ల పోతుండటం వల్ల, సుఖం పెరిగిందా? బతుకుతెరువు మార్గాలు పెరిగాయా? అలా అయితే జనాల్లో సంక్షోభం కనబడకూడదు. ఏంటీ సంక్లిష్ట పరిస్థితి? వీటన్నిటి గూర్చీ ఆలోచించాల్సిన అవసరముంది. అభివృద్ధి పేరుమీదనో, పరిణామ క్రమం పేరుమీదనో ఇప్పుడు జరుగుతున్న పద్ధతిలో జరిగితే మన దేశంలో మెజారిటీగా ఉన్న వృత్తి పని వారి సమస్యలకు పరిష్కారం లభిస్తుందా? వాళ్లందరికీ బతుకుదెరువు మార్గాలు దొరుకుతాయా? ఇవన్నీ ప్రశ్నలు. వీటన్నిటికీ సమాధానాలు దొరికినట్టే దొరికి మాయమైపోతున్నాయి" అన్నాడు శంకరయ్య.

ఆ మాటల్లో ఎన్నో అర్థాలున్నట్లు గ్రహించారు వాళ్లు. భాస్కర్‌కూ ఏం మాట్లాడాలో అర్థం కావడంలేదు. వచ్చిన వాళ్లందరికీ టీలు తెచ్చిచ్చింది శారద.

'ఇగో నేను మీతీరుగ సదువు శాత్రం వచ్చినోన్ని కాదు. పెద్దపెద్ద వయిలు సదివినోన్నీ కాదు. మీరెన్నన్న చెప్పుండ్రి ఏమన్నను కోండ్రి. గివ్వి గా చాదస్తపు ముసలోని మాటలని తీసిపారేసినా నేనేమనుకోను. జరిగేటియి చూసుటానికి గూడ నేనుండ. నాపని ఇయ్యాల్లనో రేపో అన్నట్టే ఉంది. కానీ ఇగో నేను చెప్పే గివ్వీట్ని యాదికుంచుకోండ్రి.

రోజు రోజుకు దురాశలు పెరుగుతున్నాయి. గందుకే మరి దుఃఖం పెరుగుతోంది. పేర్లు ఏవిబెట్టినా, కారణాలేం చెప్పినా గీ సేసేటియన్ని సుఖవాంఛతోనే. ఏం లేకున్నా మంచిదే కాని నాకు సుఖముంటే చాలనుకుంటారు. మరిగ దుఃఖం పెరుగకుంటేమైతది?

ఇగో! గీ పైపై మెరుగుల పనులు, గీ నౌకర్లు, గివ్వేందో పరిశ్రమలు గివ్వన్ని తాత్కాలికమైనవే. నేను కులాలుండన్నని, గిట్ల కులభేదాలుండన్నని చెప్పుతలేను కాని గా వృత్తులే, వృత్తిపనులే అందరికి శాశ్వతంగా అన్నం బెట్టేటియి. గివ్వే మరి బతుకుదెరువు చూపేటియి. గిది శిలాక్షరం. గదేదో పద్యముంది సూడండ్రి. 'గువ్వల చెన్నా' గదాన్ని యాదికుంచుకోండి." అని లేచి నిల్చున్నాడు మచ్చయ్య.

ఆ మాటలందరినీ ఆలోచనలో పడేసాయి. శంకరయ్య చాలా ప్రశ్నలకందులో సమాధానాలు దొరికాయి.

మాజీ దొర రాజారామ మనుమడు వెంకట్రావ్ కారుదీసుకొచ్చి ఇంటిముందా పాడు. మరికొద్దిసేపట్లోనే మరో కారొచ్చి ఆగింది.

"రెండు కార్లొచ్చినయి. సామాన్లు తీసుకొని నడువుండ్రి. హైదరాబాద్ చేరేసరికి నాలుగైదు గంటలు పడుతుంది." అన్నాడు రమేష్.

అందరూ లేచి నిల్చున్నారు.

తయారుగా ఉన్న సూటుకేసులను కార్ల లోకి తీసుకెళ్తున్నారు వీరయ్య, శ్రీరాం.

"ఊరును మరిసుండద్దు బిడ్డ."

"దేశాన్ని మరిసుండద్దు బిడ్డ!"

"తల్లిదండ్రులను మరిసుండద్దు బిడ్డ!"

"నీ వాళ్లను మరిసుండద్దు బిడ్డ!"

రమేష్, సురేష్, మల్లీశ్వరులకు చెబుతున్నారు స్త్రీలు. "బాబూ రమేష్! సురేష్! మీ తాత, మీ నాన్న, మీరూ ఏ నేపథ్యం నుంచి వచ్చారో మీకు తెలియంది కాదు. మీరెక్కడున్నా, ఏ స్థితికెదిగినా మీ మూలాలను మరిచుండొద్దు. ఇదొక్కటి గుర్తుపెట్టుకుంటే మీరే ప్రలోభాలకూ లొంగరు." అన్నాడు కొక్కుల భాస్కర్. "అంకుల్! అమ్మా నాన్నా! మచ్చయ్య తాతా! పెద్దమ్మ! పెద నాన్నా! శ్రీరామన్నయ్యా! లచ్చవ్వ పెద్దమ్మా! సార్లూ! రెడ్డిసాబ్ రావుగారూ! ఊరివాళ్లందరికీ చెబుతున్నాను. నా ఊరి మీద ఒట్టేసి చెబుతున్నాను. నేను అమెరికాకు పోతున్నది ప్రపంచాన్ని మరింత విస్తృతంగా చూడటానికి. డబ్బు సంపాదించుకురావడానికి. నేనెక్కడున్నా ఊర్ను, దేశాన్ని, నా వాళ్లను ఎవరినీ మరిచుండను. ఐదారేళ్లుండి డబ్బు సంపాదించుకుని తిరిగొస్తాను. మిగతా జీవితాన్ని నా దేశం కోసం, నావాళ్ల మధ్యనే గడుపుతాను. ఇది శిలాక్షరం. నా మాట నమ్మండి. నేనే ప్రలోభాలకూ లొంగను" అన్నాడు రమేష్.

పటపట కారుతున్న కన్నీళ్లను తుడుచుకుంటూ కారెక్కాడు. మిత్రుని పక్కన కూర్చున్నాడు. రమేష్ పక్కనే కూర్చుంది మల్లీశ్వరి. వెనుక సీట్లో సురేష్, శంకరయ్య, శారద కూర్చున్నారు. మరో కార్లో శ్రీరాం, లచ్చవ్వ, వీరయ్య, లక్ష్మి, భాస్కర్, సీతారాం కూర్చున్నారు.

అందరూ వీడ్కోలు చెబుతుండగా కార్లు స్టార్టయ్యాయి.

హైదరాబాద్‌లో విమానమెక్కించి వాళ్లంతా తిరిగొచ్చారు. ముంబయిలో ఒక రోజుండి ఇద్దరు కొడుకులను విమానమెక్కించాడు శంకరయ్య. తన కొడుకులను తీసుకెళ్లు పైకెగురుతున్న విమానాన్ని చూస్తున్న శంకరయ్య, శారదల హృదయాలు మరింత భారమయ్యాయి. శారద, మల్లీశ్వరిలతో హైదరాబాద్‌కు తిరిగొస్తున్న శంకరయ్య మదిలో ఎన్నో ఆలోచనలు.

రమేష్ ఆ మాటలను హృదయపూర్వకంగానే అన్నాడన్న మాట వాస్తవమే. కాని ఐదారేళ్లు అమెరికాలో ఉండి, ఆ సుఖాలకు మరిగిన తర్వాత ఆ మాటలు జ్ఞాపకం ఉంటాయా? అందరిలాగే రమేష్, సురేష్ కూడా అక్కడే ఉండిపోతే? తాను, శారద కొడుకుల కోసం నిరీక్షిస్తూ ఉండాల్సిందేనా? ఎదురుచూపులతో గడపాల్సిందేనా? ఐదారేళ్ల సుఖవంతమైన జీవితం, ఆ సుఖవాంఛా ప్రవాహం, ప్రలోభాలు రమేష్‌ను వెనక్కి తిరిగి చూసేట్టు చేస్తాయా? అనుమానమే! శంకరయ్యలో ఆందోళన.

ఇక ఆలోచించలేకపోయాడు.

కళ్లు మూసుకున్నా, తెరిచినా నూరేళ్ల వయసుకు దగ్గరగా ఉన్న మచ్చయ్య మాటలే చెవుల్లో గింగురుమంటున్నాయి.

'గువ్వల చెన్నా గువ్వల చెన్నా.'

పదే పదే తనలోతానే గొణుక్కుంటున్నట్టనుకుంటున్నాడు శంకరయ్య.

ఎందుకో ఈ పదాలాతని ఆందోళనకు కొంత ఉపశమనాన్ని కలిగిస్తున్నాయి.

✦



# సంగీతం వినిపించే పుష్పాలు

దైవం ఇచ్చిన కానుకలు పుష్పాలు! ఎన్నెన్నో పువ్వులు. వేటి అందం వాటిదే! సొగసుతోపాటు అనిర్వచనీయమైన సుగంధంతో చుట్టుముడతాయి అవి. వాటి పరిమళం ఓ రసరమ్యగీతం! తమ సొగసులు, సుగంధాలతోపాటు పుష్పాలు సంగీతం కూడా వినిపిస్తే ఎలా ఉంటుంది?

ఆ అనుభూతికి రూపకల్పన చేస్తూ, టోకియోలో ఓ సాధనం ద్వారా, స్పీకర్లగుండా, పుష్పాల నుంచి సంగీతం వినిపిస్తున్నారు. ఒక టెలికమ్యూనికేషన్ సంస్థవారు 'కీ' అనే సాధనం ద్వారా మొక్కల కాండం నుంచి పూలకు సంగీతాన్ని ప్రసారం చేస్తారు. 'కీ' అంటే పూల శబ్దం అని అర్థం. ఇప్పటికిప్పుడే 10 వేల ఆర్డర్లు ఈ 'కీ' కోసం వచ్చాయి! పూలకు ఏర్పాటు చెయ్యబడిన రెగ్యులర్ స్పీకర్లకన్నా చెవులకు బుల్లి స్పీకర్లు ఏర్పాటు చేసుకుని సంగీతం వినడం ఎంతో హాయిగా ఉంటుంది. 'కీ' ఖరీదు 46 డాలర్లు.

# మినీ కథలు

**భూ**పాలరావుకు ఓ అతి పెద్ద సూపర్ మార్కెట్ ఉంది. ఆ వ్యాపారాన్ని నడపడానికి అతి సమర్థుడైన మేనేజర్ ఎవరా అని ఆలోచించి, వెతికి వెతికి, చివరికి కనకాంబరాన్ని దానికి మేనేజర్‌గా నియమించాడు భూపాలరావు.

## మూడు కవర్లు!

అంతకు ముందున్న మేనేజర్ నిష్క్రమిస్తూ, కనకాంబరాన్ని పక్కకు పిలిచి, అతణ్ని అభినందించి నెంబర్లు వేసి వున్న మూడు కవర్లు అందించాడు.



అవి దిట్టంగా రాసిన 'జిగురుతో బందోబస్తుగా అతికించబడి ఉన్నాయి.

"బ్రదర్! నువ్వు కష్టంలో పడినప్పుడు నెంబర్‌వన్ అని రాసి ఉన్న కవరు తెరిచి చూడు" అన్నాడు.

కొన్ని నెలల పాటు కనకాంబరం నిర్వహణలో సూపర్‌బజార్ బాగానే నడిచింది. తర్వాత క్రమేపీ అమ్మకాలు తగ్గిపోయాయి. కనకాంబరం ఎంత ప్రయత్నించినా అమ్మకాలు పెరగలేదు. విచారంలో మునిగిపోయిన ఆ మేనేజర్ ఓ రోజు పాత మేనేజర్ ఇచ్చి వెళ్ళిన నెంబర్‌వన్ కవరు తెరిచి చూశాడు.

"నీకు ముందున్న మేనేజర్‌పై నీకొచ్చిన ఇబ్బందిని నెట్టివేయ్!" అని ఆ కవర్లోని కాగితంపై వ్రాసి ఉంది.

భూపాలరావు కనకాంబరం పై క్లాసు తీసుకున్నాడు.

"ఈ పరిస్థితికి పాత మేనేజర్ కారణం సార్! అతను మన షాపులోని అన్ని రాక్స్‌లో చవకబారు ఐన నాణ్యతలేని సరుకులు నింపేశాడు. అందువల్లనే మన సేల్స్ దెబ్బతిన్నాయి!" విన్నవించాడు కనకాంబరం.

భూపాలరావు అతని వంక గంభీరంగా చూస్తూ నిలబడ్డాడు.

"సార్! కొద్ది కాలంలో ఈ పరిస్థితిని నేను చక్కదిద్దుతాను" అన్నాడు మేనేజర్.

కొద్ది రోజుల్లోనే అతని అదృష్టం బావుండి పండగ రోజులు వచ్చాయి. అమ్మకాలు విపరీతంగా పెరిగాయి. పండగలు గడిచిన తర్వాత కూడా సూపర్ బజార్ అమ్మకాలు బాగా సాగాయి. కొన్నాళ్ళు గడిచాక తిరిగి అమ్మకాలు ఘోరంగా తగ్గుముఖం పట్టాయి. పరిస్థితి క్రమేపీ ఘోరంగా తయా

రయింది. భూపాలరావు ఈ సారి పెద్ద క్లాస్ తీసుకున్నాడు.

కనకాంబరం బాగా ఆలోచించి, పాత మేనేజర్ ఇచ్చిన రెండవ నెంబరు కవరు తెరిచాడు.

"మార్కెట్లోకి వస్తున్న కొత్త కొత్త సరుకులను తెచ్చి అమ్మకాలు సాగించు. బాగా కష్టించి పనిచెయ్యి" అని ఉంది.

కనకాంబరం ఆ సూచనల ప్రకారమే చేశాడు. తిరిగి కొనుగోలు దారులు హెచ్చుగా రాసాగారు. అమ్మకాలు ఇబ్బడి ముబ్బడి అయ్యాయి. అలా ఓ సంవత్సరం గడిచింది. పిమ్మట రోజులు గడిచే కొద్దీ అమ్మకాలు బాగా తగ్గాయి. అంతకంతకూ వ్యాపారం ముగిసే స్థితికి వచ్చింది.

కనకాంబరం దిగులు చెందలేదు. తన దగ్గర మూడవ కవరు ఉంది. అందులో ఆ విపత్కర పరిస్థితి నుంచి తాను బయటపడే మార్గం తప్పక ఉంటుంది. ఆ ధైర్యంతో కనకాంబరం మూడవ కవరు తెరిచాడు.

"వెంటనే మూడు కొత్త కవర్లు తయారు చెయ్యి!" అని కవర్లోని కాగితంపై వ్రాసి ఉంది!!

– కొడిమెల శ్రీరామమూర్తి

---

## పాదాక్రాంతం

ఎడిటర్ హడావిడిగా మధ్యాహ్నం ఇంటికి వచ్చారు. వస్తూనే "తొందరగా అన్నం వడ్డించు. ప్రెస్ మీట్‌కి వెళ్లాలి" అన్నారు.

అన్నం తింటూన్న ఎడిటర్‌గార్ని అడిగింది భార్య "మా అన్నగారు రాసిన కథచూశారా, ఎలా ఉంది" అని!

విసుగ్గా ఉన్న ఎడిటర్ "దీనికి ఒక వేళా పాళా లేదా అని" అనుకున్నారు.

కథ గురించి ఏమీ చెప్పక పోయేసరికి, కేబేజీ "కూర ఎలా ఉంది" అని అడిగింది భార్య. భోజనానికి వచ్చేముందే చదివిన కథ బాగా లేక పోవడంతో ఎడిటర్ మనస్సంతా చికాగ్గా ఉంది! అదే విషయం భార్యతో చెప్పి, "తర్వాత మాట్లాడదాం" అన్నాడు.

"మీకు అనేకసార్లు చెప్పాను. భోజనానికి వచ్చేముందు చెత్త కథలు చదవవద్దు అన్నం తినలేరని అయినా మీరు మానరు!" అంది భార్య

"చదవక ముందు, అసలు కథ ఎలా 'ఉంటుందో ఎలా తెలుస్తుంది! ఆ మాత్రం తెలివితేటలు నాకులేవా! అనుకున్నాడు ఎడిటర్.

మొత్తం మీద భోజనం ముగించుకుని బయటపడ్డారు ఎడిటర్.

ఆ మర్నాడు మళ్లీ భోజనం వేళ, తన అన్నయ్య రాసిన కథ గురించి నిలతీసింది భార్య. "ఆ కథ యిచ్చి రెండు నెలలు అయింది! అసలు చూశారో లేదో తెలియదు! వేస్తారో లేదో తెలీదు! నన్నూ, నాపుట్టింటి వాళ్లనీ యిలా ఎంతకాలం బాధపెడతారు? "

"నీవే కదా భోజనం ముందు చెత్తకథలు చదవ వద్దన్నావు" అన్నారు ఎడిటర్.

"అంటే మా అన్నయ్య రాసినది చెత్తకథా! మేము చెత్త రాయం! మాది పండిత కుటుంబం!" అంది భార్య, ఉక్రోషంతో.

"అదే నా భయం! మీ వాళ్లు పండిత పుత్రులని! ఏది, ఎక్కడ, ఎప్పుడు వెయ్యాలో మాకు బాగా తెలుసు. కాలం సమీపిస్తే అదే పడుతుంది" అన్నారు ఎడిటర్ నర్మగర్భంగా.

"దానంతటదే పడాలిగాని మీరు మాత్రం వెయ్యరన్నమాట!" అంది భార్య.

తర్వాత ఒక నెల రోజులకి బావమరిది తను రాసిన కథ విషయం తేల్చుకుందామని స్వయంగా హైదరాబాద్ వచ్చాడు.

తన కథ ఎంతవరకు వచ్చిందని చెల్లెల్ని అడిగాడు "ఎక్కడ వేసిన గొంగళి అక్కడే ఉంది" అని చెప్పింది చెల్లి.

మళ్లీ ఎడిటర్ భోజనానికి వచ్చినప్పుడు ఆకథ గురించి యింటిలో పోరు. ఎడిటర్‌కి కోపం వచ్చి "భోజనం తొందరగా చేసేద్దా

మని ఆ పెరుగు వడ్డించేయి వెళ్లిపోతాను" అన్నారు.

"ఆ కథ వేసేవరకూ యింక పెరుగు వెయ్యను యిదిగో మజ్జిగ పోసుకోండి!" అని చాటుగా నిలబడి చూస్తున్న అన్నయ్యకేసి చూసింది, ఎలాఉంది మన ప్రతాపంఅన్నట్లు!

ఎడిటర్ మళ్లీ ఆఫీసుకు వెడుతూంటే "బావగారూ! నా కథ" అన్నాడు బావమరిది.

ఎడిటర్ కోపంగా యింటిలోని పోరు యింతింతకాదయా అని వేమన పద్యం గట్టిగా చదువుకుంటూ బయటికి వెళ్లిపోయారు.

"చూడేవే చెల్లీ! నువ్వు చెవులోని జోరీగ! నేను చెప్పులోని రాయినీ కాబోలు"! అని చెల్లికి సద్బోధ చేశాడు అన్నగారు.

సాయంకాలం యింటికి వచ్చిన తర్వాత తోబుట్టువులు తగులుకున్నారు,

ఆ కథ గురించి!

"ఈ పత్రిక" ప్రియబంధుమిత్ర జనావళి పత్రిక కాదనీ, పైగా అది ఎంతోమందికి జీవనోపాధి!" అని ఎడిటర్ ఖచ్చితంగా చెప్పారు.

పట్టుదలలు పెరిగాయి! ఒక రోజు ఎడిటర్ బావమరిది పత్రికా కార్యాలయానికి వెళ్లాడు. అక్కడ తన బావగారు చాలా విసుగ్గా కనిపించారు! "తను రచయిత! రచయితకి స్వేచ్ఛ ఉంటుంది కదా!" అని ఎడిటర్‌ని తన కథ గురించి నిలదీశాడు బావమరిది.

"నువ్వు స్వయంగా రావాలటయ్యా! ఈ రోజు వస్తూనే వేసేశాను!" అన్నాడు ఎడిటర్.

"ఒక్కసారి చూస్తాను. ఏమైనా తప్పులున్నాయేమో" అన్నాడు బావమరిది.

"తప్పులూ, మంచీ, చెడూ చూడ్డానికే కదా మేము ఉన్నది" అన్నారు ఎడిటర్.

"అయినా చూస్తాను" అన్నాడు బావమరిది. ఎడిటర్‌కి చూపించక తప్పలేదు

డైరెక్ట్‌గా చూపలేక, ఒక రూపాయి బిళ్ల తన టేబుల్ క్రింద కావాలని పడేసి "చూద్దువుగాని, ఆరూపాయి తీసి ఇవ్వు" అన్నాడు బావమరిదితో



రూపాయి తీసి యిద్దామని కిందకు వంగిన బావమరిదికి, తను రాసిన "పాదాక్రాంతం" కథ ఎడిటర్‌గారి టేబుల్ కింద ఉన్న బుట్టలో కనిపించింది! విసిగిపోయిన ఎడిటర్‌గార్కి ఆకథ ఎక్కడో అక్కడ వెయ్యక తప్పలేదు.

"ఈ రోజు పొద్దున్నే వేస్తాను" అంటే "పత్రికలో వేసేస్తాను అన్నాడని అనుకున్న బావమరిదికి ఎడిటర్‌గారి పాదాక్రాంతమయిన తన కథను చూసి కళ్లనీళ్ల పర్యంతమయింది.

ఇంటికి వెళ్లి తన చెల్లెలిలో జరిగిన కథ చెప్పాడు.

"ఆ అంతపని చేశారా! యింటికి రానీ చెప్తాను" అంది చెల్లి.

ఎడిటర్‌గారు మాత్రం తక్కువ తిన్నారా! అసలు పదిరోజులు యింటికే రాలేదు! ప్రశాంతంగా హోటల్లో గడిపారు.

– భమిడిపాటి సోమయాజి

## బోడెమ్మ హోటల్

ఓ నగరంలో 'బోడెమ్మ హోటల్' అనే సెంటర్ ఉంది. కండక్టర్లు ఆ సెంటర్ రాగానే "ఎవరండీ బోడెమ్మ హోటల్ సెంటర్? దిగాలి-దిగాలి!" అని అరుస్తారు- అ సెంటర్లో దిగేవాళ్ళనుద్దేశించి. ఒక్కోసారి విసుగుతో ఉన్నప్పుడు బద్ధకంగా "ఆ ఎవ రండీ బోడెమ్మ? దిగాలి -దిగాలి" అంటుం



టారు. ఒకసారి నేను బస్‌లో ఉన్నప్పుడు ఒక ముసలమ్మ ఎక్కి నా ముందు సీట్లో కూర్చుంది. టికెట్ చింపేముందు కండక్టర్ ఆ ముసలమ్మని "ఎక్కడికి? " అని అడి గాడు. ఆమె అందుకు జవాబుగా "ఫలానా డాక్టర్ గారి కంటి ఆసుపత్రికి" అంది. కండ క్టర్ టికెట్ ఇచ్చాడు. ఆ ఆసుపత్రి బోడెమ్మ సెంటర్లోనే ఉంది. బస్ కొద్ది నిముషాల్లో ఆ సెంటర్‌కు చేరుకుంది.

మామూలుగానే కండక్టర్ -"ఆ! బోడెమ్మ ఎవరండీ? దిగాలి". అని అరిచాడు.

నా ముందు సీట్లోని ముసలమ్మ కదలక పోవటం చూసి ఆమె ఎక్కడ దిగవలసిందీ గుర్తుపెట్టుకున్న కండక్టర్ "నువ్వు బోడె మ్మేగా! దిగవేమమ్మా? " అని అన్నాడు.

వెంటనే ఆ ముసలమ్మ కోపంగా లేచి- "బోడెమ్మనేలే నాయనా! ఎందుకన్ని సార్లు అంటావు? నీ వాళ్ళెవరనైనా ఇలా అంటే ఊరుకుంటావా? పాపం పుణ్యం అక్క ర్లేదూ? " అని గట్టిగా అరిచింది.

కండక్టర్‌తో సహా బస్‌లోని వారందరం మొదట తెల్లబోయి ఆ వెంటనే నవ్వుకున్నాం. తర్వాత ఆ ముసలమ్మకు అసలు విషయం చెప్పి ఆమె వెళ్ళవలసిన ఆసుపత్రి ఆ సెంట ర్లోనే ఉందని చెప్పాం. నెత్తిమీద ముసుగు సవరించుకుంటూ దిగిపోయిందామె.

– బద్దిగం పాండురంగారెడ్డి



# రచయితలకు సూచనలు

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతుర కతలు', 'చతుర ప్రపంచం' వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో *100* పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో *100* పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆ మేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండే సైజులో పంపడం మంచిపద్ధతి.**

★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్ట్‌లోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన *4* వారాలలోగా ప్రచురణార్థంగా భావిస్తే ఆ విషయం తెలియ పరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ **ప్రతి నవలకు అందజేసే రూ. 3000/- పారితోషికం ఏ నెల 'చతుర'లో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.**



# చతుర సమీక్ష



ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 082 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

★ మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ. 100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, పఠనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యం కాదు.

**కూపన్**

ఫిబ్రవరి చతుర నవల **గువ్వల చెన్నా**

చిరునామా: ____________________

____________________

____________________

____________________

# పైసాలేని ప్రయాణం పై సమీక్షలు

డిసెంబర్ 'చతుర'లో ప్రచురితమైన ఆరవల్లి నరసింహారావు నవల 'పైసాలేని ప్రయాణం' పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## ఆదర్శప్రాయుడు

*(మొదటి బహుమతి రూ. 100/-లు పొందిన సమీక్ష)*

నిస్వార్థం, నీతినిజాయితీలనే ఉచ్ఛ్వాస నిశ్వాసాలుగా జీవించే వారి వలన సమాజానికి ఎంతగా మేలు కలుగుతుందో, ప్రస్తుతమున్న సమాజానికి వారి అవసరం ఎంతగా ఉందో, కుళ్ళిన రాజకీయాన్నేకాక అడుగడుగున అడ్డు తగులుతున్న విషమ పరిస్థితులను సైతం ఎదుర్కొని మాతృదేశానికి, తోటి సోదరసోదరీమణులకు అండగా నిలిచి వారికి శాంతి సౌఖ్యాలతో కూడిన జీవితాన్ని అందించడంలో ప్రతి పౌరుని పాత్రని ఈ నవలలోని రాజు పాత్ర తెలియజేస్తుంది.

అసాధారణమైన తెలివితేటలున్న రాజు సొంత ఊళ్ళో సమస్యలను పరిష్కరించిన తీరు, తర్వాత తన గురువుగారైన విశ్వనాథంగారిని ఆపదల నుండి కాపాడడానికి హైదరాబాద్ వెళ్ళడం, అక్కడ "ఇంతింతై వటుడింతై" అన్న చందాన రాష్ట్రమంతా తన అభిమానులను ఏర్పరచుకొని ముఖ్యమంత్రిగారి చేత కూడా ప్రశంసలు అందుకుని రాష్ట్రాన్ని, ప్రజలను ఉస్మాన్, ఓంప్రకాష్, పాండులాంటి దుర్మార్గుల బారి నుండి రక్షించడం అతనిలోని చాకచక్యానికి, నిస్వార్థమైన సేవకు ప్రతీకగా నిలుస్తుంది. మన తలంపులోనికి వస్తేనే భయపడే స్మశానం మన జీవితాలతో పెనవేసుకుపోయిన భయంకర నిజమైన "పైసాలేని ప్రయాణాన్ని" వివరించడం నిజంగా అద్భుతం. జననం ఎంత సహజమో, ప్రతి ప్రాణికి మరణం కూడా అంతే సహజమన్న భగవద్గీత చెప్పిన సత్యాన్ని ప్రతి ఒక్కరూ గ్రహించి "సాటి మనిషికి మేలు చేయకున్నా ఫరవాలేదు, కీడు చేయకూడదు"




అనే చిన్న సత్యాన్ని గ్రహించి మసలుకున్న నాడు; "మానవ సేవే మాధవ సేవ" అన్న రామకృష్ణుని మాటలు ఆచరణలో చూపగల్గిన నాడు మనిషే దేవుడు. ఈ గొప్ప సత్యాన్ని నవల ప్రతి సంఘటన ద్వారా ఎంతో హృద్యంగా వివరించింది అనడంలో అతిశయోక్తి లేదు.

ప్రతి సమస్యకు పరిష్కారం ఉంటుందన్న సత్యాన్ని గ్రహించి, ప్రతి ఒక్కరూ ధైర్యంగా సమస్యలను పరిష్కరించుకుని దేవుడు

మనకు ప్రసాదించిన ఉత్కృష్టమైన మానవ జన్మను, ఈ అమూల్యమైన జీవితాన్ని ఆనందమయం చేసుకోవడంలో ముందుకు అడుగువేయాలని రచయిత తెలియజేసిన తీరు ప్రశంసనీయం. పట్టాభి, నవీనల పాత్రలు కథనానికి పట్టునిచ్చాయి. వెరైటీ డైలాగులు, నవ్వు తెప్పించే వర్ణనలు కథకు వన్నె తెచ్చాయి. చదివే వారికి మానసిక ఉల్లాసాన్ని అందించాయి. ఈ నవల చదువుతున్నంతసేపు ఒక సస్పెన్స్ థ్రిల్లర్ సినిమా చూసిన అనుభూతిని పొందేలా చేయడమే కాక ఒక గొప్ప సందేశాన్ని కూడా అందేలా చేయడంలో రచయిత కృతకృత్యులయ్యారు. హేట్సాఫ్ టు ఆరవల్లి నరసింహారావుగారు.

**– యం. చినవెంకటరావు,**
సారపాక

## శ్రవ్యకావ్యం

***(రెండవ బహుమతి రూ. 75/–లు రూపాయలు పొందిన సమీక్ష)***

సమాజంలోని సమస్యల స్వరూపాలను సాధారణ నవలలు చిత్రిస్తాయి. కానీ ఆరవల్లి నరసింహారావుగారి "పైసాలేని ప్రయాణం" వేయితలలుగా విస్తరిస్తున్న వికృతస్వరూపాలను సూచిస్తున్నది. రాఘవరావు, బాపినీడు, పాండు, ఉస్మాన్‌ల వంటి ప్రతి నాయకులే సమాజంలో అడుగడుగునా దర్శనమిస్తారు. అయాచితంగా వచ్చే డబ్బుకోసం ఎగబడే జనమూ కనిపిస్తారు. వాస్తు, జ్యోతిష్యాల పట్ల ప్రజలకున్న అతి విశ్వాసాన్ని అడ్డంపెట్టుకుని పబ్బం గడుపుకునేవారూ అగుపిస్తారు.

పైసా లేకుండా పుట్టి, పైసా వెంట తీసుకువెళ్ళలేని మనిషి పైసల సంపాదన కోసం చేసే పనులు ఇన్నీ-అన్నీ కావు. ఇలాంటి పనుల స్వరూప స్వభావాల్ని రచయిత ఆద్యంతం ఆసక్తికరమైన శైలిలో చిత్రించారు. రాజు పాత్ర ద్వారా మానవతా సందేశాన్నిస్తూ రచయిత స్వార్థానికి దూరంగా, జ్ఞానానికి దగ్గరగా సన్మార్గ ప్రయాణం చేయాలన్న సందేశమిందులో కనిపిస్తుంది. విశ్వనాథం మాస్టారు-రాజు, గురు-శిష్య సంబంధానికి లక్ష్య ప్రాయంగా కనిపిస్తారు. దుష్టశిక్షణలో గురువుకు శిష్య సహాయం ఉదాత్తంగా చిత్రించబడింది. రైల్లో కపట సన్యాసి ఘట్టంలో రాజు ప్రతివ్యూహాలతో సాగే అధిక్షేపాత్మక శైలీయమైన ఈ నవల చదువరులను నవ్విస్తుంది. మతకల్లోలాల్నుంచి, ప్రజల్ని, ముఖ్యమంత్రిని, పాండు ముఠా నుండి పద్మినిని కాపాడే సందర్భాలలో రాజు సమయస్ఫూర్తి యువతకు చక్కటి సందేశాన్నిస్తుంది. అజ్ఞాతవ్యక్తిగా వుంటూ కష్టాలలో తనను తాను రక్షించుకుంటూ, ఇతరుల్ని రక్షిస్తూ, కార్యదీక్షతో సాహసిగా ఎలా ప్రవర్తించాలో రాజు పాత్ర జాగృతం చేస్తున్నది. నిరాడంబరత, ఆచరణలో నిబద్ధతగల వ్యక్తికి చురుకైన ఆలోచన, సమయ స్ఫూర్తి తోడైతే పైసా లేకున్నా ఆత్మవిశ్వాసంతో అనంత లక్ష్యాల్ని ఛేదిస్తూ ప్రయాణం చేయగలడన్న సత్యాన్ని ఆవిష్కరిస్తుందీ రచన.

**– డా॥ కలువకుంట రామకృష్ణ**
మెట్‌పల్లి- 505325

## భారతావనిపై చీడపీడలు

***(మూడవ బహుమతి రూ. 50/–లు పొందిన సమీక్ష)***

పైసాలేని ప్రయాణంలో పయనిస్తూంటే ఈ నవలకు "ఇలా జరిగితే" అనే టైటిల్ బాగుండేదేమోనని అనిపిస్తుంది. రచయిత నవలలోని పాత్రలకు సృష్టించిన కాల్పనిక సమస్యలు నవలలోని హీరో రాజు ద్వారా పరిష్కారాలు సత్యదూరమైనా ఇలా జరిగితే ఎంత బాగుంటుందని తోస్తుంది. మన దేశానికి పట్టిన చీడపీడలు వాటి శాశ్వత నివారణ జరగవచ్చునేమోనని తోస్తుంది. రచ




యిత ఇప్పుడు మన ప్రజాస్వామ్య ముసుగులో జరుగుతున్న అరికట్టలేని అన్యాయాలు అక్రమాలు, వాటిని అరికట్టలేని దుస్థితికి చేరిన ప్రజానాయకులు ప్రజాసేవకులు. పైగా వీరే ధనార్జన అధికార వ్యామోహాలతో తమ అనుచరుల ద్వారా చేయించి అమాయిక ప్రజలను పీడిస్తూ ప్రజాధనాన్ని కొల్లగొడుతుండడము రోజూ చూస్తూనే ఉన్నాము, ప్రస్తుతము బీహార్ రాష్ట్రములో పరిపాలన చేస్తున్న ప్రజానాయకులు, వారి బంధుగణము అనుచరులు చేస్తున్న ఆగడాలు రోజూ పేపర్లలో చదువుతూవుంటే నవలలోని ఓంప్రకాష్‌లు, పాండులు, ఉస్మాన్‌లు వీరే కదా అని తోస్తుంది. ఇలాంటి విద్రోహులు మనదేశములో అమలవుతున్న ఈ తరహా ప్రజాస్వామ్య పాలనతో ఇలాగే కొనసాగితే ఇంకా ఏమేమి దురాగతాలు చేస్తారో! ఈ నవలలోని రాజు లాంటివారు తయారైతే ఎంత బాగుండని అనిపిస్తుంది. రచయిత కాల్పనిక తార్కికశక్తికి జోహార్లు. ఎందుకంటే ఈ నవలలోని హీరో రాజు రైల్లో ప్రయాణిస్తున్నప్పుడు తోటి ప్రయాణికుడు అతనిని ఒక ప్రశ్నతో నిలదీసినప్పుడు పరమశివుని గురించి పోల్చడం చాలా బాగుంది. మన తెలుగు సినిమాలో మాదిరి ఈ నవలలో రాజు నవీన పాత్రలను హీరో, హీరోయిన్‌లుగా చిత్రించినా ఆఖరున వాళ్ళిద్దరిని కలువకుండా అజ్ఞాత వ్యక్తిగా చూపబడిన రాజును దేశ సౌభాగ్యానికి పాటుపడేటందుకు అందరూ వీడ్కోలు చెప్పడము ఈ నవలకు హైలైటు.

**– తుమ్మల వసుంధర,**
వాయల్పాడు

## కామెడీ సినిమా

***(నాలుగవ బహుమతి రూ. 50/–లు పొందిన సమీక్ష)***

ప్రతీ సమస్యకూ ఓ పరిష్కారం ఉంటుంది అనే కాప్షన్‌తో ప్రధానంగా కామెడీ టచ్ ఉన్నప్పటికీ అంతర్లీనంగా సమాజానికి యువత ఉపయోగపడాలి అనే సందేశంతో కూడిన నవల ఆరవల్లి నరసింహారావు రాసిన పైసా లేని ప్రయాణం అందర్నీ ఆకట్టుకొన్నది. అవినీతి, అన్యాయం, స్వార్థం, అధికార వ్యామోహంతో పలు సమస్యలు సృష్టిస్తోన్న వారినందరినీ చాకచక్యంగా, సమయస్ఫూర్తిగా వ్యవహరించి చట్టానికీ, న్యాయానికీ అప్పగించిన 'అజ్ఞాత వ్యక్తి'గా రాజు పాత్రను చక్కగా తీర్చిదిద్దారు రచయిత. నవల పరంగా, చదువుకోవటానికి, హాయిగా నవ్వుకోవటానికి 'పైసా లేని ప్రయాణం'లో రాజు చేసిన బాగానే ఉన్నాయి. కానీ కొన్ని చోట్ల 'అతి'గా, అసమంజసంగా, సినిమా దృశ్యాల్లా నడిచాయి. చందాల కోసం వచ్చిన వారి దగ్గర సంభాషణలు నవ్వు తెప్పించినా సన్నివేశాలు మాత్రం అతిగా జరిగాయి. అదే విధంగా ఎం.ఎల్.ఎ. కిడ్నాప్ చేసినప్పుడు పోలీసు వ్యవస్థను కాదని రాష్ట్ర ముఖ్యమంత్రిగారు అజ్ఞాత వ్యక్తిని ఆశ్రయించటం, అజ్ఞాతవ్యక్తి ఒక్కడే వెళ్ళి ఎం.ఎల్.ఎ.లను కాపాడటం యిలాంటివి అతిగా, చిన్న పిల్లల కథల్లా, అద్భుతాల్లా ఉన్నాయి. కానీ సహజంగా, సమాజంలో జరిగేలా లేవు. ప్రస్తుత సమాజంలో 'రాజు' చేసినట్లు చేయలేక పోయినా ఆలోచించి చూస్తే, నీతిగా, నిజాయితీగా, బాధ్యతగా ప్రవర్తించినచో ప్రతీ సమస్యకు పరిష్కారం దొరుకుతుంది అనే సందేశాన్ని మాత్రం ఈ నవల ద్వారా గ్రహించాలి. మొత్తంమీద నవలలోని ప్రతి పాత్ర. రాజు, పట్టాభి, నవీన, శివప్రసాద్, విశ్వనాథం మాష్టారు, పాండు, ఓంప్రకాష్, ఉస్మాన్ తదితర పాత్రలు మలచిన తీరుతెన్నులు- సంభాషణలు- సన్నివేశాలు అన్నీ కలిపి మంచి కామెడీ సినిమా చూసిన అనుభూతి మిగిల్చింది.

**– తెన్నేటి లక్ష్మీ నరసింహమూర్తి**
*పిప్పర-534197*

## అనిర్వచనీయం

*(ఐదవ బహుమతి రూ. 50/--లు పొందిన సమీక్ష)*

"...పురుషులందు పుణ్యపురుషులు వేరయా!" అన్న రీతిలో సాగిన రాజు పాత్ర ఆద్యంతం ఆసక్తిదాయకంగా ఉంది. చిక్కుముడి వంటి ప్రతి సమస్యకు ఒక చక్కని పరిష్కారం తెలియజెప్పే రాజులాంటి వారు నేటి సమాజానికి ఆదర్శప్రాయం. చక్కని కథాగమనం, విసుగు తెప్పించని సన్నివేశాలు, పాత్రల తీరుతెన్నులు ఒకటేమిటి అన్నీ ఈ నవలకు నిలువుటద్దాలు. సమాజంలోని అన్యాయాలను, అనీతిని సమయస్ఫూర్తితో, బుద్ధికుశలతతో పరిష్కరించిన తీరు కడు సమర్ధనీయం. సున్నితమైన సమస్యలను హాస్యయుతంగా తెలియజెప్పిన రచయితకు అభినందనలు. పేరుకు తగ్గట్టుగానే "పైసా లేని ప్రయాణం"లో రాజు ఎక్కడా పైసా ఖర్చు చేయకుండా ఆద్యంతం ఆసక్తికరంగా సాగించిన రచయిత పరిశీలనాశక్తికి ధన్యవాదములు. అమ్మాయిల హాస్టలు గురించి ప్రస్తావించినా, శృంగార సాహిత్యాన్ని చేర్చకపోవడం వలన ఒక చక్కని నవలను చదువుతున్నాను అన్న భావం కలిగింది. ఈ నవలను పైసలు పెట్టి కొన్న, చదివిన తరువాత లభించిన ఆనందం అనిర్వచనీయం. నిజంగా నలుగురు చదివి, నలుగురు చేత చదివించదగిన నవల అరవల్లె నరసింహారావుగారి "పైసాలేని ప్రయాణం".

– *బి.ఫణికిరణ్* బుచ్చి మండలం
నెల్లూరు *జిల్లా-524 305*

✦

## ఈ 'సిటీ'ల గురించి మీకు తెలుసా?

ఇక్కడ కొన్ని 'సిటీ'లకు సంబంధించిన వివరాలున్నాయి. చదవగానే ఆ 'సిటీ' ఏమిటో మీకు వెంటనే స్ఫురిస్తుంది. స్ఫురించలేదా? నో ప్రాబ్లమ్. జవాబు ఈ పేజీలోనే ఉంది.

1) మనకు 'షాక్' ఇచ్చే 'సిటీ' ఒకటుంది. ఏమిటది?
2) వేగాన్ని ఈ 'సిటీ' పేరుతో పిలుస్తారు.
3) బుద్ధి, వివేకాలకు మరో పేరు ఈ 'సిటీ'
4) సత్యవర్తనానికి నిలువెత్తు రూపం ఈ 'సిటీ'
5) వాగ్ధాటికి మారుపేరు ఈ 'సిటీ'

1) ఎలక్ట్రిసిటీ 2) వెలాసిటీ 3) సెగాసిటీ 4) వెరాసిటీ 5) లాక్వాసిటీ

– జ్యోతిరాణి

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328.
Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Chennai: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060; .Cuddapah: 70011; Tadepalli gudem: 28881; Warangal: 59933. Khammam: 55661; Ongole: 56777; Nizamabad: 45661; Mahabubnagar:77438; Mumbai: 022- 4703700; Chennai: 044- 2314980; Bangalore: 080- 3503498


వాహనం కోసమేనా ఎదురు చూపులు!
ప్రారంభమయ్యాయా చిట్టితల్లీ! పడిగాపులు!!
ఫొటో: వి. నర్సయ్య

